చతుర - నవంబరు - 1978

# స్నేహితురాలికి మీనా చేసిన సహాయం.

మీనాని లావుపాటి మన్నూ సశాయిస్తున్నాడు.







మీనాయొక్క అమ్మకు న్యూట్రామూల్ పై తెగనమ్మకం.




ఇప్పుడు మన్నూ మీనాయొక్క స్నేహితురాల్ని సశాయిస్తున్నాడు.










రోజుకు రెండుసార్లు న్యూట్రామూల్ తీసుకునే అలవాటువల్లన లాభిస్తుంది దీనికి. అందుకే దేశమందంతటా వేనవేలమంది బలాన్నిచ్చే న్యూట్రామూల్ వాడటం మొదలెట్టారు. న్యూట్రామూల్‌లో బలవర్ధకమైన, మీగడగల అమూల్ పాలతోబాటు అసలైన కోకో, మాల్ట్, పంచదార ఉన్నాయి.

ఆరే ఆశ్చర్యం! న్యూట్రామూల్ ఖరీదులో తక్కువ! న్యూట్రామూల్ 500 గ్రాముల డబ్బా ధర కేవలం రూ. 11. పన్నులు అదనం. మీనాకే గాదు ఇంకా మరెందరికో న్యూట్రామూల్ అంటే ఎంతో యిష్టం.




**అమూల్ వారి**

# న్యూట్రామూల్

**కప్పు కప్పుతో మీకు బలం వచ్చు!**

daCunha/N/29R-1/Te

## దోమలు పారిపోయాయి...హాయిగా నిద్ర పట్టేసింది

ఓడొమాస్ ఏర్పరచే కవచం దోమలను దగ్గరికి రానివ్వదు గనుక మీరు రాత్రంతా నిశ్చింతగా, హాయిగా నిద్ర పోవచ్చు. ఓడొమాస్ మీ చర్మానికి కూడా సురక్షితమైనది.




చిరకాలపు రక్షణకు అత్యంత అధునాతనమైన దోమల నివారిణి

దోమల పాలిట శత్రువు-బల్సారావారి

# ఓడొమాస్

బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి అధునాతన సాధనాలు

BALSARA బల్సారా అండ్ కంపెని (ప్రై.) లి.
43, నగీన్‌దాస్ మాస్టర్ రోడ్, బొంబాయి-400 001.

CHAITRA-BLS-243 TEL

# మళ్ళీ మీ రోజువారి పనులు మామూలుగా చేసుకోవాలని ఆత్రుతగా ఉందా మీకు?

# గ్లాక్సోస్-డి®

అలసటను ఎదుర్కొనేందుకు




dCA/GL/54/TL

మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే
అందరి నోట ఒకే మాట...



ఇది తప్పక

# డెట్

డిటర్జెంట్
బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel

# చతుర

నవంబరు 1978

సంపుటి 1 సంచిక 10

## ఈ నెల సమగ్ర నవల

ఒక పెద్ద పారిశ్రామిక సంస్థకు జనరల్ మేనేజర్‌గా ఉన్న యువకుడతను. ఆ సంస్థ డైరక్టర్లలో ఒకరు 'నీ భార్య లేచి పోయింది గదా' అనగానే ఆగ్రహావేశాలతో 'షటప్'! గెటౌట్' అంటూ మీదికి దూకాడతను. ఆ సంఘటన జరిగిన మరి కొద్ది సేపటికే అత్యంతాకర్షణీయంగా ఉన్న ఓ ఆధునిక యువతి వచ్చిందతని వద్దకు. "మీ రెవరు?" అని అతనడిగిన ప్రశ్నకు ఆవిడ ఇచ్చిన జవాబు "మీ ఒకప్పటి భార్య రాజ్యలక్ష్మి గారిని లేవదీసుకు పోయిన రాజారావుగారి ఒకప్పటి భార్యను నేను" అని. మరి ఆవిడ అలా అన్నందుకు అతనేం చేశాడు... అలా మొదలయిన కథ ఎన్ని మలుపులు తిరిగి చివరికి ఎవరు... ఎవరికి...

# పునరంకితం

...అయ్యారు? అందుకు దోహదం చేసిన పరిణామాలేమిటి? ఆ అపరిచిత యువతి అతని వద్దకు వచ్చిందెందుకు?

## జి. సత్యమూర్తి

అడుగడుగునా ఉత్సుకతను రేకెత్తించేలా సమర్థవంతంగా చిత్రించిన 'పునరంకితం' ఈనెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

## ఈ నెల ముఖ పత్రం

నేటి ఆధునిక కళను త్రోసిరాజనగల కళను అంతగా నాగరికులు కాని వారేనాడో ఆవిష్కరించారు. ఈ చిత్రం అమెరికన్ ఇండియన్లు ఉత్సవ సమయాల్లో ధరించే దుస్తులపై చిత్రించుకున్న వారి నమ్మకాలకు ప్రతిబింబం. వారి మనుగడకు ఆధారభూతమైన ప్రకృతికి వారు చేసిన రూపకల్పనే ఈ చిత్రం.

## రెండవ కవరు

భారతీయ శిల్పకళలో విరివిగా కానవచ్చే విరహిణి – యక్షిణి. భారతీయ శిల్పుల రూప సృష్టి సామర్థ్యానికిదొక మచ్చుతునక.

## మూడవ కవరు

అపురూపమైన పాలరాతి శిల్పాలంకరణకు ప్రతీక, మౌంట్ ఆబూలోని దిల్వారా ఆలయాంతర్భాగం.

## నాలుగవ కవరు

ప్రకృతే రూపొందించిన అద్భుత చిత్రం. మన జాతీయ విహంగం నెమలి పింఛం.

# చతుర విజయం

నెల నెలా ఒక సమగ్ర నవలను సచిత్రంగా సమర్పించే ఆశయంతో ఆవిర్భవించిన చతుర తన లక్ష్య సాధనలో ఇప్పటికే సఫలీకృత మయింది. ఇంత వరకూ 'చతుర' ప్రచురించిన 10 నవలలలోనూ 4 చలన చిత్రాలుగా రూపుదిద్దు కుంటున్నాయి. తొలి సంచికలో ప్రచురించిన 'కమలమ్మ కమతం' త్వరలోనే విడుదలకు కూడా సిద్ధమవుతున్నది. పది నెలల కాలంలో ప్రచురించిన పది నవలలలోనూ నాలుగు వెన్వెంటనే చలనచిత్ర పరిశ్రమను ఆకర్షించ గలగటం తెలుగు పత్రికా ప్రచురణ రంగంలోనే రికార్డు. ఇందుకు దోహదకారులైన రచయితలకు, నిర్మాతలకు 'చతుర' శుభాకాంక్షల నందజేస్తున్నది.

చతుర

ఈనాడు కాంపౌండ్

సోమాజిగూడ, హైదరాబాద్–500 004

# నిత్య పెళ్ళికొడుకు

అప్పారావు ఉదయం ఏడింటికే లాండ్రీ ఓపన్జేసి "ఆరేసుకోవోయి - పారేసుకున్నాను అరి అరి" అని కూనిరాగాలు తీస్తూ నిమిషానొక్క జత బట్టల్ని ఇస్త్రీ చేసి పారేస్తున్నాడు.

ఇంతలో నరసమ్మొచ్చింది.

నరసమ్మ తెచ్చిన బట్టల్ని ఇస్త్రీ చేసిచ్చేశాడు అప్పారావు.

నరసమ్మ వెళ్ళబోతుంటే "అత్తా... ...మరేంలేదు - మీ ఇంటి పక్కనున్న ఆపీసరుకి - ఆరి బట్టలు ఇచ్చేస్తావా" అనడిగాడు.

ఇమ్మంది నర్సమ్మ.

ఆఫీసరుగారి బట్టలన్నింటినీ ఓ పక్కన పెట్టి లెక్కెట్టాడు. ఇరవై నాల్గుండాలి. కాని ఇరవై రెండే కనపడుతున్నాయి. చెక్కబీర్వా వెతికాడు - లేవు ! క్రింద పెట్టె తీసి చూశాడు - ఊహుం!...

'ఏటబ్బా-ఏటయ్యాయి...' ఆశ్చర్యపోయాడు అప్పారావు. రేవునుండి అన్నీ తెచ్చినట్టు గుర్తే... మరి?! అయితే - రేవులో మర్చిపోయుండాలి అనుకొని "అత్తా... ఓ జత కనపట్టల్లే... నేనొచ్చి ఇస్తాగానీ నువ్వేళ్ళు" అన్నాడు.

నరసమ్మెళ్ళిపోయింది.

ఆఫీసరుగారి బట్టల్ని కట్టకట్టి- బయల్దేరాడు.

ఆఫీసరుగారు ముందు గదిలో కూర్చొని కన్పడ్డారు.

అప్పారావ్ని చూడగానే ఆఫీసరు అగ్గయి పోయాడు. "ఏమయ్యా బట్టలేస్తే వారం రోజులైనా తేవా? ఆయ్! నీకు బుర్రుందా-నీ కసలేం చెప్పాను" అంటూ ఫైరయి పోతున్నాడు.

అప్పారావు ఆఫీసర్ని మనసులో కసి దీరా తిట్టుకుంటూ - ప్యూన్‌కి బట్టలు అందచేశాడు.

ప్యూన్ అప్పారావ్ వైపు విచిత్రంగా చూసి బట్టలందుకొని లెక్కపెట్టాడు. తర్వాత "సార్... అబ్బాయిగారి జత కటి లేదు." అన్నాడు.

"రేవు నుంచి రాలేదుసార్ - రేపు తెచ్చిచ్చేస్తా" అన్నాడు అప్పారావు.



ఆఫీసర్‌గారు అప్పారావ్ని నమిలేసేటట్లు చూశారు. తర్వాత "ఏరా - గాడ్దికొడకా పూర్లంగడి లాగ ఆ బట్టలు తొడుక్కొనొచ్చి రేవు నుండి రాలేదంటావా? నీకెన్ని గుండెలురా ... రేపటికి నీ కొట్టేమవుతుందో చూడు!" అని అరుస్తున్నారు.

అప్పారావ్కి కళ్ళు తిరిగాయి. తను వేస్కున్న బట్టల్ని చూసి "కేవ్!" మని అర్చాడు. •

# తిరుక్షౌరం

మా ఊళ్ళో ఉన్న దజనుకు పైగా క్షవర శాలల్లో - సగానికి పైగా వాటిల్లో కేవలం "డిప్నకటింగ్" చేస్తారు.

అలాంటి చిన్నపట్నానికి కొత్తగా వచ్చాడు మంగలి బాబారావు.

బాబారావ్కి ఈ లైనులో పదేళ్ళకు తక్కువ లేకుండా సర్వీసుంది.

ఇంత ప్రాక్టీసున్న బాబారావ్ని మరే మంగలీ ఆదరించక పోగా "నీ కెవడు పనిస్తాడయ్యా ? !" అని వేళాకోళం చేశారు.

అలనాడు చాణక్యుడు శపథం చేసి నట్లుగా బాబారావు "ఓరీ దుర్మదాంధులారా! నేనీ ఊర్లో షాపు పెట్టి - మీ బేరాలన్నింటినీ క్షణాల మీద నా వైపు లాక్కుని—మీకు క్షవరంచేయకపోతే నా పేరు వీరవెంకట సూర్య సత్యనారాయణ పాండురంగ బాబారావు కానేకాదు" అని ఘోర శపథం చేసి బ్యాంకుల వెంట పడ్డాడు.

అతడి సర్వీసు విన్న బ్యాంకు ఆకౌంటెంటు అరుణాచలం ఆనందంతో తల క్రిందులై 'వీడికి లోనిస్తే నాకు క్షవరం ఫ్రీ' అని మనసులో అనుకొని, "ఓ తప్పకుండా లోనిస్తాం—నీలాంటి వాళ్ళ కోసమే మా బాంకుంది" అని పైకని, —బాబారావ్కి లోనొచ్చే ఏర్పాటు చేశాడు.

లోనుపుచ్చుకున్న బాబారావు సెంటర్లో ఓ స్థలం అద్దెకు తీస్కొని ఓ బడ్డీ నిర్మింపజేసి ఓ శుభ ముహూర్తాన షాపు తెరిచాడు.

ఎదురుగా ఉన్న వెంకటేశ్వర స్వామికి మనసులోనే మొక్కుకుంటూ- మొదటి బేరం కోసం ఎదుర్చూస్తూ కూర్చున్నాడు.

దేవుడు వరమిచ్చాడన్నట్లుగా - అరున్నర సమయంలో, ఓ వంకీల జుట్టు కుర్రాడు కొట్లో ప్రవేశించాడు.

బాబారావు ఆనందంతో తబ్బిబ్బయి పోయాడు. ఈ ఊర్లో నాకిది మొదటి బేరం - అని అన్కుంటూ ఆనందంగా పని ప్రారంభించాడు.



అర నిమిషం నడిచింది. నిమిషం గడిచింది. తలెత్తి ఎదురుగా ఉన్న అద్దంలో తన క్రాపు అందాన్ని చూస్తాం దామని తలెత్తిన కుర్రాడు "ఓరి నాయనోయ్" అని అర్చాడు. "ఏందయ్యా ఈ ఘోరం— ఒక ప్రక్క కంప్లీటుగా గొరిగేశావ్" అన్నడా కుర్రాడు కన్నీళ్ళ పర్యంతమై.

బాబారావ్కి తక్కున అప్పుడు గుర్తొచ్చింది ... "తాను ఇప్పుడు తిరుపతిలో లేననీ... శ్రీకాకుళంలో ఉన్నాననీను...!"

*





# చెంబు

గోపాలం-పల్లెలో పుట్టాడు. అక్కడే పెరిగాడు. అతనికున్న బీకాం డిగ్రీ అతన్ని పల్లెలో వదలేయదల్చుకోలేదు.

విశాఖలో వచ్చిన ఉద్యోగాన్ని కాదనలేక పోయాడు. పుట్టిన ఊర్ని వదల్లేక పోయాడు.

ఉద్యోగంలో జాయినయి, తెలిసిన ఫ్రెండ్ నొకణ్ని ఇల్లు వెతకమని, తిరిగి తన పల్లె చేరుకున్నాడు గోపాలం.

వంటరిగా ఉంటే బీచ్‌లో బట్టల్లేని ఆడాళ్ళ వెంటపడి తిరుగుతాడని - రాధమ్మ నిచ్చి అర్జంటుగా పెళ్ళిచేశారు పెద్దలు.

ఈలోగా ఇల్లు దొరికిందన్న వార్త వచ్చింది. పెళ్ళాంతో సహా బయల్దేరాడు గోపాలం.

మధ్యాహ్నం వేళకు ఇంట్లో దిగారు. రెండుగదుల ఇల్లైనా అన్ని సౌకర్యాలూ ఉన్నాయి. అన్నిటికంటే గోపాలానికి నచ్చిన విషయం-ఇల్లుకి సముద్రం చాలా దగ్గరగా ఉంది.

కొత్త మంచం మీద - మల్లెల గుభాళింపుని తనివితీరా ఆస్వాదించాడు ఆ రాత్రి - గోపాలం!

తెల్లారి ఐదింటికే మెలకువ వచ్చిన రాధమ్మ పైట సర్దుకుంటూ పక్కకు చూసింది.

గోపాలం లేడు! సిగ్గుపడుతూ రాధమ్మ కూడా లేచింది.

బాత్‌రూమ్‌వైపు చూసింది. గోపాలం లేడు. ఆ పక్కన చూసింది. అక్కడా లేడు. ఇంత తెల్లారే ఎక్కడికెళ్ళారబ్బా అనుకుంటూ-ఆశ్చర్యంగా ఎదురుచూస్తూ కూర్చుంది రాధమ్మ.

అరగంట గడిచింది. గోపాలం రాలేదు. రాధమ్మకెందుకో భయంగా ఉంది. "అసలింత తెల్లారే ఎక్కడికో వెళ్ళాల్సిన అవసరం ఆయనకే మొచ్చింది?" అని ఆలోచించింది.

నిమిషాలు యుగల్లా గడుస్తున్నాయి. పెరటివైపున ధబ్బుమని శబ్దమైతే అటు పరుగెత్తి చూసింది రాధమ్మ.

గోపాలం దొడ్డిదారిన వస్తున్నాడు.

"ఎక్కడికెళ్ళారండీ?" అడిగింది.

'ఎక్కడికేంటే వెర్రి మొగమా?' అన్నట్లు చూసి, చేతిలోని 'చెంబుని' పైకెత్తి చూపించాడు గోపాలం.



రాధమ్మ ఫక్కున నవ్వింది. మళ్ళీ మరోసారి నవ్వుతూ చెయ్యెత్తి బాత్రూమ్ ప్రక్కనే ఉన్న 'సెప్టిక్ లెట్రిన్'వైపు చూపింది గోపాలాన్ని.

'అవును స్మీ...మర్చిపోయాను!... అయితే మనకిక సముద్రం అవసరమే లేదన్నమాట?!' అనుకున్నాడు గోపాలం •

# ముద్దుముద్రలు

రాజు రిషీకపూర్‌లా అందంగా ఉండడు. మోహన్ బాబుకి మల్లే పెద్ద పర్సనాలిటీ ఉండదు. నల్లగా, మామూలు హైట్‌తో లైట్ కలర్ డ్రెసెస్ వేస్తూ చూడ్డానికి మామూలుగా ఉంటాడు.

అయినా కాంపెస్‌లోని చాలామంది అమ్మాయిలు రాజంటే పడి చస్తారు.

రాజుకి అందం లేకపోయినా అమ్మాయిలను అందుకొనే తెలివితేటలున్నాయి.

అతడు చూసే చూపుల్లోనూ వేసే వేషాల్లోనూ ప్రతీ దాంట్లోనూ ఒక ప్రత్యేకత ఉంటుంది.

అమ్మాయిలను కన్నుగిటడు. కళ్ళతో అనేక అర్థాలు అందిస్తాడు.

వీటన్నిటికీ తోడు రాజు ప్రేమలేఖలు రాసే తీరు ప్రత్యేకంగా ఉంటుంది. ఉత్తరాన్ని కొత్త పంథాలో రాస్తాడు. అరచేతిలో స్వర్గం చూపిస్తాడు. "మీకు ఇష్టమైతే మా నాన్నను మీ నాన్న దగ్గరకు పంపిస్తానంటాడు" అదంటాడు. ఇదంటాడు. ఆఖరిగా అతడి పెదాలకు లిప్‌స్టిక్ రాసుకొని ప్రేమలేఖ క్రింద ముద్దు పెట్టి అలా తన ముద్దులు ఆమెకు అందచేస్తాడు.

ఇలా రాజు ఇప్పటికే అనేక మంది అమ్మాయిలకు తన ముద్దులు అందచేసి వారి వేడి ముద్దులు తనందుకున్నాడు.

ఇలా కథ కొనసాగుతుండగా అక్కడ రణస్థలంలో ఉన్న రంగనాధంగారికి కొడుకు చేస్తున్న ఘనకార్యాలు ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉన్నాయి. కుర్ర సన్నాసి ఏదో ఆడపిల్లలతో కాసింత చనువుగా ఉంటే ఇన్ని కథలు పుడుతున్నాయి" అని కొట్టి పారేస్తూ వచ్చారు.

ఆ రోజు ఆయనకు రాజు నుంచి లెటర్ అందింది.

"నాన్నా కొత్తగా ఎకనామిక్స్ గైడొకటి వచ్చింది. అర్జంటుగా కొనేయాలి. లేదా స్టాకు ఐపోతుంది. అందుకని వెంటనే పది రూపాయల పావలా ఎమ్ వో. చేయి.

ఇట్లు నీ




నెక్ట్స పోస్ట్‌లో రాజుకి ఎమ్.వో. అందలేదు. సరికదా ఆ నెక్ట్స బస్సులో రంగనాధం గారొచ్చి కుమార రత్నాన్ని నాలుగు తన్ని చదువు మాన్పించేసి రణస్థలం పట్టుకుపోయి జోడెడ్ల బండిచ్చి "పొలానికి పోరా వెధవా!" అన్నారు.

తను పది రూపాయల పావలా పంపమని రాసేప్పుడు అలవాటుగా లెటర్ చివర్లో పేరు రాయక అమ్మాయిలకు వేసినట్లు లిప్‌స్టిక్ పెదాల ముద్దు 'ముద్ర' వేశానని పాపం రాజుకి తెలియదు!




# పెళ్ళిచూపులు

కారొచ్చి ఇంటిముందు ఆగగానే—

సుబ్రహ్మణ్యంగారు ఎదురెళ్ళి అందులోంచి దిగుతున్న వార్ని సాదరంగా ఆహ్వానించారు.

శ్రీధర్ ఆఖరిగా కారు దిగాడు.

ఆసీనులైన అయిదు నిమిషాలకు నీలిమను తీసుకొచ్చారు.

నీలిమ నెమ్మదిగా తలెత్తి శ్రీధర్ వైపు చూసింది. శ్రీధర్ ఆమెవైపే చూస్తుండటంతో కళ్ళూ కళ్ళూ కలిశాయి.

కాసేపు మాటలయ్యాక శ్రీధర్‌ను, నీలిమను కొద్దిసేపు ఏకాంతంగా మాట్లాడుకోమని అందరూ లోనికెళ్ళారు.

గదిలో శ్రీధర్...నీలిమ...

శ్రీధర్ నవ్వడానికి ప్రయత్నించాడు. తెలిసిందే అయినా పేరడిగాడు. ఏం చదువుతున్నారన్నాడు. ఇంకా ఏవేవో తడబడుతూ...అడిగాడు. నీలిమ అతని ఖంగారుకి ముసిముసిగా నవ్వుకుంటూ నెమ్మదిగా సమాధానాలిచ్చింది.

శ్రీధర్‌కు ఆశ్చర్యమేసింది. 'ఏందబ్బా...ఈ పిల్ల అస్సలు ఖంగారు పడదు' అనుకున్నాడు. ఆ మాటే పైకి అనేశాడు

ఆ ప్రశ్నకు నీలిమ ఫక్కున నవ్వింది.

తర్వాత "సారీ శ్రీధర్‌గారూ.... మిమ్మల్ని డిస్సపాయింట్ చేస్తున్నానేమో ...మీకిది మొదటిసారి పెళ్ళిచూపులు కావచ్చుగానీ,, నేనిప్పటికి దరిదాపు పది పెళ్ళిచూపుల్లో పాల్గొన్నాను. మొదటిసారి నాకూ విపరీతమయిన ఖంగారు పుట్టింది. కుర్రాడికి నచ్చుతానో లేదో? అతనికి నచ్చినా అతని తల్లిదండ్రులకు నచ్చుతానో లేదో? అన్నీ సరిపోయినా మేం ఇవ్వగలిగే కట్నం వారికి సరిపోతుందో లేదో? ఇలా అనేకానేక భయాలతో చాలా ఖంగారుపడ్డాను. ఆ తర్వాత ఈ తతంగమంతా అలవాటైపోయింది. నా అందాన్ని చూసి మీరు కట్నం కాస్త తగ్గిస్తారేమోననే నాన్నగారి ఆశకోసం, ఆయన సంతృప్తికోసం నేను ఇక్కడ కూర్చున్నాను".



"అంతే...అంతకుమించి నాకు ఈ పెళ్ళి చూపులమీద ఏ అభిప్రాయం లేదు. అందుకే మిమ్మల్ని కూడా రోడ్డుమీద మనుషుల్ని చూస్తున్నట్టే చూస్తున్నాను గానీ...నన్ను పెళ్ళాడటానికి వచ్చిన కుర్రాణ్ణి చూసినట్లు చూడటం లేదు. అందుకే నాలో ఏమీ అదురూ, బెదురూ లేవు" అంది నీలిమ.

"ఓఁ...అయామ్ సారీ!" అనగలిగాడు శ్రీధర్.

—పినిశెట్టి శ్రీనివాస్

"జయంతి...జయంతి...ఎవరావిడ...
ఏమిటి నాతో పని ? ఇది మూడో సారి ఫోన్ చెయ్యడం... ఇప్పుడైనా చెప్పిందా పనేమిటో..."

కమలాకరం రివాల్వింగ్ చైర్‌లో అసహనంగా అటూ యిటూ కదుల్తూ ఫోన్ రిసీవర్ చెవి దగ్గర ఆనించుకొని టేబిల్ మీది ఫైల్‌లోకే చూస్తూ చిరాగ్గా అడిగాడు.

"లేదుసార్... ఎంత అడిగినా చెప్పడంలేదు... మీతో నే మాట్లాడాలిట... ...కనీసం అరగంటయినా మాట్లాడాలట..." సెక్రటరీ గొంతు బెదిరినట్టుగా వణికింది ఫోన్‌లో...

"వాట్ !... అరగంటా ?... యిది శ్రీకాంత్ ఆటోమొబైల్స్ అనీ, దానికి నేను జనరల్ మానేజర్‌ననీ చెప్పు. బట్టల దుకాణం కాదని కూడా తెలియజెయ్యి" కోపంగా అన్నాడు.

"అలాగే సార్..." వినయంగా జవాబు వినిపించింది.

"అంతకీ ఆవిడ కుదరదంటే... అని కళ్ళెత్తి ఎదురుగా వున్న వాల్ క్లాక్ వంకచూసి... "ఇప్పుడు మూడు న్నరవుతోంది... నాలుగున్నరకు ఓ అయిదు నిమిషాలు స్పేర్ చెయ్... కాదూ అరగంటే మాట్లాడాలంటే నేను రిటైరయిన తర్వాత కనిపించమను."

"అలాగే సార్" సెక్రటరీ గొంతులో వస్తున్న నవ్వును బలవంతాన అణిచిపెట్టిన ఛాయలు...

కమలాకరం రిసీవర్ క్రెడిల్ మీద పెట్టేసి మళ్ళీ ఫైల్‌లో తల దూర్చాడు. నెమ్మదిగా తిరుగుతున్న పెడస్టల్ ఫాన్ చప్పుడు తప్ప అంతా నిశ్శబ్దంగా వుంది.

పావుగంట తర్వాత ఫోన్ మోగింది..

ఫైల్‌లోంచి తలతిప్పి, ఫోన్ వంక శత్రువుని చూసినట్టు చూసి రిసీవర్ అందుకున్నాడు.

"యస్"

"తాతారావు గారొచ్చారు సార్..."

"యస్ పంపించు" రిసీవర్ పెట్టేసి, ఫైల్ మూసేశాడు.

మరో నిమిషంలో తలుపు తెరచుకొని దాదాపు యాభైసంవత్సరాల వ్యక్తి లోపలికి అడుగుపెట్టాడు.

కమలాకరం కుర్చీలో కొద్దిగా లేచి నిలబడినట్లుగా వంగి... "గుడీవినింగ్ సర్ !... టేక్ యువర్ సీట్ !..." అన్నాడు.

"థాంక్యూ" ఎదురుగా వున్న కుషన్ చైర్‌లో కూర్చుని అటూ యిటూ చూశారు తాతారావుగారు.

కమలాకరం కుర్చీలో సరిగ్గా కూర్చుని యేమిటన్నట్టు చూశాడాయన వంక.

"ఎ.సి. ఆన్ చెయ్యలేదేమిటోయ్... ఉక్కగా వుంది."

"లేదు సార్. నాకంత యిష్టముండదు... అవసరమూ వుండదు"

"మరింక యెందుకు పెట్టుకున్నట్టది"

కమలాకరం నవ్వి "మీ లాంటి వారి కోసం" అన్నాడు.

టేబిల్ మీద అమర్చిన బజర్ స్విచ్ నొక్కగానే, బోయ్ లోపలికొచ్చాడు.

"ఎ.సి. ఆన్‌చెయ్ !"

"అలాగే సార్"

బోయ్, ఎయిర్ కూలర్ స్విచ్ నొక్కి వెళ్ళిపోయాడు.

"యస్ చెప్పండి" కమలాకరం

అలవాటుగా అన్నాడు.

అతని ధోరణికి తాతారావుగారు క్షణం సేపు నవ్వుకొని

"నీ పద్ధతి నాకు నచ్చింది కానీ... కాస్త బాధగా కూడా వుందోయ్ కమలాకరం"

"దేనికి సార్ !" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఈ కంపెనీ బోర్డాఫ్ డైరెక్టర్స్‌లో నేనూ ఒకణ్ణి. అవునా? నేను కూడా నీ సెక్రటరీ దగ్గరకొచ్చి, కాస్సేపు వెయిట్‌చేసి యీ గదిలోకి రావడం కాస్త బాధగానే వుంది"

కమలాకరం సన్నిహితంగా నవ్వాడు "మీరే కాదుసార్, మిగతా ఎనమందు గురూ కూడా అలాగే వస్తారు. మీకిష్టం లేకపోతే ఈ రోజునుంచి మీరు డైరెక్టుగా వచ్చెయ్యండి. కానీ, మీరంతా కలసి యీ కుర్చీకి, యీ పదవికి కొన్ని అర్హతలు, అధికారాలు యిచ్చారు... వాటిని మీరే గౌరవించకపోతే అది మిగతావాళ్ళ [illegible]క్ష్యానికి కారణమవుతుంది. నా ప్రిన్సిపుల్స్ మీకు తెలుసు గదా....నా ఆఫీసు పరిధిలో అన్నీ ఖచ్చితంగా యేది ఎలా అమలు జరగాలో అలాగే జరుగుతాయి. మరి మీరు కాదంటే..."

అతని మాటలకు అడ్డు ఎడుతున్నట్టు తాతారావుగారు గట్టిగా నవ్వి "అబ్బెబ్బె అది కాదోయ్. ఊరికే అన్నానంతే" అన్నారు

"కాదు సార్! ఈ బాధ మీకు చాలా కాలం నుంచీ వుండి వుండాలి. అందుకే వివరంగా చెప్పాను".

"పోనీ, ఈ సంగతి వదిలెయ్... సరేనా!"

"అయితే చెప్పండి మీరొచ్చిన పని"

"ఇంత స్ట్రిక్ట్ మనిషివి. చెబితే మాత్రం చేస్తావా?" అదోలా తమాషాగా చూస్తూ అన్నారాయన.

"చేస్తానని నమ్మకం లేనప్పుడు చెప్పడానికెందుకొచ్చారు ?" ఆయన్ని సూటిగా చూస్తూ, ఆయనొచ్చిన పని అంచనా వేయడానికి ప్రయత్నిస్తూ అన్నాడు కమలాకరం.

"ప్రయత్నించి చూద్దామని".

"చూడండయితే"

తాతారావుగారు బిగ్గరగా నవ్వి, ఓసారి గోల్డుఫ్రేమ్ కళ్ళద్దాలు సవరించుకొని, మళ్ళీ అనవసరంగా యింకోసారి నవ్వి, "నువ్వు తెలివైనవాడివోయ్ కమలాకరం" అన్నారు

కమలాకరం క్షణంసేపు తీక్షణంగా ఆయనవంక చూశాడు. ఆ చూపుల్ని పట్టించుకోకుండా తాతారావుగారు ప్రారంభించారు—

"ఏమీ లేదోయ్. నాకీమధ్య వంట్లో బావుండడంలేదు. గుండె దడ,ఆయాసం' పొడిదగ్గు. ఇ. సి. జి. తీయించాను గుండె పరిస్థితి యేమీ బావుండలేదు అన్నాడు డాక్టర్" క్షణంసేపు ఆగారు.

"అయామ్ వెరీ సారీ సార్! మీ ఆరోగ్య పరిస్థితి గురించి నాకు చాలా విచారంగా వుంది. కానీ అర్థం కానిదల్లా ఒకటే".

తాతారావుగారు బిగ్గరగా నవ్వి అతని మాటలకు అడ్డుపడుతూ అన్నారు—

"దానికి, కంపెనీ వ్యవహారాలకీ యేమిటి సంబంధమంటావ్. అంతేనా ?"

ఆయన మాటల్లో లీలగా ధ్వనించిన

వ్యంగ్యానికి కమలాకరం కాస్త సాలో చనగా చూశాడు.

అవునన్నట్టు తలూపాడు.

"సంబంధం లేదుమరీ. ఈ కంపెనీ స్థాపించినప్పటినుంచీ యీ రోజువరకూ నేనూ ఒక డైరెక్టర్ని. ఈ కంపెనీ అభివృద్ధి కోసం పాటుపడిన వాళ్ళలో పెద్దగా కాకపోయినా, కాస్తో కూస్తో నేనూ ఒకణ్ణి. అలాంటివాణ్ణి యివాళో, రేపో హఠాత్తుగా చచ్చిపోతే యీ కంపెనీ విచారించదా!"

"సార్..." కమలాకరం వారిస్తున్నట్టుగా అన్నాడు. ఆయన యెందుకలా మాట్లాడుతున్నాడో అర్థం కావడంలేదు.

తాతారావుగారు మళ్ళీ యింకా బిగ్గరగా నవ్వారు. ఆయన నవ్వు కమలాకరానికి చిరాగ్గా అనిపించింది

"చూశావా...నేను చచ్చిపోతానన్న మాటే నువ్వు భరించలేకపోయావ్. నిజంగా అలా జరిగితే యీ కంపెనీ విచారించదా?... విచారిస్తుంది.... అవును గానీ కమలాకరం, నేను పోయినతర్వాత యేం చేస్తారోయ్?" ఆయన ధోరణికి విపరీతంగా వస్తున్న కోపాన్ని అణచుకొని నెమ్మదిగా అన్నాడు కమలాకరం

"ఎందుకు సార్, అలాంటి మాటలు"

"చావు పేరు వింటేనే భయపడ్డం, మానసిక అపరిపక్వతకు నిదర్శనం కమలాకరం. చావు సహజమైంది. సూర్యోదయా స్తమయాలెంత సహజమైనవో, చావు పుట్టుకలు కూడా అంతే. నేను పోయినతర్వాత మీరంతా యేం చేస్తారో చెప్పడానికి నువు భయపడ్డా, నేను చెబుతాను..."

"సార్!..." కమలాకరం వారించబోయినా తాతారావుగారు వినిపించుకోలేదు. చెప్పడం ప్రారంభించారు—

"మీరంతా సంతాప సభలు, సమావేశాలు జరుపుతారు. ఈ పట్టణంలో యెంతోమంది ప్రముఖులు, నాకున్న గొప్పదనాన్ని గురించి, లేని గొప్పదనాన్ని గురించి కూడా గొప్పగా కీర్తిస్తారు... మిత్రులు, శత్రువులు కూడా మనస్ఫూర్తిగా విచారిస్తారు. ఒక మనిషి చేసిన తప్పులు హృదయపూర్వకంగా క్షమించబడేది ఆ మనిషి చావు తర్వాత మాత్రమే కమలాకరం...... అప్పుడు మీరంతా నా ఆత్మకు శాంతి కలగాలని చిత్తశుద్ధితో రెండు నిమిషాలు మవునంగా ప్రార్థిస్తారు. అవునా?..." కమలాకరం యిబ్బందిగా కదులుతున్నాడు.

"అలా ప్రార్థించే వాళ్ళలో నువ్వూ ఒకడివి అని నా నమ్మకం."

"సార్ యేమిటి సార్ మీరు మాట్లాడేది?"

"దయచేసి విను... నువ్వు తప్పకుండా నా ఆత్మశాంతి గురించి ప్రార్థిస్తావు.......కాదంటావా?"

"తప్ప..." ఆయన ధోరణికి ఆశ్చర్యపోతూ అవునన్నట్టు తలూపాడు కమలాకరం.

"కానీ.. నేను యిప్పుడున్న యీ పరిస్థితిల్లో పోతే మీరెంత ప్రార్థించినా నాకు ఆత్మశాంతి వుండదు కమలాకరం"

"అదేమిటి సార్...యింతకీ మీరు చెప్పేది..."

"కమలాకరం ... నడివయసులో పుట్టిన సంతానం కంటే, శాపమేదీ





వుండదు...నా కిప్పుడు యాభై సంవత్సరాలు, నా కూతురు కిప్పుడు పదహారు. ఈ సంవత్సరం దానిపెళ్ళి చేసి తీరాలి...అలా చెయ్యగలిగితే నా ఆత్మ శాంతి గురించి మీరెవరూ ప్రార్థించక పోయినా ఫరవాలేదు ...... హాయిగా తృప్తిగా వెళ్ళిపోతాను"

కమలాకరం అయోమయంగా చూశాడు...

"దాని పెళ్ళికీ... కంపెనీకి సంబంధమేమిటనా...చెబుతాను... నా కున్నదదొక్కటే...నా ఆస్తిపాస్తులు సర్వం దానికే చెందుతాయి. ఎవరో ముక్కూ మొహం తెలియని వాడికిచ్చి దాని భవిష్యత్‌ను లాటరీ వేయలేను"

"అదేమిటి సార్... మీ కుబేర్లంత యిన్‌ఫ్లుయెన్స్ వుంది. పెళ్ళి కొడుకు గురించి బాగా విచారించే యివ్వొచ్చుగదా?"

కమలాకరం కాస్త తేలికపడ్డట్టు సంభాషణలోకి దిగాడు...

"నిజమే... ఈ రోజుల్లో యెవర్నీ నమ్మబుద్ధి వెయ్యడంలేదు... నా మిత్రుల్లో సగం మందికి పైగా నా నాశనం కోరేవాళ్ళే. వాళ్ళు నన్ను తప్పుదారి పట్టించవచ్చు"

కమలాకరం నిట్టూర్చాడు... తాతారావుగారి మనస్తత్వం గురించి కంపెనీలో చాలా ఆస[illegible]రమైన చర్చలు జరుగుతాయని విన్నా[illegible]ు కాని యెందుకు జరుగుతాయో యీరోజు అనుభవ పూర్వకంగా అతనికి తెలుస్తోంది...

"అంచేత నిర్మొహమాటంగా చెప్పాలంటే, నేనెవర్నీ నమ్మలేను నాకుగా నేను పరిశీలించి నిర్ణయించుకుంటే తప్ప."

"పోనీ అలాగే చెయ్యండి" సాధ్యమైనంత వరకూ గొంతులో కదలాడుతున్న విసుగును వ్యక్తం కానీయకుండా అన్నాడు కమలాకరం.

తాతారావుగారు మళ్ళీ చిరాకొచ్చేంత బిగ్గరగా నవ్వి—

"మరి అందుకే గదోయ్...నీ దగ్గరకొచ్చింది."

కమలాకరం విస్మయంగా చూశాడు.

"అంటే మీ అమ్మాయికి నన్నే మన్నా సంబంధాలు చూడమనా మీరు చెప్పేది!"

"నిన్నంత శ్రమ తీసుకోనివ్వను. నీ బిజీ నాకు తెలుసు."

"మరి !"

తాతారావుగారు కళ్ళజోడు తీసి చేత్తో పట్టుకొని దానివంక పరిశీలనగా చూసి తిరిగి పెట్టేసుకొంటూ అన్నారు-

"నువ్వే మా అమ్మాయిని పెళ్ళి చేసుకొంటే...."

కమలాకరం వులిక్కి పడ్డాడు.

"ఏమిటి మీరనేది ?" కమలాకరం గొంతులో కొద్దిగా కోపం తొణికిసలాడింది.

తాతారావుగారు చిన్నగా నవ్వి వూరుకున్నారు ఆలోచించమన్నట్టు చూసి. కమలాకరంలో కోపం వుత్తుంగ తరంగంలా లేచింది. బలవంతాన అణిచి పెట్టుకొంటూ అన్నాడు—

"అలా జరగదు. అది అసంభవం!"

తాతారావుగారు దెబ్బ తిన్నట్టు చూశారు.

"ఏం...యెందుకు జరగదు?"

"జరగదు... అదంతే"

"అదేనోయ్, యెందుకని అడుగు

తున్నాను" అని తమాయించు కొన్నట్టు ఆగి, నచ్చ చెబుతున్నట్టుగా అన్నారు "నీకేం తక్కువ వయసు మించి పోయిందా నిండా ముప్ఫయేళ్ళుండవ్"

"నా కిప్పుడు ముప్ఫై రెండు" కోపాన్ని పళ్ళ బిగువున అణుచుకొంటూ అన్నాడు.

"పోనీ రెండేళ్ళు అటూ ఇటూ. ఈ వయసులో యింత పెద్ద కంపెనీకి జనరల్ మానేజర్ చేసేవాడు ఇండియాలో యెవడూ వుండడు యేదో జరిగిపోయింది. దాన్ని మర్చి పోవాలి"

"ఏమిటి మర్చిపోవాలి" కోపంగా అన్నాడు.

"ఆదేనోయ్ నీ భార్య"

"తాతారావుగారూ !" అరిచాడు కమలాకరం "నా కెవరూ లేరు. నాకు భార్య లేదు."

తాతారావుగారి సున్నితమైన నవ్వు చురకత్తిలా తగిలింది కమలాకరానికి. అతని నుదురు చిరుచెమట్లు పట్టింది.

"ఉద్రేక పడకోయ్! నీలాంటి మంచి వాణ్ణి, వొదిలిపెట్టి యెవడితోనో లేచి పోయిన ఆవిడ..."

"షటప్ ఐ సే షటప్" పిచ్చివాడిలా పిడికిళ్ళు బిగించి, టేబిల్ మీద ధనా ధనా గుద్దుతూ అరిచాడు.

"కమలాకరం!" అంత స్థాయిలోనూ అరిచారు తాతారావుగారు.

"నీ ఇష్టమొచ్చినట్టు పదప్రయోగం చెయ్యకు, నేనెవర్నో మర్చిపోతున్నావ్."

"మీ యిష్టమొచ్చినట్టూ మాట్లాడకండి. మీ రెవరైనా నా కనవసరం. కంపెనీ విషయాలేవైనా వుంటే మాట్లాడండి. నా పర్సనల్ ఎఫైర్స్ మాట్లాడే హక్కు, అధికారం మీకు లేవు."

"ఎందుకు లేవు నా కంపెనీలో పనిచేసే ప్రతి వుద్యోగి, నైతికంగా వున్నత స్థానంలో వుండేలా చూసే బాధ్యత నా మీదుంది."

"అయితే ఇంతకీ యేమిటి మీరనేది" వ్యగ్రుడై పోయాడు కమలాకరం.

"అది తర్వాత చెప్తాను, ముందు నన్ను 'షటప్' అన్నందుకు నాకు క్షమాపణ చెప్పుకో" మొండిగా అన్నారు తాతారావు.

"మీరన్నదానికి ముందు మీరు నాకు క్షమాపణ చెప్పుకోవాలి."

"నేనే మన్నాను నేనన్న దాంట్లో తప్పేముంది. నీ భార్య యెవడితోనో లేచిపోవడం నిజం కాదా?"

"యూ రాస్కెల్ గెటవుట్" పిచ్చిగా అరిచాడు.

"షటప్" తాతారావుగారు కూడా అరిచారు.

కమలాకరం చటుక్కున కుర్చీ లోంచి లేచి తాతారావుగారి కాలర్ పట్టుకున్నాడు. అతని కళ్ళు అగ్ని గోళాల్లా మండాయి. ఊహించని ఈ పరిణామానికి తాతారావుగారు హడలిపోయి నిలువెల్లా వణికి పోతుండగా నెమ్మదిగా వణుకుతున్న గొంతుతో అన్నాడు కమలాకరం.

"నీ వయసు మీద వున్న గౌరవం కొద్దీ వదిలేస్తున్నాను. నువ్వన్న మాటలకు నీ ప్రాణాలు తియ్యాలి. పో మరో క్షణం కూడా యిక్కడ వుండొద్దు. గెటవుట్."

కాలర్ విడిచి పెట్టడంతో తాతారావు గారు కుర్చీలో కూలబడ్డారు. సర్దుకుని




నెమ్మదిగా లేచి బయటి కెళ్ళి పోయారు. రెండు నిమిషాల తర్వాత రిసీవర్ అందుకొని, మరో అరగంట వరకూ యెవర్నీ రానీయొద్దని చెప్పి, కుర్చీలో కూలబడి తల టేబిల్ మీద ఆన్చాడు కమలాకరం.

కడుపులోంచి యేదో బాధా, ఆవేదనా గొంతులోకి యెగదన్ను కొస్తున్నాయి. యేవేవోస్మృతులు హృదయాన్ని కర్కశంగా వురి తీస్తుంటే... కళ్ళల్లోంచి కన్నీళ్ళు బయటకు రావడానికి విఫల ప్రయత్నం చేస్తున్నాయి. తనలో తనే మవునంగా యేదో గొణుక్కొంటూ వుండి పోయాడు. మగత కమ్మినట్టై... యేదో మైకం ముంచుకొచ్చింది.

ఎంతసేపయిందో...

ఫోన్ మోగుతుంటే వులిక్కిపడి లేచాడు కమలాకరం. తలదిమ్ముగా మెదంతా నొప్పిగా అనిపించింది. ఓ సారి తల విదిలించి ఫోన్ అందుకున్నాడు.

"యస్... కమలాకరం స్పీకింగ్"

"నేను రామభద్రాన్ని"

"మీరా! గుడీవినింగ్ సర్!"ఆ పేరు వినగానే మిగిలిన మత్తు కూడా వదిలి పోయింది.రామభద్రంకంపెనీ మేనేజింగ్ డైరెక్టర్.

"తాతారావు వచ్చాడు నా దగ్గరికి"

కమలాకరం సర్దుకుని కూర్చున్నాడు రిసీవర్ సరిగ్గా పట్టుకొని.

"ఏదో గొడవ పడ్డారటగా, చెప్పాడనుకో అయినా అతని గురించి నాకు తెలుసు. జరిగిందేమిటి ?"

"సార్!ఆయన అక్కడవున్నారా?" కమలాకరం అడిగాడు.

"లేదు అయిదు నిమిషాలయింది వెళ్ళిపోయి"

కమలాకరం, అయిదు నిమిషాల్లో జరిగిందంతా చకచకా వివరించి ఆఖర్నీ అడిగాడు

"సార్... యిందులో నా తప్పేమన్నా వుందను కుంటున్నారా మీరు?"

రామభద్రంగారి నిట్టూర్పు ఫోన్‌లో స్పష్టంగా వినబడింది.

"నో...నో... కమలాకరం. బోర్డు తరపున నేనే యెక్సూజ్ చెప్పాలి నీకు"

"అయినా తాతారావు బుద్దెందుకో యీ మధ్య మరీ విపరీతంగా తయారయింది. ఎవర్నీ నమ్మడు. ఆ మధ్య బంగారంలాంటి సంబంధమొకటియెరేంజ్ చేస్తానంటే వద్దన్నాడు... యింతకీ అతను నిన్నంత బలవంత పెట్టడానికి కారణం తెలుసా?"

"లేదు సార్"

"ప్రాణమన్నా విడిచి పెడతాడుగాని పైసా విడిచిపెట్టడు. అతని హోదాకు తగ్గట్టుగా కట్నం యివ్వాలంటే కనీసం లక్ష రూపాయలయినా యివ్వాలి. లక్ష రూపాయలిచ్చిన తర్వాత అతను బ్రతికుంటాడంటే అతన్ని తెలుసున్న వాళ్ళెవరూ నమ్మరు. నువ్వయితే వూరికే కట్టబెట్టెయ్యొచ్చని"

రామభద్రంగారు నవ్వుతూ అలా మాట్లాడుతూవుంటే కమలాకరం మనసు తేలికపడ్డట్టు అనిపించసాగింది. అతను కూడా చిన్నగా నవ్వాడు.

"పైగా యీ మధ్య యీ. సి. జీ. తీయించానని తన గుండె పరిస్థితి యేమీ బాగాలేదని చెబుతున్నాడు."

"అవును సార్ నాకూ చెప్పారు"

రామభద్రంగారు గట్టిగా నవ్వి "ఈ

వూళ్ళో నీకే ఆయన ఆలస్యంగా చెప్పాడనుకుంటాను. ఎందుకైనా మంచిదని డాక్టరుకు ఫోన్ చేసి అడిగాను. ఆయన గుండె చక్కగా వుందని, దానికేం ఫర్వా లేదని, చెప్పాడాయన ఇలా చెప్పుకోడం మాత్రం అయనకున్న మానసిక రోగం అన్నాడు"

కమలాకరం నవ్వాడు.

"సరేలే దాన్ని గురించి మర్చిపో. కావాలంటే రెండురోజులు రెస్టు తీసుకో" ఆప్యాయంగా అన్నారు.

"ఎందుకు సార్. అఖ్ఖర్లేదు. నేను బాగానే ఉన్నాను"

"ఆల్‌రైట్ వుంటానిక"

"అలాగే సార్"

కమలాకరం రిసీవర్ పెట్టేసి నిట్టూర్చాడు. టైము చూశాడు. నాలుగున్నర. ఫోన్ మోగింది.

అందుకొని "యస్" అన్నాడు.

"నాలుగున్నరకి అయిదు నిమిషాలు యివ్వమన్నారుగదా!ఆవిడ...జయంతి.. వచ్చారు"

"ఆల్‌రైట్, వెంటనే పంపించు"

ఫోన్ పెట్టేశాడు. ఎవరీ జయంతి? ఏమిటి పని! ఏదో వుద్యోగానికై వుంటుంది. యస్ అంతే."

"నమస్కారం సార్"

తలుపు తోసుకొని లోపలి కొచ్చి రాగానే వినయంగా చేతులు జోడించి నమస్కరిస్తున్న, దాదాపు యిరవైనాలుగేళ్ళ యువతిని ఆశ్చర్యంగా కళ్ళు తిప్పుకోలేకుండా చూస్తుండిపోయాడు కమలాకరం. నాజూగ్గా తీర్చిదిద్దినట్లున్న ప్రతి అవయవం, నిర్మలమైన

నవ్వు, భయంలేని కళ్ళు. ఏదో చెప్పలేని ఆకర్షణ. లేతాకుపచ్చరంగు వాయిల్ చీర, జాకెట్–ఆమె బంగారు రంగుఒంటి మీద వెలవెలబోతున్నాయి.

"మే ఐ సిట్ హియర్?" గుండె లోతుల్లోకి దూసుకుపోయే గొంతు. కమలాకరం వులిక్కిపడి సర్దుకొని "ష్యూర్ ష్యూర్ టేక్ యువర్ సీట్" అన్నాడు. చిన్నగా నవ్వి, యెదురుగా వున్న కుర్చీలో కూర్చుంది. కమలాకరం టేబిల్ మీద వున్న కర్చీఫ్ తీసుకొని ఓసారి మొహం తుడుచుకున్నాడు. గొంతు సవరించుకున్నాడు.

"యస్ మీరేం తీసుకుంటారు కాఫీ. టీ..." మామూలు హుందాతనం గొంతులో పలికిస్తూ అన్నాడు.

"థాంక్యూ. టీ తీసుకుంటాను"

కమలాకరం బజర్ నొక్కాడు. ప్యూన్ రాగానే రెండు 'టీ'లు తెమ్మని చెప్పి పంపాడు.

"యస్. చెప్పండి"

ఆమె అతని వంక పరిశీలనగా చూసింది. ఆమె కళ్ళలో ఆమె వచ్చినప్పట్నించీ లీలగా కదలాడుతున్న ఏదో ఆశ్చర్యాన్ని కమలాకరం గమనిస్తున్నాడు. ఆమె గొంతు సవరించుకొంది.

"నేను మీతో అరగంట మాట్లాడాలని అడిగితే, అయిదు నిమిషాలు మాత్రమే అంగీకరించారు."

"అవును నా బిజీ అలాంటిది" గర్వంగా అన్నాడు కమలాకరం.

"కానీ... నేను చెప్పే విషయం కూడా అలాంటిదే"

"అంటే !..." ఆమె మాట్లాడుతున్న విధానం, కమలాకరానికి విస్మయంగా వుంది.

"అది అయిదు నిమిషాల్లో చెప్పడం కుదరదు..." ఏదో అనబోతుండగా బోయ్ టీ తీసుకొచ్చి టేబిల్ మీద పెట్టాడు. ఇద్దరూ కప్పులు అందుకున్నారు. ఆమె సిప్ చేస్తూ అంది—

"అప్పుడే నేను యీ గదిలోకొచ్చి మూడు నిమిషాలయిపోయింది. ఇలా ఈ టీ పూర్తి చేసేటప్పటికి మిగతా సమయం కూడా అయిపోతుంది" నిశ్చలంగా అదురూ బెదురూ లేకుండా ధ్వనిస్తున్న ఆమె కంఠస్వరం కమలాకరాన్ని విపరీతంగా ఆకర్షించింది. ఇంతకాలం తన అనుభవంలో ఎంతో మంది ఆడవాళ్ళతో మాట్లాడినా ఇలాంటి సందర్భం ఇదే మొదటిసారి.

"టీ నేను ఆఫర్ చేసిందే కాబట్టి ఆ రెండు నిమిషాలూ పొడిగిస్తున్నాను చెప్పండి" కప్పు టేబిల్ మీద పెట్టి నవ్వుతూ అన్నాడు.

ఆమె కూడా కప్పు పెట్టేసింది.

"అయినా సరిపోదు. అరగంటే మాట్లాడాలంటే, నేను మరో ఇరవై సంవత్సరాలు ఆగవలసి వుంటుదనుకోలేదు. ఇక్కడి కొచ్చేముందు రెండు మూడు రోజులనుకున్నాను."

"అంటే!" అయోమయంగాచూశాడు. క్షణంలో గుర్తొచ్చింది. తాను ఇందాక సెక్రటరీతో అన్నమాట. తన మాటలు యధాతథంగా అనేశాడన్నమాట. సిల్లీ ఫెలో! ఈవిడ కూడా చాలా గడుసుదే! ఎంత సున్నితంగా చెప్పింది. చిన్నగా నవ్వాడు. అయితే ఇందాకటి నుంచి ఈవిడ ఆశ్చర్యంగా చూస్తున్నది అందుకన్నమాట.

సాధారణంగా "కొన్ని వుద్యోగాల పేర్లు వింటుంటే కొన్ని రూపాలు గుర్తుకొస్తూంటాయి, ఏమంటారు?" చిన్నగా నవ్వుతున్నట్టు మాట్లాడుతున్న ఆమె మాటలు, ఎంతసేపైనా వినాలనిపించే ఆమె గొంతు కమలాకరాన్ని మంత్రముగ్ధుణ్ణి చేస్తున్నాయి. అప్రయత్నంగా తలూపాడు చెప్పమన్నట్టు.

"ఉదాహరణకు మిలటరీ మేజర్ పేరు విన్నామనుకోండి. పెద్ద పెద్ద మీసాలు, గద్దముక్కు, గంభీరమైన గొంతు, కాకీ బట్టలు గుర్తుకొస్తాయి. అలాగే డాక్టర్ అని వినగానే తెల్లకోటు స్టెతస్కోపు గుర్తుకొస్తాయి. కదూ?" కమలాకరానికి నవ్వొచ్చింది ఆమె మాటలు వింటుంటే

"మరి 'జనరల్ మానేజర్' అని వినగానే ఏం గుర్తొచ్చింది మీకు?" ఆమె వంక ఆసక్తిగా చూస్తూ అడిగాడు. ఆమె ఒక్క క్షణం తటపటాయించినట్టు చూసింది.

"ఫరవాలేదు చెప్పండి. నేనేమీ అనుకోను"

ఆమె నవ్వి— "ఫుల్ సూట్‌లో నిగనిగ మెరుస్తున్న బట్టతలతో...... చుట్టూ మిగిలిపోయిన తెల్లజుట్టు..... రిమ్‌లెస్‌చత్వారం కళ్ళద్దాలు, నోట్లో వెలుగుతున్న పైపు అంతే"

కమలాకరం ఆమె మాటలకు గట్టిగా నవ్వేశాడు. అతని హృదయం తేలికపడినట్టుగా అనిపించింది.

"మీరు చెప్పింది నిజమే..." అని ఏదో చెప్పబోయి మళ్ళీ ఏదో గుర్తు





కొచ్చిన వాడిలా చటుక్కుని గంభీరమై పోయాడు.

"యస్. ఇంతకీ మీరొచ్చిన పని ?"

ఆమె తన చేతివాచీ వంకచూసుకొని చప్పున లేచి నిలబడింది.

"సారీ ! మీరు నాకిచ్చిన అయిదు నిమిషాల టయిమూ అయిపోయింది"

"అరె వచ్చినపని చెప్పకుండా యెలా వెళతారు."

"నిజమే చెప్పానుగా అయిదు నిమిషాలు సరిపోదని"

"సరిపోదని తెలిసి కూడా ఎందు కొచ్చారు?" కాస్త తీక్షణంగా అడిగాడు.

"అలా సరిపోదన్న విషయం స్వయంగా మీకు చెప్పడానికి అయిదు నిమిషాలు చాలన్న నమ్మకంతో"

ఆమె గడుసుదనానికి కమలాకరం నివ్వెరపోయాడు.

"సరే మరో ఐదు నిమిషాలు పొడిగిస్తున్నాను"

"అయినా చాలదు"

"కనీసం యెందుకు సరిపోదో చెప్పడానికయినా సరిపోదా?"

ఆమె ఒక్క క్షణం అతని కళ్ళల్లోకి అభినందనగా చూసి తిరిగి కుర్చీలో కూర్చుంది.

"నా పేరు జయంతి"

"తెలుసు. మీరు సెక్రటరీకి ఇంతకు ముందేచెప్పారు"

ఆమె చెప్పే విషయం పట్ల తన మనసులో పెరిగిపోతున్న ఆసక్తిని అదుపు చేసుకొంటూ, టేబిల్ మీద పేపర్ వెయిట్‌ను చేతిలోకి తీసుకొని నెమ్మదిగా అరచేతిలో కదిలిస్తున్నాడు.

"నేను ఈ ఊరు నిన్ననే వచ్చాను మీ కోసం"

"నా కోసమా ?" ఆశ్చర్యంగా అన్నాడు.

"అవును...కేవలం మీ కోసమే"

"ఇంతకీ మీరు ఎక్కణ్ణించి వచ్చారు?"

ఆమె రెండు క్షణాలు అతని వంక సూటిగా చూసిన తర్వాత అంది

"ఎక్కణ్ణించి వచ్చానో చెప్పే కంటే, ఎవరి దగ్గర్నుంచి వచ్చానో చెబితే విషయం తొందరగా అర్థమై పోతుంది"

"అలాగే పోనీ...చెప్పండి"

"రాజ్యలక్ష్మిగారి దగ్గర్నుంచి"

కమలాకరంలోని వులికిపాటుకు చేతిలోని పేపర్ వెయిట్ టేబిల్ మీద చప్పుడు చేసింది. సూటిగా తీక్షణంగా ఆవిడ కళ్ళల్లోకి దూసుకుపోయేలా చూస్తూ నాలుగయిదు క్షణాల తర్వాత నెమ్మదిగా నిగ్రహంగా అన్నాడు

"ఎవరావిడ?"

ఆమె చప్పున కళ్ళెత్తి అతని వంక చూసింది. అతని కళ్ళు ఎరుపు రంగుకు తిరుగుతున్నాయి. కళ్ళు దించుకొని నెమ్మదిగా అంది,

"లేచిపోయిన మీ భార్య"

"షటప్! వాట్ నాన్సెన్స్ యూ ఆర్ టాకింగ్" అరిచాడు.

క్షణంలో ఆమె పచ్చటి మొహం కుంకుమ రంగుకు తిరిగింది. నిశ్శబ్దాన్ని కౌగలించుకొని ఒక నిమిషం ఇబ్బందిగా పెనుగులాడిన తర్వాత ఆమె నెమ్మదిగా గొంతు పెకలించుకొంది

"క్షమించండి. ఆవిడ్ని మీ భార్య అనలేను. ఆమె చేసినపనికి నేనుపయో

గించిన పదం కంటె సరిగ్గా సరిపోయేది మరేదయినా వుంటే వుండొచ్చు...అది నాకు తెలియదు. అందుకే అలా మాట్లాడాను".

కమలాకరం పశ్చాత్తాప పడ్డట్టుగా చూశాడు.

"ఇంతకీ ఆవిడకూ మీకూ ఏమిటి సంబంధం? మీకు బంధువా ?" ... తీవ్రంగా గుర్తు తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ అన్నాడు.

వీణ మీద రవళించిన విషాద స్వరంలా నవ్వింది ఆమె.

"బంధువే కమలాకరం గారూ! నా దృష్టిలో బంధమున్న ప్రతివాళ్ళూ బంధువులే. ఆ మేరకు ఆమె నాకు ఆత్మ బంధువు"

"అంటే"

"చెప్పానుగా ఆ విషయం చెప్పడానికి అయిదు నిమిషాలు సరిపోదని".

కమలాకరం నిట్టూర్చాడు...

"చూడండి జయంతి గారూ... మీకు అంతగా అవసరమనుకొంటే నేను అర గంట కాదు, ఆరు రోజులయినా వీలు చేసుకోగలను, కాని ... కాని" అతని గొంతు గాద్గదికమైనట్టు వణికింది ... "నా భార్య చచ్చిపోయింది. ఆవిడ గురించే మీరు మాట్లాడాలనుకుంటే శుద్ధ అనవసరం నేను వినవలసిందేమీ లేదు."

అతని వంక జాలిగా చూసింది.

"లేదు కమలాకరం గారూ నేను చెప్పబోయేది కేవలం నా గురించి"

"మీ గురించా?"

"అవును అందులో ఆవిడ విషయం వుండవచ్చు కాని చెప్పేది మాత్రం నా గురించే దయచేసి మీరు వినాలి"

కమలాకరం ఆమె వంక అర్థం కానట్టు చూసి నిట్టూర్చాడు.

"సరే మీరు నా గురించి వెయిట్ చెయ్యగలరా?"

"తప్పకుండా...ఎక్కడ"

"మీ యిష్టం"

"నాకీ వూరు కొత్త నేను హోటల్లో వుంటున్నాను."

"పోనీ మా ఇంటి దగ్గర వుండండి. నేను ఎనిమిదయ్యేటప్పటికల్లా వస్తాను".

"అలాగే" తలూపింది

కమలాకరం ఫోన్ తీశాడు.

"వీరిని కారులో మన ఇంటికి పంపించు"

ఫోన్ పెట్టేసిన తర్వాత ఆమె లేచి నిలబడింది.

"థ్యాంక్యూ వెరీ మచ్. వస్తాను"

కమలాకరం మవునంగా తలూపాడు.

ఆమె నడిచి, డోర్ హేండిల్ మీద చెయ్యి వెయ్యబోతుండగా చటుక్కున గుర్తొచ్చి అడిగాడు.

"ఇంతకీ మీరెవరో స్పష్టంగా చెప్పలేదు"

ఆమె వెనక్కు తిరిగి నిర్వికారంగా నవ్వింది "చెప్పానుగా బంధమున్న బంధువునని. స్పష్టంగా కావాలంటే... నేను..." అని కాస్సేపు ఏదో నలుగుడు పడినట్టు కదిలి అంది.

"నేను రాజ్యలక్ష్మి గార్ని లేవదీసుకు పోయిన రాజారావు గారి ఒకప్పటి భార్యని" చటుక్కున వెనక్కు తిరిగి తలుపు తెరుచుకొని బయటికెళ్ళిపోయింది ఆమె.

నెమ్మదిగా మూసుకుంటున్న తలుపు వంక అయోమయంగా చూశాడు కమలాకరం.

 



## 2

ఇల్లంతా మరోసారి తిరిగివచ్చి డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుంది జయంతి. అధునాతనంగా నిర్మించబడిన ఆ డాబాలో ప్రతి భాగమూ ఎంతో అందంగా తీర్చిదిద్దినట్టు వుంది. లేతాకు పచ్చ రంగు డిస్టెంబర్ కలర్స్ గోడల మీద అక్కడక్కడ వూచలతో నిర్మించబడిన మోల్డింగ్స్, చిన్నచిన్న వర్ణ చిత్రాలు ముచ్చటగా వున్నాయి.

పనిమనిషి వచ్చి కాఫీ కావాలేమో అడిగింది.

"వచ్చిన వెంటనే యిచ్చావుగా మళ్ళీ దేనికి?" నవ్వి అడిగింది జయంతి.

"అయ్యగారు అస్తమానూ తాగుతారమ్మా. అలవాటుగా అడిగాను" పనిమనిషి వినయంగా చెప్పి లోపలి కెళ్ళిపోయింది. ఆమెకు ముప్పై సంవత్సరాలుంటాయి. పేరు రావుయమ్మ అని చెప్పింది.

జయంతి విశ్రాంతిగా సోఫాలో వెనక్కి జారగిలపడి కళ్ళు మూసుకొంది. ఆమెను ఆలోచనలు చుట్టుముడుతున్నాయి.

తన పరిస్థితి తనకే విచిత్రంగా అర్థం కానిదిగా ఉంది. ఏమిటి తను చేస్తున్న పని? ఇది సరైనదేనా! అసలు లోకంలో యిలా యెక్కడయినా జరుగుతుందా! ఏమో! తను చెప్పేది విని అతనేమంటాడు? అన్నీ అర్థంకాని ప్రశ్నలు.

ఫోన్ మోగింది.

జయంతి చప్పున సోఫాలోంచి లేచి ఫోనందుకొంది. అవతలినుంచి కమలాకరం మాట్లాడాడు.

"జయంతిగారా?"

"అవును"

"అక్కడ మీకు వొంటరిగా కూర్చోడానికిబోర్ అనిపిస్తోందా"

జయంతి కాస్త యిబ్బందిగా కదిలి చిన్నగా చప్పుడయ్యేలా నవ్వింది.

"బుక్ రాక్‌లో పుస్తకాలుంటాయి. తిరిగేస్తూ వుండండి, మరోగంటలో వచ్చేస్తాను. ఇంకా కావాలంటే వెనకవైపు బెడ్‌రూములో కాసెట్ టేప్ రికార్డర్, ట్రాన్సిస్టరూ వుంటాయి. నిరభ్యంతరంగా వుపయోగించుకోండి"

"థ్యాంక్స్!"

అవతలివైపు ఫోన్ పెట్టేసిన చప్పుడు విన్న తర్వాత తనూ క్రెడిల్ మీదుంచి, యిటు తిరిగేప్పటికి, ఫోనందుకుందామని వచ్చిన రావుయమ్మ నిలబడివుంది.

"అయ్యగారా?"

"అవును"

"యేం చెప్పారు?"

"యేమీలేదు నీక్కాదు."

రావుయమ్మ వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

డ్రాయింగ్ రూమ్‌లో ఓ మూలగా వున్న బుక్ రాక్ వైపు నడిచింది జయంతి. చాలావరకూ అన్నీ ఇంగ్లీషు నవలలు, మాగజైన్స్. అడుగు అరలో మాత్రం కొద్దిగా తెలుగు వారపత్రికలు

వున్నాయి. రెండు మూడు పత్రికలు తీసుకొని, వచ్చి సోఫాలో కూర్చుంది తిరగేస్తూ, అవి పాత పత్రికలు ఆర్నెల్ల క్రితానివి. అనాసక్తంగా అటూ యిటూ తిరగేస్తూ కూర్చుండిపోయింది.

"మమ్మీ" సన్నటి గొంతు, చిన్నగా అరిచిన అరుపులో కదిలిన ఆనందానికి, ఒళ్ళు జలదరించినట్లయి యేదో మాతృత్వపు అనుభూతి తనను నిలువెల్లా పులకరింపజేస్తుంటే చటుక్కున చూసింది జయంతి. ముందుకు పరిగెత్తుకురాబోయి ఆగి తన వంక విస్మయంగా, సందిగ్ధంగా చూస్తున్న పది సంవత్సరాల అబ్బాయి ఆకుపచ్చ నిక్కర్లోకి తెల్లటి బుషర్ట్ టక్‌చేసి కాళ్ళకు బూట్లు, భుజాన పుస్తకాలసంచీ, నుదుటిమీదికి పడుతున్న జుట్టు, యెర్రగా బొద్దుగా అందంగా వున్నాడు. జయంతి అతనివైపు చూస్తూ ఆప్యాయంగా నవ్వింది.

"సారీ! మమ్మీ అనుకున్నాను" తప్పు చేసినవాడిలా క్షమాపణ చెప్పుకొంటున్నట్టు అన్నాడు. జయంతి ఫరవాలేదన్నట్టు నవ్వింది. ఆ అబ్బాయిలో రాజ్యలక్ష్మి పోలికలు స్పష్టంగా వున్నాయి.

"యిలా రా కూర్చో" మృదువుగా పిలిచింది.

ఆమెవైపు ఒక క్షణం అదోలా చూసి, వచ్చి సోఫాలో కూర్చున్నాడు.

"బాబూ! నీ పేరేమిటి?"

"విద్యాసాగర్"

"బావుంది. ఏం చదువుకొంటున్నావ్?"

"ఫిఫ్త్ క్లాస్"

"ఇప్పుడు ,నువ్వు స్కూలునుంచే వస్తున్నావా?"

అవునన్నట్టు తలూపాడు, ఆమెను ఆసాంతం పరిశీలిస్తూ.

"యిప్పటివరకూ వుంటుందా?"

"లేదండి.నాలుగున్నరకు వదిలేస్తారు. అయిదింటివరకూ ఆడుకుని, అక్కణ్ణించి ట్యూషన్‌కు వెళ్ళి వస్తున్నాను. రోజూ యింతే" కాస్త బిడియం తగ్గినట్టుంది చకచకా మాట్లాడేస్తున్నాడు. జయంతికి అబ్బాయిని చూస్తుంటే ముచ్చటగా అనిపించింది.

"మమ్మీ అని పిలిచావు. నేను మీ మమ్మీలా వున్నానా?"

సిగ్గుపడ్డట్టుగా చూశాడు "లేదండీ! కాని అలా అనుకున్నాను"

"మీ మమ్మీ యెక్కడికి వెళ్ళారు?" అడగ్గూడదనుకుంటూనే యేం చెబుతాడోనని ఆపుకోలేని ఆసక్తివల్ల అడిగేసింది. చప్పున కళ్ళెత్తి ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"లేదండి చాలా రోజులయింది వెళ్ళి." జాలిగా చెబుతున్న అతని మాటలు జయంతి హృదయంలోకి సూటిగా దిగబడ్డాయి. ఎందుకడిగానా అని క్షణంసేపు గిజగిజ లాడింది. నిశ్శబ్దంగా వుండి పోయింది.

"చిన బాబూ! హార్లిక్స్ యిప్పుడే తాగేస్తావా? స్నానం చేసి తాగుతావా ?"

రావమ్మ గొంతు విని తలెత్తిందు.

"ఆకలేస్తోంది. ఇప్పుడే తాగేస్తాను."

"సరే!" రావయమ్మ హార్లిక్స్ తేవడానికి వెళ్ళింది.

"మీ రెవరు ?" అడిగాడు.

వులిక్కి పడింది జయంతి. ఏం చెప్పాలి. తనెవరని చెప్పాలి యితనికి. యిబ్బందిగా నవ్వింది.




"నా పేరు జయంతి. మీ నాన్న గారితో పనుండి వచ్చాను. వస్తాను, వుండమని చెప్పారు."

అలాగా అన్నట్టు తలూపాడు.

రావమ్మయమ్మ రెండు గ్లాసుల్లో హార్లిక్స్ తీసుకొచ్చి టీపాయ్ మీద పెట్టి లోపలి కెళ్ళిపోయింది

జయంతి చిన్నగా నవ్వుకొని గ్లాసు తీసుకొని నోటి దగ్గర పెట్టుకోబోతూ ఆగింది.

తనవంకే తదేకంగా చూస్తున్నాడు.

"యేమిటలా చూస్తున్నావ్ ?" నవ్వుతూ అడిగింది.

ఉలిక్కి పడినట్టుగా కదిలాడు. గభాలున గ్లాసందుకొని తాగడం మొదలు పెట్టాడు. తాగడం పూర్తిచేసిన తర్వాత గ్లాసు టీపాయ్ మీద పెట్టి లేచి నిలబడ్డాడు. సోఫాలో పెట్టిన పుస్తకాల బాగ్ భుజాన తగిలించుకున్నాడు.

"స్నానం చేస్తాను. మీరింకా యెంత సేపు వుంటారు?" నెమ్మదిగా అడిగాడు.

"ఇంకా గంట వుంటాను."

విద్యాసాగర్ తలవూపి ఆలోచిస్తూ యింట్లోకి నడిచాడు.

* * *

ఆ తర్వాత మరో అరగంటలో విద్యాసాగర్ జయంతికి బాగా చనువయ్యాడు. ఉత్సాహంగా తన స్కూల్లో విశేషాలు అన్నీ చెప్పడం మొదలు పెట్టాడు. అన్నిటికి ఓపిగ్గా ఊఁకొట్టింది. తన బెడ్‌రూమ్‌లోకి తీసుకెళ్ళి, తన పుస్తకాలు, తను గీసిన బొమ్మలు, అన్నీ చూపించాడు. జయంతి కూడా ఉత్సాహంగా అన్నీ ఆసక్తిగా పరిశీలించింది. అతని అమాయకత్వం, మొహంలో నిర్మలత్వం జయంతిని బాగా ఆకర్షించాయి.

"మీరు చాలా మంచివారు" అన్నీ చెప్పేసి అలసటగా మంచం మీద పడుకుంటూ అన్నాడు, ఆమె వంక ప్రేమగా చూస్తూ.

"ఏం యెందుకని" నవ్వుతూ అడిగింది, అతని పక్కనే మంచం మీద కూర్చుంటూ.

"మీ రెప్పుడూ నవ్వుతూ వుంటారు అందుకని"

"ఉహూఁ నవ్వుతూ వుండేవాళ్ళు మంచివాళ్ళా ?"

"అవును. మా మేడమ్ ఎప్పుడూ నవ్వరు. కోపంగా వుంటారు. ఆవిడను చూస్తే నాకు భయం. పాఠం ఎంత బాగా అప్పజెప్పినా సరే అలాగే వుంటారు" అమాయకంగా చెప్పాడు.

"మా మమ్మీ కూడా అంతే."

మవునంగా తల వూపింది జయంతి.

విద్యాసాగర్ హఠాత్తుగా లేచి కూర్చున్నాడు.

"మా మమ్మీని చూశారా మీరు ?"

ఊహించని యీ ప్రశ్నకు జయంతి తడబడింది. యేం చెప్పాలో తెలియక రెండు క్షణాల తర్వాత తల అయిష్టంగా ఆడించింది లేదన్నట్టు.

"ఉండండి చూపిస్తాను" చటుక్కున మంచం మీదినుంచి కిందికి వురికాడు. డన్‌లప్ పరుపు పైకెత్తి అటూ ఇటూ వెతికి, ఓ కార్డుసైజు ఫొటో బయటకు తీసి ఆశ్చర్యంగా చూస్తున్న జయంతి చేతిలో పెట్టాడు. ఫొటో వంక పరిశీలనగా చూసింది జయంతి. ఫొటోలో కంటే మామూలుగానే బావుందనిపిం

చింది రాజ్యలక్ష్మి.

"ఈ ఫొటో అక్కడ దాచావేం ?" తిరిగి యిచ్చేస్తూ అడిగింది. ఫొటో అందుకొని మళ్ళీ పరుపుకింద పెట్టేసి, తలగడలు సరిగా సర్దేసి మంచం మీద కూర్చున్నాడు.

"మా ఇంట్లో యీ ఒక్కటే వుంది" అని అటూ యిటూ చూసి రహస్యం చెబుతున్నట్టుగా అన్నాడు "మా డాడీ చూశారంటే చింపేస్తారు అందుకని."

జయంతి లోలోపలే నిట్టూర్చింది.

సాగర్ ఆవులించాడు.

"నిద్రొస్తుందా ? పడుకో !"

"మీరు రేపు కూడా వుంటారా ?"

"ఏమో చెప్పలేను."

"పోనీ వుండండి ఏం."

నవ్వి తలూపింది. ఆ తరువాత మరో పది నిమిషాలకు యేదో చెబుతూ చెబుతూ నిద్రలోకి జారిపోయాడు.

బయట కారాగిన చప్పుడయింది. కమలాకరం వచ్చాడన్న మాట అనుకుంది. లేచి బయటకు వెళ్ళాలో లేదో తెలియక అక్కడే కూర్చుండి పోయింది.

మరో పావుగంట తర్వాత రావయమ్మ వచ్చింది.

"అయ్యగారు భోజనానికి రమ్మంటున్నారమ్మా"

ఆశ్చర్యంగా చూసింది "భోజనానికా ?"

"అవును. డైనింగ్ హాల్లో మీ గురించి చూస్తున్నారు".

ఏం చెప్పాలో తెలియక లేచి నిలబడి బయటికి నడిచింది.

తనను చూడగానే సాదరంగా ఆహ్వాన

పూర్వకంగా నవ్వాడు.

"రండి. కూర్చోండి!" యెదురుగా టేబిల్ కు అటువైపునున్న కుర్చీ చూపిస్తూ అన్నాడు.

"నేను హోటలుకెళ్ళి చేస్తానుగా!" బిడియంగా అంది.

కమలాకరం నవ్వాడు. "ఇప్పటికే ఎనిమిదయ్యింది. మీరు వెళ్ళేటప్పటికి మరోగంట యెలానూ పడుతుంది. అప్పటికి భోజనం వుండదు. ఉన్నా బావుండదు. ఫరవాలేదు కూర్చోండి".

జయంతి కూర్చుంది. రావఁయమ్మ వడ్డించడం ప్రారంభించింది.

"ఇంతసేపూ మీకు బాగా బోరనిపించిందా?"

"లేదు. మీ సాగర్ నాకు బోలెడంత కాలక్షేపం. చాలా మంచి అబ్బాయి".

కమలాకరం తృప్తిగా నవ్వాడు. ఆ నవ్వులో యేదో రవ్వంత ఆవేదన కూడా వినిపించింది జయంతికి.

రావఁయమ్మ బయటికెళ్ళిన తర్వాత కమలాకరం అన్నాడు—

"భోజనం చాలా ప్రశాంతంగా చెయ్యాలంటారు. అంచేత యిప్పుడు అలాగే చేద్దాం".

కమలాకరం చెబుతున్నదేమిటో అర్థమయింది జయంతికి. భోజనమైన తర్వాత మాట్లాడుకుందామని అతని అభిప్రాయం. చిన్నగా నవ్వి తలూపింది.

మరో పావుగంటలో భోజనం పూర్తి చేశారు.

రావఁయమ్మ పనులన్నీ ముగించుకొని, తను వెళ్ళి విద్యాసాగర్ గదిలో చాప తీసుకొని నిద్రకుపక్రమించింది.



## 3

డ్రాయింగ్ రూములో సీలింగ్ ఫ్యాన్ నెమ్మదిగా తిరగడం ప్రారంభించింది.

"నాకెవ్వరూ లేరు. ఎందుకు లేరు, యెలా లేరు అన్న విషయాలూ వివరంగా చెప్పి మిమ్మల్ని విసిగించదల్చుకో లేదు. నాకెవ్వరూ లేరు. మూడేళ్ళక్రితం రాజారావు నన్ను పెళ్ళిచేసుకున్నారు. అప్పుడీ ప్రపంచంలో నాకున్నదల్లా ఆయన ఒక్కరే. ఆయనే నా ప్రపంచం. మేము కాకినాడలో వుండేవాళ్ళం. ఎలక్ట్రికల్ రెవెన్యూ ఆఫీసులో ఆయన గుమస్తా. ఎనిమిది నెలలక్రితం ఆయనకు ఇక్కడికి ట్రాన్స్ఫరయింది" క్షణంపాటు ఆగింది జయంతి.

కమలాకరం మౌనంగా ఏ రకమైన భావమూ ప్రస్ఫుటించకుండా వింటున్నాడు. తిరిగి ప్రారంభించింది—

"సరయిన యిల్లు అద్దెకు దొరకలేదనీ ప్రయత్నిస్తున్నాననీ రాసేవారు. నెలకోసారి మాత్రం వచ్చి రెండురోజులు వుండిపోయేవారు. నాలుగు నెలలు అలాగే గడిచింతర్వాత, ఒకరోజు తన విషయమంతా వివరంగా ఉత్తరం రాశారు. ఆ ఉత్తరం రాసింది యిక్కణ్ణించి కాదు, ఏలూరునించి..."

కమలాకరం సోఫాలో సరిగ్గా కూర్చున్నాడు.

"పిడుగుపాటు మాదిరి వచ్చిన ఆ ఉత్తరం చూసి, నేను నాలుగయిదు రోజులు తేరుకోలేకపోయాను. నా బ్రతుకెందుకిలా అయిందో, నేను చేసిన తప్పేమిటో నాకు అర్థం కాలేదు. ఆ ఉత్తరాన్ని యెన్నిసార్లు చదివానో. అవే వాక్యాలు, అదే సారాంశం... తను ఉద్యోగానికి రాజీనామా చేసినట్టు, రాజ్యలక్ష్మిగారితో ఏలూరులో వుంటున్నట్టు. త్వరలో యేదో వ్యాపారం ప్రారంభించబోతున్నాననీ, నాకు నెలనెలా బతకడానికి అవసరమయ్యే డబ్బు పంపిస్తాననీ రాస్తూ, ఆవిడను వదులుకోలేని తన నిస్సహాయతను కూడా గాఢంగా వ్యక్తం చేశారు ఆయన".

జయంతి కంఠం గాద్గదికమై, పొరబోయింది. చిన్నగా దగ్గుతూ నిమిషం పాటు నిశ్శబ్దంగా వుండిపోయింది.

కమలాకరం యేదో ఉద్రిక్తత ఫీలయినట్టు వూపిరి బలంగా వదులుతున్నాడు. జయంతి ప్రారంభించింది–

"తరువాత నేనెన్ని ఉత్తరాలు రాసినా సమాధానం లేదు. ఇన్నాళ్ళూ ఆయన తప్పు తెలుసుకొని యెప్పటికైనా తిరిగి వస్తారని యెదురుచూసి యెదురు చూసి ఆఖరుకు మొన్న నాలుగురోజుల క్రితం నేను స్వయంగా ఏలూరు వెళ్ళాను వాళ్ళ దగ్గరికి" ఆగింది కమలాకరం వైపు చూస్తూ. కమలాకరం ఆశ్చర్యంగా తలెత్తాడు.

జయంతి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"అవును కమలాకరంగారూ! అభిమానాన్ని, సిగ్గును వదులుకొని ఏ స్త్రీ అనుభవించని అత్యంత హీనమైన ఆవేదనను అనుభవిస్తూ వాళ్ళ గుమ్మంలో అడుగు పెట్టాను".

* * *

ఆ వీధి చివరగా, ముదురు నీలం రంగు వంటరి డాబా, చుట్టూ ప్రహరీ, గేటు తీసుకొని లోపలికెళ్ళి వరండా మెట్లెక్కాను. ఒకవైపు నాలో యేదో సంకోచం, అర్థంకాని భయం, చూడకూడని దృశ్యమేదో చూడబోతున్నానన్న ఆందోళన, మరోవైపు గుండెల్లోంచి యెగదన్నుకొస్తున్న కోపం, ఏం చెయ్యాలో, యేమనాలో తెలీని సందిగ్ధత ... అన్నీ కలిసిపోయి ఆపుకోలేని దుఃఖంగా పైకి వుబుకుతోందే విచిత్రమైన అనుభూతితో రెండు నిమిషాల పాటు అలాగే గుమ్మం దగ్గర నిలబడి పోయాను. చివరికి ఎలాగో గుండె దిటవు చేసుకున్నాను.

చేతిలో సూట్ కేస్ కింద పెట్టి కాలింగ్ బెల్ స్విచ్ మీద వణుకుతున్న చెయ్యి వేశాను. లోపల యెవరో నడుస్తున్న చప్పుడు చటుక్కున చెయ్యి కిందకి దించేశాను. నాలో యేదో కంగారు, నిలువెల్లా సన్నటి వణుకు, యిప్పుడు వాళ్ళు నన్ను చూస్తే యేమనుకుంటారు... సిగ్గుపడతారా? అతను యేమనుకుంటాడు ? తప్పుచేసిన వాడిలా తలవంచుకుంటాడా? అతని మొహం గుర్తుకు రాగానే అతను చేసిన ద్రోహం గుర్తుకు రాగానే నాలో కోపం కట్టలు తెంచుకొంది. నాలో యేదో మొండితనం నిలువెల్లా పాకింది. చటుక్కున చెయ్యెత్తి కాలింగ్ బెల్ స్విచ్ బలంగా నొక్కాను. నిమిషంసేపు అలాగే నొక్కి వుంచి, చెయ్యి తీశాను. రెండు నిమిషాలు అలాగే యెదురు చూశాను లోపల యే విధమైన




చప్పుడూవినిపించలేదు. మళ్ళీనొక్కాను మరో నిమిషం వెయిట్ చేసి మళ్ళీ నొక్కాను.! ప్రయోజనం శూన్యం. మరి కొంతసేపు అలాగే అయోమయంగా నిలబడ్డ తర్వాత ఒక విషయం స్ఫురించింది ఆ కాలింగ్ బెల్ పని చెయ్యటం లేదేమోనని. నవ్వొచ్చింది యెందుకో... తలుపు కొట్టాను వినిపించలేదేమోనని మళ్ళీ కాస్త గట్టిగా కొట్టాను.

లోపల్నించి యెవరిదో గొంతు వినిపించింది. గుండె దడదడ లాడింది ఆ గొంతు మగో, ఆడో స్పష్టంగా గుర్తించలేకపోయను. తలుపువైపు యెవరో నడిచి వస్తున్న అడుగుల చప్పుడు నన్ను నేను అదుపు చేసుకొంటూ పైట భుజం చుట్టూ లాక్కుని, సూట్ కేస్ చేతిలోకి తీసుకొని సరిగ్గా నిలబడ్డాను.

తలుపు తెరుచుకొంది.

ఏదో మధురమైన పరిమళం నన్ను చుట్టు ముట్టింది. క్షణం తర్వాత యెదుటి మనిషిని గుర్తించ గలిగాను.

పసుపురంగు నెటెడ్ చీరలో తెల్లగా మెరిసిపోతూ గుమ్మంలో నిలబడి నా వంక అర్థం కానట్టు చూస్తూన్న స్త్రీని రాజ్యలక్ష్మిగా అనుకున్నాను. నా జీవితాన్ని నిర్దాక్షిణ్యంగా నాశనం చేస్తున్న ఆమెను చూడగానే నాలో యే భావమూ కలగలేదు. ఆమె యెలా వుంటుందో నన్న ఆశ్చర్యంతో నిండిపోయిన హృదయం, మరో భావానికి చోటివ్వ లేదేమో. మధురంగా సాగిపోతున్న నా జీవన రాగంలో అపశృతిలా విన్పించిన ఆమె, నిజంగానే యేమంత అందగత్తె కాదనిపించింది. నా స్త్రీ సహజమైన అహం ఆమెను అందమైన దానిదిగా ఒప్పుకోపోయినా, నాఅంతరాత్మ కూడా ఆమెను అందగత్తెగా ఒప్పుకోలేదు. కాకపోతే ఆమెలో యేదో ఆకర్షణ వుంది. దానిని నాతో బేరీజు వేసుకోవడం తెలివి తక్కువ తనమని తెలుసు. ఆ క్షణంలో నాకు అనుభవ పూర్వకంగా అవగతమైన సత్యమొకటుంది. సౌందర్యం నిర్వచించలేనిది. అది ఏ ఇద్దరి కంటికి ఒక్కలా కనిపించదని - బహుశా అందుకే అది అనిర్వచనీయమేమో! మరోసారి వేగంగా నా కళ్ళు ఆమెను తడుముతున్నాయి.. వదులుగా తెల్లటి రిబ్బన్‌తో ముడివేసిన కురులు, నిశ్చలంగా భయంలేనట్టు తీక్షణంగా వున్న కళ్ళు, మెడతో సన్నటి వొంటిపేట గొలుసు, పైట కిందుగా దూరి, ట్రాన్స్‌పరెంటుగా వున్న ఆ పైట కింద బరువుగా వంగి అంచులు లీలగా కనిపిస్తున్న లోనెక్ జాకెట్లోకి ప్రయాణించి దాక్కున్న ఆ గొలుసు కింది వంపులో మంగళసూత్రాలు వున్నాయో లేదో. స్పష్టంగా తెలియడంలేదు. జానెడు పైగా నగ్నంగా, బంగారంలా మెరుస్తున్న పలుచని పొట్ట, లోతైన బొడ్డు, దానికి నాలుగంగుళాలు కిందనుంచి మొదలయిన చీర కుచ్చెళ్ళు ఆమె రూపం మగాళ్ళకి చాలా సెక్సీగా కనిపించవచ్చు!

"యెవరు మీరు ?" హుందాగా ధ్వనించిన ఆమె గొంతువిని వులిక్కిపడ్డాను. ఆమె కళ్ళుకూడా నన్ను ఆపాదమస్తకం పరిశీలిస్తున్నాయి.

"యెవరు కావాలి మీకు ?" యీ సారి ఆమె గొంతులో కాస్త చిరాకు. నేను ఓ సారి గట్టిగా వూపిరి పీల్చి వదిలాను. నా గొంతు వణుకుతుందేమో


చతుర ... 31

నని భయంగా వుంది నాకు. నేనసలు అలా యెందుకంత టెన్షన్ ఫీలవుతున్నానో నాకే అర్థంకాని హీనమైన స్థితి. ఓ సారి నా గొంతు సవరించుకొన్నాను.

"నా పేరు జయంతి" యెంతో హుందాగా సూటిగా, అందామనుకొన్న నా ప్రయత్నం వ్యర్థమై పోయింది. నా గొంతు నాకే దీనంగా, అసహ్యంగా వినిపించింది.

ఆమె వులిక్కి పడినట్టు స్పష్టంగా తెలిసిపోయింది నాకు. తలుపు సగం తెరిచి పట్టుకొన్న ఆమె చెయ్యి డోర్ హాండిల్ మీదనుంచి కిందికి జారింది.

"నాకు రాజారావుగారు కావాలి" యీ సారి నా గొంతు సంతరించుకొన్న కఠినత్వం నాకొ్కంత తృప్తికలిగించింది.

ఆమె నిర్ఘాంత పోయినట్టు స్తబ్దుగా నాలుగు క్షణాలు అలాగే నిలబడి తరువాత సర్దుకున్నట్టుగా కదిలింది.

"రండి" అంటూ వెనక్కి తిరిగిందామె. ఆమెను అనుసరిస్తూ లోపలి కడుగు పెట్టాను. ఆమె నడకలో యేదో తెచ్చిపెట్టుకున్న వయ్యారం. ముందు నుంచి చూసినా ఆమె వయస్సు యెంతో చెప్పడం కష్టం. వెనకనించి మరీ చిన్న దానిలా కనిపించింది.

"కూర్చోండి" సోఫా చూపించింది. నిశ్శబ్దంగా కూర్చున్నాను, సూట్ కేస్ పక్కన పెట్టి. ఆవిడ ఫ్యాన్ స్విచ్ నొక్కింది.

"యేం తీసుకొంటారు కాఫీయా?".. ఆమె గొంతు చాలా మృదువుగా వుంది. చప్పున కళ్ళెత్తి ఆమె మొహంలోకి చూశాను. ఆమె కళ్ళుయింకా నన్ను పరిశీలించడం మానలేదు. అసలు నేనెందుకు అక్కడకు వచ్చానో గుర్తొచ్చే సరికి నాలో మూలబడి పోయిన వుక్రోషం, కోపం పైకి వచ్చాయి.

"నాకేం అక్కర్లేదు రాజారావుగారు కావాలి!"

ఆమె మాట్లాడలేదు. రెండు క్షణాలు అలాగే చూసి నిశ్శబ్దంగా లోపలి కెళ్ళి పోయింది. అలా సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయిన ఆమె మీద నాకు చెప్పలేనంత చిరాకు. ఒకవేళ రాజారావు లోపలున్నాడేమో! తను వెళ్ళి అతన్ని పంపిస్తుందేమో!!

ఈ ఊహ రాగానే ఒక్కసారిగా నా నరాలన్నీ బిగదీసుకు పోయినట్లనిపించాయి. చాలాకాలం తర్వాత మళ్ళీ అతన్ని చూడ్డం. ఒక్కరోజు వియోగం కూడా భరించలేని రాజారావు యిన్నాళ్ల తర్వాత తను కనబడితే యేం చేస్తాడు. మునుపటిలాగే వూపిరి సలపనంత గట్టిగా వాటేసుకొని ఛ......ఛ...... ఆ వూహే నాకు భరించలేనంత అసహ్యంగా తోచింది. నా కళ్ళల్లో తిరగబోతున్న నీటిని బలవంతగా రెప్పల కింద అదిమి పెడుతూ ఆలోచనల్ని సడలించుకోడానికి నా దృష్టిని నలువైపులా తిప్పడం మొదలు పెట్టాను.

గది చాలా అందంగా, నీట్‌గా వుంది. ఖరీదైన ఫర్నిచరు. ఓ మూల టెలిఫోన్, గోడలమీద చాలా లీలగా కనిపించీ కనిపించనట్లు స్ప్రే చేసిన చిత్రాలు, మేఘాలు ప్రబంధ వర్ణనల్లో కనిపించే అర్ధనగ్న దేవతా స్త్రీ మూర్తులు, నేల మీద యెర్రటి కార్పెట్, గదంతా యేదో మధురమైన పరిమళం. నా పక్కన




అడుగుల చప్పుడు.

చూపు నిశ్చలంగా బిగబట్టి ఎదుటి గోడలోకి చొచ్చుకు పోయేలా చూస్తూ కూర్చున్నాను.

"కాఫీ తీసుకోండి" ఆవిడ గొంతు.

తల తిప్పి చూశాను. రాజారావు లేడు. ఆమె రెండు చేతుల్లోనూ రెండు పొగలు కక్కుతున్న కాఫీ కప్పులు. నేను కాఫీ వద్దన్నా సరే తీసుకొచ్చిన ఆమె వుద్దేశం యేమిటో నా కర్థం కాలేదు.

"వద్దన్నానుగా!"

"ఫరవాలేదు తీసుకోండి. కాఫీయే గదా!" చాలా మృదువుగా అంటూ నా చేతికి కాఫీ అందిస్తుంటే యెంత ప్రయత్నించినా యెదురు చెప్పలేక అందుకున్నాను. ఆమె నా ఎదురుగా సోఫాలో కూర్చుని కాఫీ తాగడం మొదలు పెట్టింది. నేను కూడా తప్పని సరిగా ఆ కాఫీ తీసుకోవలసి వచ్చింది. పూర్తయిన తర్వాత కప్పు టీపాయ్ మీద పెట్టేసి, అక్కడే వున్న వారపత్రిక చేతుల్లోకి తీసుకొని అటూ యిటూ తిరిగెయ్యడం మొదలు పెట్టింది. నేను కూడా కప్పు టీపాయ్ మీద పెట్టాను. పత్రిక మధ్యలోకి మడిచి దాని అంచులు వేళ్ళతో తడుముతూ యేదో చెప్పటానికి తటపటాయిస్తున్నట్టు కూర్చుంది ఆమె. నేను నిశ్శబ్దంగా చూస్తూ కూర్చున్నాను.

"నేనెవరో తెలుసనుకుంటాను" నెమ్మదిగా తలవంచుకొని అంది. ఆమె వేళ్ళు చేతిలోని పత్రికని పొరలు పొరలుగా విప్పడానికి ప్రయత్నిస్తూ కదులుతున్నాయి.

"రాజ్యలక్ష్మిగారు మీరే అనుకుంటాను" నా గొంతులో యెంత ఆపుకుందామన్నా ఆగని యేదో హేళన భావం ధ్వనిస్తోంది.

అవునన్నట్టుగా నెమ్మదిగా తలూపింది.

"మరి నేనెవరో కూడా మీకు తెలిసే వుంటుంది" నా గొంతులో మునుపటి సందిగ్ధత, భయం, హీనత్వం లేవు. హుందాతనం, నూతనత్వం పలుకుతున్నాయి. తెలుసన్నట్టు నెమ్మదిగా తలూపింది. కళ్ళు పైకెత్త లేదు. చూపులు చేతిలోని వారపత్రిక మీదే అటూ ఇటూ చలిస్తున్నాయి.

"రాజారావు లేరా ?" అడిగాను.

లేరన్నట్టు తల వూపింది. నా కొక్కసారిగా నీరసం వచ్చినట్టయింది. ఏదో వుక్రోషం కూడా ముంచు కొచ్చింది.

"ఎక్కడికెళ్ళారు? ఎప్పుడొస్తారు?"

"అసలు మీ రెందు కొచ్చారు" నెమ్మదిగానే వుంది ఆమె గొంతు.

ఆ ప్రశ్న వినగానే ఒళ్ళు మండి పోయింది నాకు. ఆ ప్రశ్న ఆమె యెలా వెయ్యగలిగిందో అర్థం కాలేదు. నాలో కోపం కట్టలు తెంచుకొని విచక్షణ నశించినట్టు అన్నాను.

"మీరు లేవదీసుకొచ్చిన రాజారావును, మళ్ళీ నేను లేవదీసుకు పోదామని" తుపాకి దెబ్బతిన్నట్టు చటుక్కున తల పైకెత్తింది. ఆమె కళ్ళు నేనూహించినట్టు తడిదేరి లేవు. ఎర్రగా చింత నిప్పుల్లా వున్నాయి. ముక్కు పుటాలు వుబ్బి, శ్వాస వేగంగా వదులుతున్న ఆమె మొహం చూడగానే, క్షణం పాటు నా గుండె దడదడ లాడింది. అంతలోనే యేదో మొండితనం రెట్టింపై కూర్చుంది.



చతుర ... 31

"అతను మీతో రాడు?" ఆమె కంఠంలో పలికిన దృఢమైన నమ్మకం నన్ను గిజగిజలాడేలా చేసింది.

"ఏం యెందుకు రాడు" మొండిగా అడిగాను.

"నాతో వచ్చాడు కాబట్టి" తాపీగా వుంది ఆమె సమాధానం.

"మీతో రాకముందే నాకు తాళి కట్టాడు."

ఆమె నవ్వింది. ఆమె నవ్వుతోంటే వెర్రిదానిలా చూస్తూ వుండిపోయాను. చివరికి అంది.

"నేను కూడా ఒకరి చేత తాళి కట్టించుకున్న దాన్నే"

"అయితే!" అర్థంకానట్టు అడిగాను.

"అంతే దానివిలువ. నేను వచ్చేయ్యా లేదూ. అలాగే యిదీ."

నా కోపం అవధులు దాటిపోయింది.

"ఛీ! సిగ్గులేని దానా నువు బరి తెగించిన దానివి, నీకు నీతి లేదు, నా బ్రతుకు. నాశనం చేసిన రాక్షసివి. నిన్ను...నిన్ను..."పిచ్చిదానిలా అరిచి గభాలున లేచి ఆమె మీది కురికాను.

ఊహించని యీ హఠాత్ పరిణామా నికి ఆమె ఒక్క క్షణం తెల్లబోయినట్లు కనిపించింది. నన్ను బలంగా రెండు చేతులతోనూ పట్టుకొంది. ఆమెను యేదో చేసెయ్యాలని నా ప్రయత్నం. అలా యెంత సేపు పెనుగులాడామో చివరకు ఆమె నన్ను బలంగా విదిలించింది. నేను సోఫాలో పడిపోయాను. ఏదో మైకపు తెర నన్ను నెమ్మదిగా ఆవరించుకొంది. ఎంతసేపు అలా వున్నానో నాకు తెలి యదు. నాకు మెలుకువ వచ్చేటప్పటికి

అప్రయత్నంగా నేను వెక్కి వెక్కి యేడుస్తున్నట్టు అర్థమయింది. కళ్ళువిప్పి చూసేసరికి ఆమె నా మొహంలోకి ఆతృ తగా చూస్తోంది. ఆమె మొహంమీద నా గోళ్ళు రక్కేసిన చారలు యెర్రగా కని పిస్తున్నాయి టీపాయ్‌మీద గాజుగ్లాసుతో నీళ్ళున్నాయి. నా మొహం తడిగా వుంది. చిలకరించింది కాబోలు. నేను కళ్ళు విప్పడంచూసి ఆమె తేలిగ్గా నిట్టూర్చింది. ఎంత ఆపుకుందామన్నా నాకు దుఃఖం ఆగటంలేదు. అలాగే పావుగంట కరువు తీరా యేడ్చి చివరకు తమాయించుకొని, కళ్ళు తుడుచుకొని, సోఫాలో సరిగ్గా కూర్చున్నాను.

"కొద్దిగా కాఫీ తీసుకోకూడదూ?" ఆమె నెమ్మదిగా అంది.

నేను తల అడ్డంగా ఆడించాను.

ఆమె చిన్నగా దగ్గి, గొంతు సవ రించుకొని నెమ్మదిగా ప్రారంభించింది.

"చూడండి జయంతీ! మీరు నాగురించి యేమైనా అనుకోవచ్చు. నాకు అభ్యం తరం లేదు. కాని వుద్రేకపడకుండా నేను చెప్పే విషయాలు పూర్తిగా వినండి. ఆ పైన నేను చేసిందేమిటో, మీరు చెయ్యాల్సిందేమిటో నిర్ణయించుకోండి."

నేనేం మాట్లాడలేదు. యేం మాట్లా డాలో తెలియక, మౌనంగా వింటూ కూర్చున్నాను.

"నేను అందగత్తెను కాకపోయినా అనాకారిని కాదు. నా పుట్టింటి వాళ్ళు నాకు యిచ్చిన ఆస్తి చాలా వుంది. కమలాకరంతో నా జీవితం ముడివడి దాదాపు పది సంవత్సరాలయింది. అతన్ని విడిచిపెట్టేవరకూ, యే రోజూ అతనితో నేను పది క్షణాలు కూడా ఆనందించలేక పోయాను. ఎందుకు ఆనందించలేక

పోయాను. ఎలా జరిగింది. అని నేను చెప్పబోవటంలేదు. ఎందుకంటే అది చెప్పటానికి సాధ్యపడదు. చెప్పినా అర్థం కాదు. జీవితంపట్ల అతని దృక్పథం వేరు, నాది వేరు. జీవితాన్ని పెద్ద బాధ్యతగా తీసుకొనే మూర్ఖుల్లో అతను మొదటివాడు. బ్రతుకులో బాధ్యతలు తప్ప మరేమీ విలువయినవంటే అతనంగీకరించడు. నా నమ్మకాలు వేరు. బ్రతికినంతకాలం వీలయినన్ని ఎక్కువ క్షణాల్ని ఆనందంగా మలుచుకోవాలన్నది నా వుద్దేశం. ఆనందమన్నది రకరకాలుగా వుండవచ్చు. దానికి రకరకాల నిర్వచనాలు చెప్పవచ్చు. కాని పురుషుడి ఆనందం స్త్రీతోనూ, స్త్రీ ఆనందం పురుషుడితోనూ ముడిపడి వుండటమే సత్యం. అలా కాసిది అది నిజమైనది కాదు. ఎందుకంటే, స్త్రీగాని, పురుషుడుగాని విడివిడిగా పూర్తి మనుషులుకాదు. వాళ్ళిద్దరూ కలిస్తేనే 'మనిషి'..." ఆమె క్షణంసేపు ఆగింది.

ఆమెమాటలు...అవి ఆమెచెబుతున్న తీరు, నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి.

"ఈ పాటికి మీకు అర్థమయ్యే వుంటుంది. అతనితో నేనెంత సుఖపడగలిగానో! ఎన్నో రకాలుగా, యెంతో కాలం ప్రయత్నించాను. అతన్ని మార్చుకుందామని. నాకు సాధ్యం కాలేదు. సాధ్యం కాకపోవటం నా అసమర్థతకాదు అతని అనర్హత. ఎందుకంటే, అందమైన శిల్పం మలచగలిగిన ప్రతిభ చేతుల్లో వున్నా, తగిన రాయి దొరకాలి. చిన్నదెబ్బకే ముక్కలయిపోయే శిలతో యెంతటి శిల్పి అయినా శిల్పాన్ని మలచగలడా?"

"నా జీవితం పూర్తిగా అడవిగాచిన వెన్నెల అయిపోతుందేమోనని నిరంతరం భయపడేదాన్ని. అలాంటి సమయంలోనే నా చీకటి బ్రతుకులోకి వెన్నెల్లాగా రాజా రావొచ్చాడు. అతన్ని నేను మనస్ఫూర్తిగా ప్రేమించాను. అతను ...అతను లేకుండా నేను బ్రతకలేను" చివరిమాటలు చెబుతున్నప్పుడు, ఆమె గొంతు వణికింది. నాకు అయోమయంగా వుంది ఆమె చెబు

తున్న మాటలు యెలా వినగలుగుతున్నానో! విని యెలా భరించగలుగుతున్నానో!! నాకే ఆశ్చర్యంగా వుంది. నన్ను ప్రాణంతో ప్రాణంగా చూసుకొనే నా భర్త గురించి ఆమె అలా మాట్లాడుతుంటే నాకేమనాలో తోచలేదు. అంతటి భయంకరమైన పరిస్థితిని తట్టుకోగలని నాకు అప్పటివరకూ తెలియదు.

"అంతేకాదు, నేను లేకుండా కూడా రాజారావు క్షణంసేపు జీవించలేడు" ఆమె యెంతో నమ్మకంగా చెబుతున్న ఆ మాటలు నా గుండెల్లోకి నిర్దాక్షిణ్యంగా దిగబడుతున్నాయి. నాకు పరిస్థితి పూర్తిగా అర్థమైపోయింది. ఏడుపూ, నవ్వూ కలగలిపి పైకి వుబుకుతోంటే బలవంతంగా నిగ్రహించుకున్నాను. కొంతసేపటికి యింతకుముందు నాలో యెన్నడూ లేని తెగింపు, ధైర్యం, చోటు చేసుకొన్నాయి. నెమ్మదిగా నేను కూడా మాట్లాడం ప్రారంభించాను.

"అతను నాకు తాళి కట్టిన భర్త. అతనిమీద నాకు హక్కు వుంది"

ఆమె అదోలా నవ్వింది.

"ఇంతకుముందే చెప్పాను తాళి గురించి" అని చటుక్కున పైట తొలగించి మెడలోంచి జాకెట్లోకి దిగబడిన గొలుసును వేగంగా బయటకు లాగింది. చిన్న చప్పుడు చేశాయి కింద వేలాడుతున్న మంగళసూత్రాలు. గుండ్రంగా తళతళా మెరుస్తున్నాయి.

"ఇది కమలాకరంచేత నేను కట్టించుకొన్నదే కాని యీ రోజు కమలాకరానికి నా మీద యే రకమైన హక్కూ లేదు. అతని మీద కూడా నాకు యే విధమైన అధికారమూ లేదు."

"ఏం యెందుకని? విడాకులు తీసుకున్నారా?"

"అవును. కానీ చట్టరీత్యా కోర్టులో కాదు. మనసుకు మించిన న్యాయస్థానం మరోటి వుందనుకోను."

"మరి ఈ వివాహం, బంధాలు అంతా వట్టివేనా? వీటికి విలువ లేదా?" వ్యంగ్యంగా అడిగాను.

"ఇచ్చుకున్న వాళ్ళకి బోల్డంత విలువుంది. వీటి మీద నాకు నమ్మకం లేదు. మనసు పడని వాళ్ళని మంగళసూత్రాలు కట్టి వుంచుతాయనుకోను. వుంచలేవు. దానికి నేనే ఉదాహరణ. నాకు జీవితం మీద నమ్మకం వుంది"

"జీవితమంతా ఆనందమే అనుకోవడం తెలివితక్కువతనం. బతుకు సుఖదుఃఖాల మిశ్రమం" ఆవిడ ప్రతి మాటకూ అడ్డంవెళ్ళి ఆవిడను గాయపరచడమే నా లక్ష్యమైపోయింది ఆ క్షణంలో.

"నిజమే! కాని, సుఖాన్ని వీలైనంత ఎక్కువ పొందగలిగితే దుఃఖం చిన్నదైపోతుంది."

నేను గట్టిగా నవ్వాను. అలా నేను నవ్వుతోంటే ఆమె నా వంక అర్థంకానట్లు చూసింది.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"మీ అమాయకత్వం చూసి"

ఆమె కోపంగా చూసింది. ఆమెను ఎంతో కొంత గాయపర్చగలిగానన్న ఆనందం పొందగలిగాను.

"దుఃఖాన్ని దూరంగా తరిమేసి, వీలయినంత ఎక్కువ సుఖాన్ని పొందాలన్న మీ ప్రయత్నం, ఎంత అమాయకమయిందో మీకు తెలియడం లేదు.




ఆసలు మీ ప్రయత్నమే దుఃఖం. ఎలా రాసిపెట్టి వుంటే అలా జరుగుతుంది... మనం ప్రయత్నించినంత మాత్రాన ప్రతిదీ జరగదు"

"ఏమో రాతల మీద నాకు నమ్మకం లేదు"

"మీకు నమ్మకం లేనంత మాత్రాన జరక్కుండా పోదు"

ఆమె సోఫాలోంచి చివాలున లేచి నిలబడింది.

"ఇక మీరు వెళ్ళొచ్చు!" చాలా కఠి నంగా అంది.

నేను నివ్వెరపోయాను.

"అంత రాతల మీద నమ్మకముంటే యిక్కడికి కెందుకొచ్చారు? ఇది నా తల రాతనుకొని సరిపెట్టుకుంటే పోయేదిగా! ఆ రాతలోనే మళ్ళీ నీ భర్త నీ దగ్గర కొచ్చేదుంటే వచ్చేస్తాడుగా ... మీరు చేస్తున్న ఈ ప్రయత్నమెందుకు?"

ఆవిడ మాటలకు నేను తెల్లబోయాను. ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు. ఐదు నిమిషాల నిశ్శబ్దం తర్వాత ఆమె నెమ్మదిగా కూర్చుంది. నాకు మళ్ళీ దుఃఖం వస్తోంది...

"అతను నా భర్త" నెమ్మదిగా అన్నాను.

"అది పొరబాటు. అతను నా భర్త" ఆమె నవ్వింది.

"అతని ప్రేమానురాగాలు నాకు కావాలి!"

"అవే నాకూ కావాలి"

"వాటిని పొందగలిగే అర్హత మీకు లేదు"

"ఉంది కాబట్టే పొందగలుగు తున్నాను"

"నీక్కావలసింది అది కాదు. కామం ... శృంగారం ... మద పిచ్చి నీకు" పిచ్చిగా అరిచాను.

"అరవకు! ప్రేమా... కామం ... విడివిడిగా వుంటాయనుకోను"

"నువ్వు స్వార్థపరురాలివి" గట్టిగా అని బావురుమని ఏడ్చేశాను.

"నిజమే! కావచ్చు. నేనే కాదు. ఆసలు మనిషే స్వార్థపరజీవి. నా భర్త, నా బిడ్డలు అనుకోవడం విస్తరించుకొన్న స్వార్థం ... నేను నా 'ఆనందం' అనుకోవడం దాని కంటే తక్కువ స్వార్థం కాదా?''

"నాకు మీరు చేస్తున్నది అన్యాయం. ద్రోహం. దీనికి బాధ్యులు మీరే! నా జీవితానికి ఏమిటి దారి ? నేనెలా బ్రతకాలి?"

"అంటే రాజారావు నీకు ద్రోహం చేస్తున్నాడా"

"కాదు. అతను అమాయకుడు. అతని మీద నమ్మకం వుండబట్టే ఇంత దూరం వచ్చాను. నువ్వే అతన్ని వలలో వేసుకొని నాక్కాకుండా చేస్తు న్నావ్. దీనికి బాధ్యురాలివి నువ్వే" శక్తి కొద్దీ అరిచాను.

"దయచేసి అరవద్దని మరో సారి చెబుతున్నాను. మీక్కావలసిందేమిటి ?"

"నా భర్త"

"అది సాధ్యం కాదు. కావలిస్తే మీరు బ్రతకడానికి నెల నెలా కావలసి నంత డబ్బు ఇస్తాను. అది కూడా కేవలం మీ మీద జాలితో ... కాకపోతే నా ప్రియమైన రాజారావు ఒకప్పటి భార్యవని, అంతే గాని ... అది నా బాధ్యత కాదు."

"ఛీ ... నువ్వు మాట్లాడకు. అవ

హ్యామేస్తోంది. రాజారావును ఇలా పిలు నేనే తేల్చుకుంటాను"

"ఎందుకు. దీనికంతటికీ అతనే కారణమని నమ్ముతున్నారా?"

"కాదు దీని కంతకీ నువ్వే బాధ్యురాలివి. నువ్వు నంగనాచివి"

"అతను రావడం కుదరదు. వచ్చినా యింతకంటే అతను చెప్పేదేమీ వుండదు దీని కంతకీ బాధ్యురాలను నేను కాదు''

''మరెవరు ?''

''కమలాకరం''

''అదెలా!''

''అవును. దీనికంతకీ అతనే కారణం. దీనికి పూర్తి బాధ్యత ఆతనే వహించాలి. వెళ్ళి అతన్నడుగు ఇలా ఎందుకు జరిగిందో? నీ జీవితానికి దారేమిటో అతన్ని నిర్ణయించమను. అతను నన్ను సరిగ్గా చూస్తే నేను నీ భర్తకు దగ్గరయ్యేదాన్ని కాదు, నీకు ఈ పరిస్థితి వచ్చి వుండేదీ కాదు...వెళ్ళు. వెళ్ళి అతన్నే అడుగు ఏం చెబుతాడో"

"ఆయన్నెందుకు అడగాలి?"

"అది నీ ఇష్టం, నీకు సమాధానం చెప్పవలసినవాడు అతనే...నేను గాని, రాజారావుగాని కాదు"

"మరో పది నిమిషాల్లో నేను బయటకు వెళ్ళాలి" అంది ఆమె.

అంటే నన్ను వెళ్ళిపొమ్మని అర్థం... నిరాశగా నిట్టూర్పు వదిలి నిర్వికారంగా లేచి నిలబడ్డాను.

"విశాఖపట్టణంలో శ్రీకాంత్ ఆటోమోబైల్స్ జనరల్ మేనేజర్ కమలాకరం అంటే యెవరైనా చెబుతారు" ఆమె యెవరితోనో అంటున్నట్టు అంది. నేను సూట్ కేస్ చేతిలోకి తీసుకొని నెమ్మదిగా గుమ్మంవైపు అడుగులు వేశాను. పక్కనే వున్న గదిలోంచి యెవరిదో చిన్న దగ్గు వినిపించింది. వులిక్కిపడ్డాను. అదినాకు అత్యంత పరిచయమైన దగ్గు...అది...అది రాజారావుది. నేను రివ్వున వెనక్కి తిరిగాను. ఆమె చటుక్కున ఒక అడుగు ముందుకు వేసి నా భుజం పట్టుకొంది.

"అంటే! ఆయన లోపలే వున్నారా?" ఆమెను తీక్షణంగా చూస్తూ విదిలించుకోడానికి ప్రయత్నిస్తూ అన్నాను.

"అవును. లోపలే వున్నారు"...ఆమె నన్ను గట్టిగా పట్టుకొంది.

"ఇదిమోసం. నన్ను వెళ్ల నివ్వండి.." గింజుకున్నాను

"జయంతీ ! నీ మాటలన్నీ అతను విన్నాడు. అయినా బైటకు రాలేదేం? అదంతే ! వచ్చినా అతను చెప్పేదేమీ వుండదు"

"కాదు నేను ఆయనతో మాట్లాడాలి. నన్ను వదులు, నన్ను వదులు" నేను యేడుస్తూ అరిచినా ప్రయోజనం లేకపోయింది. లోపల్నించి రాజారావ్ రాలేదు. ఆమె నన్ను బలంగా గుమ్మం వరకూ తీసుకొచ్చి బయటకు నెట్టి తలుపులు మూసింది.



**4**

కరెంటు పోయింది.

గదంతా ఒక్కసారిగా చీకటయి

పోయింది. కమలాకరం ఒక్కసారిగా వాస్తవంలో కొచ్చి తలవిదిలించాడు. అంతా చీకటిగా వుంది.

ఆ చీకట్లో జయంతి వెక్కి వెక్కి యేడుస్తున్న చప్పుడు చిన్నగా విని పిస్తోంది. నిట్టూర్చాడు. తన అదృష్టం కొద్దీ కరెంటు పోయింది. లేకపోతే తన కళ్ళనుంచి రాలిన కన్నీళ్ళు చూసి ఆమె యేమనుకొనేది. తన కన్నీరు చూసిన రెండో వ్యక్తి యిప్పటి వరకూ లేరు. వుండకూడదు. చటుక్కున సోఫా అంచుమీద తడిమి భోజనం అయిన తరువాత అక్కడ వేసిన టర్కీటవ లందుకొని, మొహం తుడుచుకొన్నాడు.

అయిదు నిమిషాలయినా కరెంటు రాలేదు. జయంతి వెక్కిళ్ళు విన్పించ డంలేదు.

"జయంతీ! మీరు అక్కడే వుండండి" నెమ్మదిగా అని సోఫాలోంచి లేచాడు. చీకట్లో సోఫా అంచు పట్టుకొని తడుము కొంటూ వెళ్ళి మూలనున్న డ్రాయరు సొరుగు లాగి తడిమాడు. కొవ్వొత్తులూ, అగ్గిపెట్టె దొరికాయి. కొవ్వొత్తి వెలిగిం చాడు. చిన్న గాజు పళ్ళెం లాంటి దాంట్లో కొవ్వొత్తి ఫిక్స్ చేసి తీసుకొచ్చి, టీపాయ్ మీద పెట్టాడు. గదంతా వెలు గుతో నిండిపోయింది. కొవ్వొత్తి వెలు గులో జయంతి మొహం యెర్రగా విచ్చుకొన్న కలువలా వుంది.

ఆమె కళ్ళు కొద్దిగా వుబ్బినట్టు వున్నాయి.

వాచీ చూసుకొన్నాడు కమలాకరం.

"అంటే! ఆవిడ మిమ్మల్ని నామీదికి వుసిగొలిపిందన్న మాట" నెమ్మదిగా అన్నాడు. అతని గొంతు గంభీరంగా వుంది.

జయంతి తలపైకెత్తి అతని మొహం లోకి చూసింది. అతను తనవైపు సూటిగా చూస్తున్నాడు. తలదించుకొంది. నెమ్మ దిగా అంది.

"మీరేమనుకున్నా సరే నాకు యింత కంటే మరో మార్గం లేదు. ఆ యింటి మెట్లు దిగిన తర్వాత నేనేం చెయ్యాలో నాకు తెలుసు. నా భర్త నావాడు కాదని నాకు స్పష్టంగా తెలిసిపోయింది. ఆమె అతన్ని నాకు దక్కనివ్వదని ఖచ్చి తంగా ఋజువైపోయింది. ఇలాంటి పరి స్థితుల్లో నాలాంటి నిస్సహాయురాలు యేం ఆలోచిస్తుందో, యేం చెయ్యాలని ప్రయత్నిస్తుందో మీకు తెలుసా?"

"తెలుసు. ఆత్మహత్య" ఖచ్చితంగా అన్నాడు కమలాకరం.

జయంతి అదోలా నవ్వింది "సరిగ్గా చెప్పారు"

"మరయితే యెందుకు చేసుకోలేదు" కఠినంగా వుంది అతని తీరు.

"ధైర్యం లేకకాదు. అవసరం లేక. వాళ్ళ గురించి నేనెందుకు నా జీవితాన్ని నాశనం చేసుకోవాలో యెంత ఆలో చించినా అర్థం కాక"

"మీరు నా దగ్గరికి రావడంలో మీ వుద్దేశం?"

"నా జీవితానికి ఓదారి చూపెడ తారని"

"అంటే మీ భర్తను మీకు తిరిగి అప్పచెప్పనా!"

"కాదు. అదింక యెవరివల్లా కాదని నాకు అర్థమై పోయింది"

"మరి!"

"నేను బ్రతకడానికి దారి"

''మరి రాజ్యలక్ష్మి డబ్బిస్తానందిగా!''

''ఆత్మాభిమానం వున్నవాళ్ళెవరూ అలాంటి డబ్బు తీసుకోరు. ఆమె డబ్బు నా కవసరంలేదు''

''అంటే..అంటే...దీన్నిబట్టి'' కమలాకరం గొంతులో కోపం పరవళ్ళు తొక్కింది.

''మీరు...మీరు.. దీనికంతటికీ నేనే బాధ్యుణ్ణను కుంటున్నారా?'' చాలా తీక్షణంగా అడిగాడు. అతని మొహం కందగడ్డలా వుంది.

''మీరు కాదనగలరా '?'' సూటిగా అడుగుతున్న జయంతి ప్రశ్నకు కమలాకరం విపరీతంగా చలించినట్టు కదిలి సోఫాలోంచి లేచి నిలబడ్డాడు. తనను తాను నిగ్రహించు కోడానికి అన్నట్టుగా అటూ యిటూ పచార్లు చేయడం ప్రారంభించాడు.

జయంతి అతన్నే చూస్తోంది. చప్పున అతను ఆగి అన్నాడు.

''కాదని చెప్పి మిమ్మల్ని యెలా నమ్మించగలను. అసలు యేంచెప్పాలి. ఆ విషయన్ని అర్థమయ్యేలా చెప్పడం నాకు సాధ్యం కాదు."

"అర్థమయ్యేంత వివరంగా నాకు మీరు చెప్పనవసరంలేదు. నాకు బాధ్యత లేదని ఒక్క మాట మీరంటే వెళ్ళిపోతాను'' జయంతి సూటిగా అంది అతని వైపుచూస్తూ. అతను అడ్డుపడు తున్నట్టు అన్నాడు.

"నిజమే. ఆ ఒక్కమాట నేనంటే మీ వెళ్ళిపోతారు. నాకు తెలుసు. కాని యెలా వెళతారు? నేను అబద్ధ మాడుతున్నానసీ, నేను మీకు అన్యాయం చేశాననీ...కాకపోతే పరోక్షంగా నావల్ల మీకు అన్యాయం జరిగిందనీ... అనుకుంటూ వెళ్ళి పోతారు అవునా?''

"అలా యెందుకు అనుకోవాలి" ?

"మరో రకంగా అనుకొనే అవకాశం లేదుకాబట్టి ! నా గురించీ, నా జీవితం గురించీ మీకేమీ తెలియదు. రాజ్యలక్ష్మి మాటలు మీరు నమ్మారు."

"నమ్మకపోయినా నాకు వేరే దారి లేదు"

"కావచ్చు. కాని ఆవిడ మాటలు మీరు నమ్మారు. ఇందులో నా బాధ్యత వుందని, మీ అంతరాత్మ విశ్వసించబట్టే మీరు ధైర్యంగా నా దగ్గరకు రాగలిగారు"

జయంతి మాట్లాడలేదు.

"జయంతిగారూ! నేనో ప్రశ్న అడుగుతాను"

"అడగండి"

"మరోలా అనుకోకండి. ఇందులో రాజారావుగారికి యేమీ బాధ్యత లేదని మీరు నమ్ముతున్నారా?"

జయంతి ఒక్క క్షణం అతని వంక చూసి దృఢంగా చెప్పింది.

"మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను"

"ఎందుకని"

"నా భర్త గురించి నాకు బాగా తెలుసు."

కమలాకరం వేదనగా నవ్వాడు.

''ప్రతి భార్యా అలాగే అనుకొంటుంది, తన భర్త యెంతో మంచివాడని"

''మరి రాజ్యలక్ష్మిగారెందుకు అనుకోలేదు" చటుక్కున అంది.

''జయంతీ!" కమలాకరం బాధగా దెబ్బతిన్నట్టు అన్నాడు

''క్షమించండి మిమ్మల్ని బాధపెట్టాలని కాదు నా ఉద్దేశం. ఆయనతో నేను మూడేళ్ళు బ్రతికాను. ఆయన గురించి

నాకు తెలుసు. పూర్తిగాతెలియకపోయినా యెక్కువగా తెలుసు. మీకూ కూడా రాజ్యలక్ష్మిగారి గురించి తెలిసే వుండాలి. కాదంటూరా? పోనీ అలా ఆలోచించినా యిందులో ఆయన బాధ్యత యెంతుందో ఆలోచిస్తే మీకే అర్థమవుతుంది"

కమలాకరం సోఫాలో కూలబడ్డాడు. సోఫా అంచుమీద వెనక్కి తల వాల్చి కళ్ళు మూసుకొని ఏదో ఆలోచిస్తున్నట్టుగా వుండిపోయాడు చాలా సేపు.

లైట్లు వెలిగాయి.

అంత వెలుగును ఒక్కసారిగా చూడలేక కళ్ళు నులుముకొంది జయంతి. తెల్లని ఫ్లోరసెంట్ దీపం వెలుగులో, అంత సేపూ తెల్లగా వున్న కొవ్వొత్తి మంట యెర్రగా కనిపిస్తోంది రెపరెపలాడుతూ.

స్పీడందుకొన్న ఫ్యాన్ గాలికి ఆగలేక కొవ్వొత్తి ఆరిపోయింది. కమలాకరం సోఫాలో సర్దుకూర్చుని, గొంతు సవరించుకొన్నాడు.

''సరే నా దగ్గర్నించి మీక్కావలసిందేమిటి?''

''జయంతి తేలిగ్గా నిట్టూర్చింది"

"నాకేదయినా వుద్యోగమివ్వండి. నేను బ్రతగ్గలిగితే చాలు"

"ఉ ద్యో గ మా !" ఆశ్చర్యంగా అన్నాడు.

"అవును మీరు పెద్ద హోదాలో ఉన్నవారు. మీకిది సమస్యకాదు''

కమలాకరం చిన్నగా నవ్వాడు. "నాలాంటి వాళ్ళకిది సమస్య కాకపోవచ్చుకాని, నాకు మాత్రం సమస్యే! సరే, మీరేం చదువుకున్నారు?''

"యెస్సెల్సీ పాసయ్యాను"

"ప్ప్" పెదవి విరిచాడు కమలాకరం.

"టైపు, షార్ట్‌హేండ్ ఇలాంటివేవైనా వచ్చా?''

"టైపు వచ్చు. కాని పరీక్షలు పాసవలేదు. అంటే అసలు ఎప్పుడూ పరీక్షకు కూచోలేదు.''

తల అడ్డంగా ఆడించాడు.

"మీ కంపెనీలోనే ఏదయినా యివ్వొచ్చుగా" జయంతి అడిగింది.

"అలా ఎప్పుడుబడితే అప్పుడు ఉద్యోగాలివ్వడం కుదరదు. అయినా మీకున్న అర్హతలు మా కంపెనీలో పని చెయ్యడానికి సరిపోవు. మగవాళ్ళయితే ఏ టెక్నికల్ సెక్షన్‌లోనో అవకాశం వుంటుంది''

జయంతి నిట్టూర్చింది.

"పోనీ, మీకు తెలిసినవాళ్ళు చాలా మంది వుంటారుగా!"

కమలాకరం అదోరకంగా నవ్వాడు.

"చూడండి జయంతీ! నా పద్ధతి వేరు. రికమెండేషన్స్ నేనిష్టపడను. అవసరంకదా అని మా కంపెనీలో మీకు ఉద్యోగం యివ్వలేను. అలాగని మరొకళ్ళని నేను ఆబ్లిగేట్ చెయ్యలేను. పైగా మీ ఉద్యోగమనేది నా స్వంత విషయం" స్పష్టంగా చెప్పేశాడు.

జయంతి ఏం మాట్లాడలేదు. మౌనంగా కూర్చుంది.

చాలాసేపటి తర్వాత ఏదో నిర్ణయాని కొచ్చినట్టుగా అన్నాడు—

"సరే! పోనీ మీరిక్కడే వుండండి"

"ఇక్కడే అంటే" అర్థం కానట్టు అడిగింది.

"ఈ యింట్లో వుండండి".

"క్షమించండి. ఊరికే యిక్కడ





వుండడం నా అభిమతం కాదు".

"ఊరికే యెందుకు. మా సాగర్‌కి ట్యూషన్ చెప్పండి. వంటొస్తే ఆ వంట పనంతా సూపర్‌వైజ్ చెయ్యండి. ఇతరత్రా మీకేంవస్తే అది చెయ్యండి. మీ భోజనం వగైరాలన్నీ యిక్కడే. మీకు న్యాయమనిపించిన అంకె చెప్పండి జీతంగా యిచ్చేస్తాను. ఏమంటారు?"

జయంతి రెండు నిమిషాలు ఆలోచించుకొని చెప్పింది—

"సరే మీ యిష్టం".

కమలాకరం తేలిగ్గా నిట్టూర్చి అన్నాడు "ఆల్‌రైట్. హోటల్లో మీ సామానేమయినా వుంటే ఉదయమే తెప్పించేస్తాను. మీకేమయినా డబ్బు కావాలా?"

అక్కర్లేదన్నట్టుగా తల వూపింది.

"సరే. మీకింకొక విషయం చెప్పాలి".

"చెప్పండి"

"మీకిష్టమొచ్చినంత కాలం యిక్కడ వుండండి. ఈలోగా యెక్కడయినా మీకు సరిపడే ఉద్యోగావకాశాలుంటే తెలియజేస్తాను. అంతవరకు మాత్రమే నేను చేసేది. మిమ్మల్ని కొంత కాలంపాటు యిక్కడే వుంచడం యెందుకో తెలుసా?"

"చెప్పండి."

"నా ప్రవర్తన, నా జీవిత విధానం మీకు తెలుస్తాయి. నా స్వభావం మీకు అర్థమవుతుంది. అప్పుడు మీకే తెలుస్తుంది జరిగినదాంట్లో నా బాధ్యత ఎంతో."

జయంతి తల వూపింది. "కమలా

కరంగారూ! నేను మీ దగ్గరకు రావడంలో ఇంకో విషయం కూడా వుంది."

"ఏమిటది ?"

"ఈ ప్రపంచంలో నాకు తెలిసిన వాళ్ళెవరూ లేరు. పరోక్షంగా తెలిసినా, మీ కంటే యిప్పుడు నాకు పరిచయస్తు లెవరూ లేరు."

"సర్లెండి. మరి మీరు సాగర్ గదిలో పడుకోండి. చాలా రాత్రయింది, ఇప్పుడు హోటల్ కేం వెళతారు."

క్షణం సేపు ఆలోచించి తల వూపింది జయంతి.

"వెళ్ళండి" సోఫాలోంచి లేచి నిల బడ్డాడు. జయంతి కూడా లేచింది. చప్పున యేదో గుర్తొచ్చినట్టు అన్నాడు.

"ఆఁ అన్నట్టు ఒక్క విషయం" అని జయంతి మొహంలోకి చూస్తూ అన్నాడు "దయచేసి మీరెవరో, యెందుకిక్కడికి వచ్చారో యెట్టి పరిస్థితుల్లోనూ యెవరికీ తెలియనీకండి. అంతే!"

జయంతి తల వూపింది.

"గుడ్ నైట్"

"గుడ్ నైట్"

జయంతి సాగర్ గదిలోకి నడిచింది. ఆ పక్కగదే కమలాకరానిది. క్రింద చాప మీద రావయమ్మ నిద్రపోతోంది. సాగర్ డబుల్ కాట్ మీద చాలా ఖాళీ వుంది. అటూ యిటూ చూసి తలుపు గడియ పెట్టి, సాగర్ పక్కన పడు కొంది.

ఎక్కడో పన్నెండు కొట్టిన చప్పుడు.

జయంతికి నిద్ర రావడం లేదు. ఏవేవో అర్థం కాని ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. తెలతెల వారుతుం డగా మగతగా నిద్ర పడుతుండే, ఆ మగతను చీల్చుకొని వినిపించింది సాగర్ గొంతు.

"మీరు రాత్రి యిక్కడే వున్నారా?! రోజూ యిక్కడే వుంటారా ?" ఆనం దంగా తనను కుదుపుతూ అడుగు తున్నాడు.



## 5

రెండు నెలలు గడిచి పోయాయి.

తన జీవితం తలుచుకున్నప్పుడల్లా తనకే ఆశ్చర్యంగా వుంటుంది కమలా కరానికి ఏమిటి తన బ్రతుకు? బ్రతకడం తన విధి, తన కర్తవ్యం అనుకొని బ్రతగ్గలుగుతున్నాడు తప్పితే బ్రతక డానికేముంది. తన కెవరున్నారు, సాగర్ తప్ప. అతని గురించే బ్రతకాలా ? రాజ్యలక్ష్మి అన్నట్టు తను యింతకాలం జీవితాన్ని పెద్ద బాధ్యతగా తీసుకొని గడిపాడా? కమలాకరం వుస్సురని నిట్టూర్చి కుర్చీలో వెనక్కి జారగిల బడ్డాడు.

రాజ్యలక్ష్మి ...తన జీవితం నిండా మధురత్వం నింపుతుందని ఆశించిన ఆమె-పది జీవితాలకు సరిపడా విషాదం నింపింది. ఆమెకు తను యేం తక్కువ చేశాడు. ఆమెకేం లోటు. కావలసినంత డబ్బుంది. ఆమెను తను మనస్ఫూర్తిగా

ప్రేమించాడు మరి ఆవిడ తనను ప్రేమించిందా ? ఏమో! తనెప్పుడూ ఆ విషయమే ఆలోచించ లేదు. తనంటే ప్రేమ లేకపోయినా కనీసం యిష్టమైనా వుంటుందని నమ్మాడు. తన నమ్మకం భ్రమ అని తెలియజెప్పి, తన పరువు, ప్రతిష్టః మంటగలిపి, నిర్దాక్షిణ్యంగా వెళ్ళిపోయింది. కమలాకరం బాధగా నిట్టూర్చాడు.

తనను వదిలి వెళ్ళడం కన్నా సాగర్‌ను వదిలి వెళ్ళడం, తనకు అత్యంత బాధాకరంగానూ, ఆశ్చర్యంగా నూ కూడా వుంది. ఆ క్షణం వరకూ కూడా తెలియదు 'రాజ్యలక్ష్మి' అంత క్రూర మైనదని. కన్న కొడుకు మీద ప్రేమను కూడా వదులు కొనేంతగా తన మీద ద్వేషం పెంచుకొందన్నమాట. పైగా, జయంతిని తన మీదకు ఉసిగొలిపింది. 'జయంతి...జయంతి'...జయంతి అని గుర్తురాగానే కమలాకరానికి మనసు కాస్త రిలీఫ్‌గా అనిపించింది. ఆమె గుర్తొచ్చినప్పుడల్లా రిలీఫ్‌గానే కాదు, ఆశ్చర్యంగా కూడా వుంటుంది. ఆమె యెవరు?తనెవరు?? దాదాపు ఉత్తరదక్షిణ ధృవాల్లాటి వాళ్ళు. కలిసి వుండవలసిన స్థితి... జీవితం గొప్ప వింత. అంత అందమైన మనిషిని, మంచిదాన్ని రాజారావు యెలా వదులుకో గలిగాడో అర్థం కాదు. ఆవిడలో లేనిది రాజ్యలక్ష్మిలో అతనేం చూడగలిగాడు. పోనీ తనలో లేనిది అతనిలో ఏం చూడగలిగింది రాజ్యలక్ష్మి. ఇది యెన్నాళ్ళుగా ఆలోచిస్తున్నా జవాబు దొరకని ప్రశ్న. కాదు కాదు. రాజ్యలక్ష్మికి ప్రేమ, మమకారం కంటె శృంగారం ముఖ్యం. అవును ఆమె ఒక శృంగార పిపాసి. జీవితంలో ప్రతి కోణం నుంచీ శృంగారాన్ని మాత్రమే దర్శించడానికి ప్రయత్నించే మానసిక అస్వస్థురాలు. శృంగారం జీవితంలో ఒక ముఖ్యమైన భాగమని తను అంగీకరిస్తాడు. కాని, జీవితమంతా శృంగార మయమే అని రాజ్యలక్ష్మి నమ్మకం. ఈ విషయం మీద తనూ, రాజ్యలక్ష్మి నిరంతరం ఘర్షణ పడుతుండేవారు. ఒకోసారి తనకోపం అవధులు దాటబోయేది. తనకంటే తాటి ప్రమాణాన రెచ్చిపోయేది ఆమె. మన కున్న బాధ్యతల్ని విస్మరించకుండా జీవితాన్ని అనుభవించాలని తనంటే, జీవితాన్ని అనుభవించడానికి కొన్ని బాధ్యతల్ని విస్మరించి తీరాలనేది ఆమె.

ఆమెతో కలిసి తను గడిపిన జీవితంలోంచి యేవేవో సంఘటనలు, దృశ్యాలుగా కళ్ళ ముందు నిలుస్తున్నాయి. యెంత కాదనుకున్నా, వద్దనుకున్నా పదే పదే గుర్తుకొస్తున్నాయి. తనకు జయదేవుడి అష్టపదులంటే యిష్టం. వాటిని అత్యద్భుతంగా గానం చేసిన అమర గాయకుడు ఘంటసాలగారంటే మరీ యిష్టం. ఎప్పుడయినా తనకు ఖాళీ దొరికితే, మనసు భారంగా వుంటే, టేప్ రికార్డర్ మీద వాటిని వినడం పెద్ద రిలీఫ్. రాజ్యలక్ష్మికి కూడా అవంటే యిష్టమే, కాని ఆమె తనను హేళన చేసేది.

ఒకరోజు వెన్నెట్లో డాబా మీద ఈజీచైర్లో పడుకొని వింటున్నాడు.

'స్తన విని హితమపి హారముదారం
సామనుతే కృశ తనురివ భారం'

హాయిగా మధురంగా సాగుతోంది మనసు అట్టడగు పొరల్లో వుద్విగ్నతను

పైకి లాగుతూ, అంతలోనే యేదో తన్మయత్వానికి లోనుచేస్తోంది.

హఠాత్తుగా ఆగిపోయింది పాట.

చటుక్కున తల తిప్పి చూశాడు. రాజ్యలక్ష్మి నవ్వుతోంది. తెల్లటి చీర, జడ నిండా జడ మోయలేనన్ని మల్లె పూలు, ఘాటుగా పరిమళిస్తోంది ఆమె మీదినుంచి యేదో సెంటు వాసన.

ఫేము కుర్చీ దగ్గరకు లాక్కొని కూర్చుంది.

"నాకు ఒకోసారి ఆశ్చర్యంగా వుంటుంది" నవ్వుతూ అంది.

"దేనికి?" అర్థం కానట్టు అడిగాడు.

"జయదేవుడి అష్టపదులు మీకెలా యిష్టమయ్యాయా! అని"

"ఏం దాంట్లో ఆశ్చర్యమేముంది"

రాజ్యలక్ష్మి ఫక్కున నవ్వింది "అందులో వున్నదంతా పచ్చి శృంగారమే కదా!" మళ్ళీ నవ్వింది.

"శృంగారమా!"

ఆమె నవ్వుకు తనకు చిరాకు కలుగుతోంది.

"కాక మరేమిటి? వాటి అర్థం తెలియకుండానే వింటున్నారా మీరు. 'స్థన విని హితమపి హార ముదారం' అంటే... అంటే" అని కిలకిలా నవ్వేసింది,

"యెందుకానవ్వు" కోపంగా అడిగాడు.

"మీకు దాని అర్థం తెలుసా?" ఆమె గొంతులో నవ్వు ఛాయలు.

"తెలుసు. ప్రతి పదార్థ తాత్పర్యాలతో సహా తెలుసు"

"అరె! తెలిసే వింటున్నారా అంత శృంగారాన్ని"

"అందులో శృంగారం ఏముంది ? నాకేం కనిపించడంలేదు"

"నాకు మరోటి కనిపించడంలేదు"

తను లోపల్లోపలే నిట్టూర్చాడు ఆమె పద్ధతి తనకు తెలుసు.

"జయదేవుడి తాదాత్మిక భక్తిభావం తప్ప, అందులో ఏముంది?"

"అది శృంగారపరంగా తప్ప చెప్పడం కుదరదా?"

"అది ఆయన పద్ధతి, మరొకళ్ళది




మరో పద్ధతి. ఇలాగే యెందుకు చెప్పాలి అనడం తెలివితక్కువ తనం"

చురుగ్గా చూసింది రాజ్యలక్ష్మి.

"కాదు యీ శృంగార వర్ణనంతా జయదేవుడిలో అణచుకొన్న సెక్స్ వాంఛల ప్రతిరూపం."

"రాజీ!" కాస్త కోపంగానూ, బాధ గానూ అన్నాడు తను.

"నీ యిష్టమొచ్చినట్టు మాట్లాడకు. భాగవతంలో భగవంతుణ్ణే చూసేవాళ్ళు వున్నారు. పచ్చి శృంగారాన్ని చూసే వాళ్ళు వున్నారు. అది వాళ్ళ వాళ్ళ దృక్పథాన్ని బట్టి వుంటుంది. నాకిందులో భక్తి కనబడింది. అది నా దృక్పథం. నీకు సెక్స్ కనబడింది అది నీదృక్పథం.

"నేను చెప్పేది అది రాసిన వాళ్ళ స్వభావం గురించి...యీ కవులూ, రచయితలూ, వీళ్ళంతా ఒక రకం మానసిక రోగులు. తమ తీరని కోర్కెల్నీ, భయాల్నీ, అసమర్థతనూ తమ రచనలుగా అనువదించి తృప్తిపడుతుంటారు"

"రాజీ!" తనకు చాలా కోపం వచ్చింది. "వాళ్ళేకాదు నీలా ప్రతి దాంట్లోనూ శృంగారాన్ని వెదికే వాళ్ళు అంతే మానసిక రోగులు"

ఆమెను గాయపర్చాలన్న తన ప్రయత్నం విఫలమై పోయింది, సరిగదా ఆమె గట్టిగా నవ్వింది.

"నిజమే నేను అంగీకరిస్తాను. మనం పొందలేని వాటిమీద, అందుబాటులో లేని వాటిమీద, మనం నిరంతరం ఒక అభిమానాన్ని పెంచు కొంటాం. ప్రతి దాంట్లోనూ 'దాని ప్రతిరూపాన్ని చూడ్డానికి ప్రయత్నిస్తాం" అని నవ్వింది. "ఆ మేరకు మీ యీ జయదేవుడి అష్టపదులంటే మీకున్న యిష్టం, మనసులోవున్న సెక్స్ దాహాన్ని అణుచుకొని, ప్రతి క్షణం ఎక్కడ దొరికి పోతామోనని భయపడుతూ వుండే మీ మూర్ఖత్వమే."

"రాజీ!" కోపంగా అరిచాడు తను. ఆమె లెక్కచెయ్యలేదు. యింకా రెచ్చిపోయింది.

"యూ షటప్ గెటవుట్" అరిచాడు. ఆమె చరచరా వెళ్ళిపోయింది.

ఇలాంటి సంఘటనలు కోకొల్లలు. శృంగార పరంగా చూసినా ఆవిడను అతను నిరాశ పర్చాడా లేదు. తను ఆమెకు మనస్ఫూర్తిగా ప్రేమానురాగాలు అందించాలనే ప్రయత్నించాడు. కాని, ఆమె యేనాడూ అందుకోడానికి ప్రయత్నించలేదు. తొందరపాటు, వుద్రిక్తత తప్పితే, ఆమె యేనాడు తనను అర్థం చేసుకోడానికి ప్రయత్నించింది? ఆమెకు తనంటే అసలు లక్ష్యం లేదు.

ఆమె చేసిన పొరపాట్లు, తప్పులు, యెంతో సహనంతో తనుగాబట్టి క్షమించ గలిగేవాడు. తను యెంతో సహనంతో ఓపికతో అన్నీ సర్దుకు పోయేవాడు. లేకపోతే ఆమె చేసిన కొన్ని పొరపాట్లు యే మగాడయినా భరించగలడా? సాగర్ పుట్టిన కొత్తలో ఆమె పురిటికి వెళ్ళి ఆయిదో నెలలో తన యింటి కొచ్చిన వారం రోజుల తర్వాత ఒకరోజు రాత్రి సుమారు రెండు గంటలయి వుంటుంది. కొన్ని రహస్యమైన ఫైల్సు, యింటి దగ్గరే పరిశీలించడం అలవాటు తనకి. వాటి పనితో వొక్కోసారి చాలా రాత్రయిపోయేది. అలాంటి సమయాల్లో ఆమె ప్రదర్శించే అసహనం, నిర్లక్ష్యం, తనను యెంతో బాధపెట్టేవి.

సాగర్ మంచానికి దూరంగా వున్న

స్టాండ్ పుయ్యాల్లో నిద్ర పోతున్నాడు.

రాజ్యలక్ష్మి, మంచం మీద విసుక్కుంటూ అటూ యిటూ దొర్లడం తనకు వారగా కనిపిస్తోంది. తను లోలోపలే నవ్వుకొంటూ వీలయినంత తొందరగా పని ముగించుకొందామనుకుంటున్నాడు. ఆమె లేచివచ్చి తన దగ్గరగా నిలబడింది. మల్లెపూల పరిమళం తనను చుట్టు ముట్టింది. తను తల తిప్పకుండానే చకచకా ఫైలు తిరగేస్తున్నాడు.

"ఏమండీ!"

"ఊఁ"

"రండి పడుకుందాం"

తలతిప్పి చూశాడు తను. సమ్మోహనంగా నవ్విందామె. ఆమె కళ్ళు మత్తుగా బరువుగా వున్నాయి. 'అయిదు నెలల వియోగం. ఆమెను అలా చూస్తుంటే వెంటనే ఫైలు మూసెయ్యాలనిపించింది. కాని అర్జంటు ఫైలది.

"జస్ట్ ఫిఫ్టీన్ మినిట్స్ ప్లీజ్" బతిమాలు తున్నట్టు చిన్నగా నవ్వుతూ అన్నాడు.

"ఊఁహుఁ" గారంగా అంది. తన మీదనుంచి వంగి, టేబిల్ లైటు స్విచ్ ఆఫ్ చేసింది.

"ఏమిటిది రాజీ" ఫైలు అర్జంటన్న సంగతి తనను విడిచి పెట్టడం లేదు. ఏదో అనబోయాడు తను. ఆమె తన మెడచుట్టూ చేతులువేసి యింకా దగ్గరయింది. మాతృత్వంతో మరింత బరువెక్కిన ఆమె స్థనాలు తన చెంపలకు మత్తుగా వొరుసుకుంటున్నాయి. ఆమె నుంచి యేదో కమ్మని పరిమళం. తనలో రక్తం వేగంగా పరుగులుతీసి, మత్తెక్కినట్లయి చెంపల్ని అటూయిటూ రుద్దాడు. ఆమె నవ్వుతుంటే, తలపైకెత్తి చూశాడు. నీలం రంగు బెడ్ రూమ్ లైటు వెలుగులో ఆమె మొహం విచిత్రంగా వుంది. తన చేతులు అప్రయత్నంగా ఆమె నడుమును చుట్టి బిగించాయి. ఆమె తల వంచి తన కళ్ళను ముద్దు పెట్టుకొని, పెదవులతో తన చెంపల్ని మృదువుగా తడిమి, తన పెదాల్ని తడిచేసి అదుముతున్నట్టుగా నొక్కి పట్టింది. తనకు వెన్నెల్ని కౌగిట్లో బిగించి పట్టుకున్న అనుభూతి. ఆమె శ్వాస వెచ్చగా తన మొఖం అంతా పాకి యేదో నిర్వచించలేని సుఖం ఆమె కూడా నడిచి, యెప్పుడు మంచం మీదికి చేరుకున్నాడో కూడా తనకు తెలియదు. తన చేతులు ఆమె జాకెట్ హుక్స్ కోసం ఆమె వీపుమీద తడుముతుంటే కిలకిలా నవ్వింది.

"అవి అక్కడ వుండవు" చిలిపిగా అంది తన చేతుల్ని పట్టుకొని గుండెల మీద పెట్టుకొంటూ.

"ఇదేమిటి, కొత్త ఫాషన్" తనూ చిలిపిగా అడిగాడు.

"ఫాషన్ కాదు"

"మరి!"

"ముగ్గురయ్యాంగా అందుకు" ఆమె నవ్వింది. క్షణంతర్వాత అర్థమై తనూ నవ్వాడు.

"లైటు తీసెయ్యనా?"

"ఎందుకు"

"మీరు భరించలేరేమోనని" ఆమె మాటల్లో వ్యంగ్యం తనకర్థమైంది.

"ఎందుకు నువ్వు అలా మాట్లాడతావ్!"

"ఎలా మాట్లాడాను. ఉండండి లైటు తీసేస్తాను".

"వద్దు వుండనీ".

"ఎందుకు లెండి తీసేస్తాను" లేవ బోయింది.

"వద్దు. బెడ్‌రూమ్ లైటేగా. నాకివాళ యెందుకో పెద్దలైటు కూడా వేయాలని వుంది".

ఆమెను లేవకుండా బిగించి పట్టుకున్నాడు.

"ఎందుకు"

"నువ్వెన్ని కొత్త పంపులు సంతరించుకొన్నావో చూద్దామని. ఆమె బ్లౌజ్ మంచంమీది నుంచి కిందికి విసిరి, చీర కుచ్చెళ్ళమీద చెయ్యి వేశాడతను.

"యూ సిల్లీ. ఇవాళ మీ ప్రవర్తన ఆశ్చర్యకరం!"

రోజూ వెలుగంటే యిష్టపడే ఆమె యివాళెందుకు లైటు తీసేస్తానంటుందో ఆ క్షణంలో అర్థం కాలేదు.

మరో పావుగంటకు అర్థమయింది. ఏదో అనుమానమొచ్చి, ఆశ్చర్యమేసి చూపు అక్కడే నిలిపాడు.

"ఏమిటలా చూస్తున్నారు?"

"ఏమిటిది? ఇక్కడ... యింతకు ముందు..." సందిగ్ధంగా అంటూ ఆమె బొడ్డుకింద, పొత్తి కడుపుమీద నిలువుగా సన్నటి గీతలాగా పెన్సిల్తో గీసినట్టు నిలువు గీత, దానిమీద అడ్డంగా అప్పుడే మాసిపోతున్నట్టు కనిపించిన అడ్డగీతలు.

"ఓస్ అదా!" తేలిగ్గా నవ్వేసింది.

"ఇంతకుముందు లేదు" అనుమానంగా అన్నాడు.

"అవును" అంటూ మళ్ళీ నవ్వి తనను మీదకు లాక్కుంది. తనకు యేదో అనుమానమొచ్చి వులిక్కిపడ్డాడు.

"రాజీ యేమిటీ గీత" ఆమెను విడిపించుకొని కొద్దిగా పైకి లేచి అడిగాడు.

"ట్యూబెక్టమీ" చాలా తేలిగ్గా, సాధారణంగా చెప్పింది.

తనకు పిడుగు పడినట్టయింది.

"ఏమిటి నువ్వనేది" ఆశ్చర్యంగా అడిగాడు తను.

"ట్యూబెక్టమీ. పిల్లలు పుట్టకుండా ఆపరేషన్". లక్ష్యం లేనట్టు చెబుతున్న ఆమెను చూసి, తనలో కోపం కట్టలు తెంచుకొంది.

"అంటే! ఒక్కడితోనే....అసలు నువ్వు ఎవర్నడిగి చేయించుకున్నావ్?"

"ఒకర్నడిగి చేసేదేమిటి? పిల్లల్ని కనేది నేను".

"అసలు ఆ డాక్టరెలా చేసింది, నా అనుమతి లేకుండా!"

నవ్వింది. "ఒప్పించాను. ఒక్కడు చాలు నాకు. తొమ్మిది నెలలు మోయడం, తర్వాత ఆ బాధ, నరకం నేను భరించలేను". మాతృత్వాన్ని అంత అసహ్యంగా తీసుకుంటున్న ఆమెమీద ఆ క్షణంలో తనకు సానుభూతి నశించిపోయింది.

"నువ్వు....నువ్వు.... ప శు వ్వి". కోపంలో అంతకంటే యేమనాలో తెలియలేదు తనకి.

"మీ యిష్టం వచ్చినట్టు మాట్లాడకండి. మోసేవాళ్ళకు తెలుస్తుంది బాధ. మీలా దులుపుకొని లేచిపోవడం కాదు".

"ఛీ! నువు మాట్లాడకు, అసహ్యంగా వుంది" నిలువెల్లా ఆగ్రహంతో వణికిపోతూ అరిచి, మంచంమీదినుంచి కిందికి దిగి లుంగీ చుట్టబెట్టుకొని కుర్చీలో కూలబడ్డాడు తను. ఎంత ధైర్యం ఆమెకు. కనీసం తనతో చెప్పకుండా యెంతపని చేసింది.

దుప్పటి మీదకు లాక్కుని దిండులో తలదూర్చి యేడవడం మొదలుపెట్టింది.

ఆమెది అమాయకత్వమో, మూర్ఖత్వమో తనకు అర్థం కాలేదు. చివరకు తనకు తాను సర్దిచెప్పుకోవడం మినహా మరేం తోచలేదు. తెలతెలవారుతుండగా స్థిమితపడ్డాడుతను. ఆమెమీద యెందుకో యెక్కడో మిగిలిపోయిన జాలి పైకి లేచింది.

నెమ్మదిగా లేచివెళ్ళి ఆమె పక్కనే కూర్చొని, భుజం పట్టుకొని తనవైపు తిప్పుకున్నాడు. లాలనగా చూసి, ఆమె మీదికి వంగబోయాడు.

"ఛీ !" కసిరి కొట్టిందామె. తను నివ్వెరపోయాడు.

"నేను పశువును. నా దగ్గర పడుకొంటే మీరూ పశువే!"

ఆమెను యేమనాలో తెలియక మనసులోంచి ఆమె పట్ల పైకి లేస్తున్న అసహ్యాన్ని మాటల్లోకి అనువదించలేక లేచి నిలబడి మంచంకింద కుప్పగా పడివున్న చీరను ఆమెమీదికి విసిరాడు.

తలుపు చప్పుడయింది.

కమలాకరం ఆలోచనల సాగరం లోంచి ఒడ్డునపడ్డాడు.

ఓసారి తల విదిలించి చూశాడు. ట్రేలో టీ కప్పుతో...జయంతి చిన్నగా నవ్వింది.

"అరె! మీరు తెచ్చారేమిటి?" నొచ్చుకుంటున్నట్టు అన్నాడు.

"ఫరవాలేదు లెండి. ఈ వాళ రాపయమ్మకు, జ్వరం తగిలినట్టుంది. పడుకుంది. ఈ టైంకు మీరు మెలుకువగా వున్నారేమో చూసి, వుంటే టీ పెట్టి యిమ్మంది.

టీ కప్పు టేబిల్ మీద పెట్టింది.

"థాంక్యూ" అంటూ కప్పు అందుకొని "ఫ్లాస్కులో పోసి యిక్కడ పెట్టెయ్యవలసింది" అన్నాడు.

"ఫ్లాస్కు పని చెయ్యడం లేదు. చల్లారిపోతోంది".

"అరె...మరి చెప్పలేదేం. ఇప్పటి వరకూ ఇందుకే మెలుకువగా వున్నారా?"

అలారం టైంపీస్ వంక చూస్తూ అడిగాడు. 'పన్నెండున్నర.'

"లేదు లెండి. ఈ టైముపరకూ ఏదో వొకటి చదవడం నాకు అలవాటు".

కమలాకరం టీ తాగేసి, కప్పు టేబిల్ మీద పెట్టేసి, "సారీ ఫర్ ద ట్రబుల్" అన్నాడు నవ్వి.

"నెవర్ మైండ్, యిట్స్ మై డ్యూటీ" జయంతి నోట్లో ఆంగ్లం చాలా అందంగా వుంటుందనుకుంటాడు కమలాకరం. ఆమె కప్పు తీసుకొని వెళ్ళిపోబోతూ ఆగింది.

"ఆఁ ... మీరు యింకా ఎంతసేపు మెలుకువగా వుంటారు".

"ఏఁ...?"

"మరోసారి మీకు టీ యివ్వాలేమోనని."

"అప్పటి వరకూ మీరు మెలుకువగా వుంటారా ?" నవ్వుతూ అడిగాడు.

జయంతి తల వూపింది.

"నా మాట అలా వుంచండి. మీరింకా యెంత సేపు వుంటారు."

"మరో అరగంట వుండొచ్చు."

"రోజూ యింతేనా ?"

"అదెలా చెప్పగలను. అది నేను చదివే పుస్తకాన్ని బట్టి, దాని సైజుని




బట్టి వుంటుంది." తమాషాగా చెప్పింది.

"అలాగా! యింతకీ యిప్పుడేం చదువుతున్నారు?"

"జాక్ లండన్ నవల ఐరన్‌వీల్స్"

"వాట్!" కమలాకరం ఆశ్చర్యపోయాడు.

"ఏం ?" అంది జయంతి.

"మీకు...మీకు అది అర్థమవుతుందా?!"

జయంతి నవ్వింది. "నాకు ఇంగ్లీషు బాగానే వచ్చని నా నమ్మకం."

"మీరు చదివింది యెస్సెల్సీ అన్నారు!"

"అవును. అయితే మనం పెంచుకొనే ఆసక్తినిబట్టి ఒక విషయం మనకు రావడం వుంటుంది గాని డిగ్రీల మీద కాదు."

"ఐసీ."

"సరి. నా మాటకేం గాని మీరు రోజూ రాత్రిళ్ళు యిలా యెంతసేపు మేలుకొని వుంటారు?"

"అదెలా చెప్పగలను. అది నేను చేసే పనిమీద, చూసే ఫైలుమీద ఆధారపడి వుంటుంది" నవ్వుతూ అన్నాడు.

"ఓహో! ఈ అలవాటు మీకు చాలా కాలంనుంచీ వుందా ?"

"గత పదేళ్ళుగా" గర్వంగా చెప్పాడు కమలాకరం.

జయంతి అలాగా అన్నట్టు తల వూపింది.

"మరోసారి మీకు టీ అవసరముంటుందా ?"

"అవసరం లేదు."

"గుడ్‌నైట్"

"గుడ్‌నైట్."

నెమ్మదిగా ఏదో ఆలోచిస్తూ బయటకు నడిచింది జయంతి.

'ఈ అలవాటు మీకు చాలాకాలం నుంచి వుందా ?' జయంతి వేసిన ఈ ప్రశ్న కమలాకరంలో చాలా ఆలోచనల్ని లేవదీసింది. చెవులో గీ పెడుతూ తిరిగే జోరీగలాగ ఆ ప్రశ్న తన చుట్టూ పరిభ్రమిస్తున్నట్టు ఫీలయ్యాడు కమలాకరం.



## 6

జయంతికి మొదట్లో తన వునికి తనకే ఆశ్చర్యంగా వుండేది. అప్పుడప్పుడూ-తనేమిటి? ఈ యింట్లో వుండటమేమిటి? ఒక్కోసారి అసలు అర్థం కానట్టు, మరోసారి నమ్మలేనట్టు వుండేది. ఈ రెండు నెలల్లోనూ బాగా అలవాటయి పోయింది. తనకిప్పుడు కొత్తగా లేదు. సాగర్ తను లేకపోతే క్షణం సేపు వుండలేడు. మేడమ్... మేడమ్ అంటూ తనచుట్టూ తిరుగుతాడు. రావమ్మ కూడా తనంటే చాలా గౌరవం ప్రదర్శిస్తోంది. తనెవరని గాని, తన వివరాల గురించి గాని ఆమె ఎప్పుడూ ప్రశ్నించదు. అయితే ఎప్పుడో ఒకప్పుడు ఆమె నుంచి ఆ ప్రశ్న వస్తుందని తనకు తెలుసు. ఒకవేళ ఆమె ప్రశ్నిస్తే ఏం చెప్పాలో తనెప్పుడూ ఆలోచించలేదు. రావమ్మ మితభాషిత్వం- కూడా తనకు హాయిగా వుంది. కమలాకరం తన పట్ల చాలా గౌరవంగా ప్రవర్తిస్తున్నాడు.

ఈ రెండు నెలల్లోనూ తనకు చాలా విషయాలు అర్థమయ్యాయి. అందులో మొదటిది, కమలాకరం తన వుద్యోగ బాధ్యతల్ని ప్రాణం కంటె ఎక్కువ గౌరవిస్తాడని. ఈ కారణంగానే అతను రాజ్యలక్ష్మిని కొంత నిర్లక్ష్యం చేసి వుండొచ్చని తోచింది. కాని ఈ మాత్రం దానికే రాజ్యలక్ష్మి అంత విసిగి పోయిందా? ఆమెను గురించి రావమ్మను అడుగుదామంటే తనకు చొరవ చాలడంలేదు. రావమ్మ తన గురించి ఏమీ అడగనట్టే రాజ్యలక్ష్మి గురించి గాని, ఆ కుటుంబ విషయాలుగాని ఏమీ చెప్పలేదు. ఆమె వల్ల తనకు తెలిసిన విషయాలు చాలా తక్కువ అందులో ముఖ్యమైన విశేషం వీధివైపు వుండే గదిలో రాజారావు అద్దెకు వుండే వాడనీ, అతను వెళ్ళి పోయిన తర్వాత ఆ గది తాళాలు యెప్పుడూ తియ్యలేదనీ మాత్రమే... ఈ రెండు నెలల్లోనూ తన జీతం కింద ఆరువందలు బాంక్‌లోవేసి పాస్‌బుక్ తన చేతి కిచ్చాడు కమలాకరం.

సాగర్‌ను పొద్దుటే కాన్వెంటుకు పంపించడం తరువాత సాయంత్రం వరకూ యేవో పుస్తకాలు చదువు కోవడం, సాయంత్రం సాగర్ వచ్చినతర్వాత అతనికి కాసేపు పాఠాలు చెప్పడం యిదే దాదాపు దినచర్య. మధ్యలో యే ఆదివారమో సాగర్‌తో కలిసి బీచ్‌కి వెళ్ళడం అంతే. తన గురించి, రకరకాల మాగజైన్స్, నవలలు కమలాకరం శ్రద్ధగా తేవడం జయంతికి ఆశ్చర్యంగా అనిపించేది. తను యింటిపట్ల కూడా చాలా బాధ్యతగల మనిషినని తనకు తెలియ జెప్పడం కోసం అలా ప్రవర్తిస్తున్నాడేమో అని కూడా అనిపించింది. రోజులు యథాలాపంగా గడిచి పోతున్నాయి. రాజారావ్ స్మృతులే జయంతికి అత్యంత బాధాకరంగా వుండేవి. తన జీవితం యిలా అయిపోతుందని కలలో కూడా అనుకోలేదు. రాజారావుకి తను యిక్కడున్నట్టు తెలియదు. తెలిసే అవకాశం లేదు. ఊహించగలడా? లేదు. ఒకవేళ తెలిస్తే యేమనుకుంటాడు? మరోలా...యీ వూహ వచ్చినప్పుడు జయంతికి యేదో భయంగా వుండేది. అంతలోనే యేదో తిరుగుబాటు ధోరణి వచ్చేది మనసులోకి. తను అతను చేసిం దానికంటే తప్పేమీ చెయ్యడం లేదు అంతే అని సరిపెట్టుకొనేది. ఈ మధ్య తన మనసులోంచి రాజారావ్ పట్ల సానుభూతి, క్రమంగా నశించి పోతున్నట్టు గ్రహించి ఆశ్చర్య పడింది జయంతి.

వంట గదిలోంచి రావమ్మ చేస్తున్న చప్పుళ్ళు వినిపిస్తున్నాయి. కమలాకరం తొమ్మిదింటి కల్లా భోజనం చేసి ఆఫీసుకెళ్ళి పోతాడు. మధ్యాహ్నం టిఫిన్ పంపించాలి. జయంతి మాత్రం దాదాపు పన్నెండయితేనే గాని భోజనం చెయ్యదు.

హాల్లో ఫోన్ మోగింది. ఆ యింట్లో ప్రతి గదికో ఫోన్ కనెక్షన్ ప్లగ్స్ వున్నాయి. అవసరాన్నిబట్టి ఫోన్ యొక్క స్థానం మారుతూ వుంటుంది. చదువుతున్న పుస్తకం పక్కన పెట్టి ఫోన్‌వైపు చూసింది, యెత్తాలా వద్దా అన్నట్టు. ఎందుకంటే తను ఫోన్‌కాల్స్ రిసీవ్ చేసుకోవడం వల్ల చాలా సమస్యలు తోచాయి. కమలాకరం సలహా




మేరకు కూడా తనాపని చేయడం లేదు.

రావఁయ్యమ్మను పిలిచింది పలకలేదు.

మళ్ళీ పిలిచింది పలకలేదు.

ఫోన్ విడవకుండా రొదపెడుతోంది.

చివరకు విసుగ్గాలేచి ఫోనందుకొంది.

"హలో! ఎవరూ!"? అవతలివైపు నుంచి యెవరిదో మగగొంతు. జయంతి రిసీవర్ చెవికానించుకొని నిశ్శబ్దంగా నిలబడింది.

"హలో కమలాకరం యిల్లేనా?"

"అవును" నెమ్మదిగా చెప్పింది.

"నువ్వెవరు?" అవతలినుంచి ప్రశ్న. ఒళ్ళు మండింది జయంతికి.

"మీకేం కావాలి" కటువుగా అడిగింది.

"కమలాకరం లేదా?"

"ఆఫీసు కెళ్ళిపోయారు యిప్పుడే"

"ఓహో అలాగా! ఇంతకీ నువ్వెవరు?" ఆసక్తిగా అడుగుతున్నాడు.

"రావఁయమ్మను. ఈ యింట్లో పని మనిషిని" చిరాగ్గా చెప్పి ఫోన్ పెట్టేసి యిటు తిరిగేప్పటికి రావఁయమ్మనవ్వుతూ తన వంక చూస్తోంది.

"ఎక్కడికెళ్ళావ్? నీ గురించి అరిచి అరిచి నేనే యెత్తాను"

"ఇంతకీ యెవరమ్మా? యెక్కణ్ణించి"?

"ఏమో కమలాకరం వున్నాడా! అని అడిగాడు చెప్పాను. నువ్వెవరు నువ్వెవరు అని పీక్కుతింటున్నాడు" విసుగ్గా అంది.

రావఁయమ్మ నవ్వుకొనిఅంది "అయితే తాతారావుగారే అయ్యుంటారు"

"ఆయనెవరు?"

"ఆయనాకంపెనీలో మనిషే"

అలాగా అన్నట్టు అనాసక్తంగా తలవూపి పుస్తకం చేతుల్లోకి తీసుకొంది. రెండు నిమిషాలు గడిచినా రావఁయ్యమ్మ అక్కడే నిలబడడం చూసి ఆశ్చర్యంగా తలెత్తింది. తనతో ఏదో చెప్పడానికి సంశయిస్తున్నట్టుగా కనబడింది.

"ఏమిటి ఏమైనా నాతో చెప్పాలా?"

"అవునమ్మా నేను మా వూరెళ్తున్నాను. రేపు పొద్దుటే వచ్చేస్తాను"

"అయితే నాతో చెప్పడం దేనికి! అయ్యగారితో చెప్పావా?"

"చెప్పానమ్మా మీకు చెప్పమన్నారు"

"నాకా దేనికి?" ఆశ్చర్యంగా అడిగింది.

"ఏమీ లేదు ఈ వేళ, రేపూ మీరు కాస్త వంటపని చూడాలి."

జయంతి గట్టిగా నవ్వింది.

"ఓస్ ఈ మాత్రందానికే యెందుకంత సంశయిస్తావ్? రోజూ నువ్వింత కష్టపడుతున్నావ్ ఒక్కరోజు నేనెందుకు చెయ్యలేను" రావఁయమ్మ కళ్ళు కృతజ్ఞతగా మెరిశాయి.

ఆ తర్వాత మరో అరగంటలో రావఁయమ్మ వెళ్ళింది.

* * *

"మీ వంట చాలా బావుంది. గుత్తి వంకాయ కూరంటే నాకు చాలా యిష్టం" అభినందనగా అన్నాడు కమలాకరం. అన్నం కలుపుకొంటూ పక్కనే వున్న సాగర్ కూడా నవ్వుతున్నాడు.

"కూర చాలా బావుంది డాడీ" వడియాలు, కోడిగుడ్డు కలిపి వండిన కూర చూపిస్తూ అన్నాడు.

"అలాగా! ఏదీ కాస్త వెయ్యి చూద్దాం" తమాషాగా అన్నాడు.

జయంతి నవ్వుతూ చూస్తోంది. సాగర్ స్పూన్‌తో డిష్‌లో వున్న కూర కమలా కరం ప్లేట్‌లో వడ్డించాడు. కమలాకరం రుచి చూసి "వెరీగుడ్ చాలా బావుంది" అన్నాడు. "మేడమ్ పాఠాలేకాదు వంట కూడా బాగా చేస్తారు" సాగర్ మాటలకు యిద్దరూ నవ్వేశారు.

"మీ కాంప్లిమెంట్సు అన్నీ నాకే కాదు. వంట సాగర్, నేనూ కలిసేచేశాం అతనిక్కూడా చెందాలి."

"ఈజిట్ !" సాగర్‌వైపు ఆశ్చ ర్యంగా చూశాడు.

"యస్ డాడీ! మేడమ్ అవీ యివీ అడుగుతుంటే, నేనొక్కొక్కటే అందిం దాను."

"వెరీగుడ్" అన్నాడు కమలాకరం.

"థాంక్యూ" సాగర్ అన్నాడు.

"ఆఁ అన్నట్టు మీరు భోజనం చేసే శారా?" కమలాకరం అడిగాడు.

"లేదు" సాగర్ చప్పున సమాధాన మిచ్చాడు.

"అరె... మరింకెప్పుడు!"

"ఫరవాలేదు నేను తరవాత చేస్తాను లెండి"

"నో, నో... తరవాతెప్పుడు, ఇప్పటికే లేటయిపోయింది. కూచోండి, కూచోండి"

"కూచోండి మేడమ్! సరదాగా తినేద్దాం".

జయంతికి కూచోక తప్పలేదు. అన్నం వడ్డించుకొంటుంటే, సాగర్ ఆమెవైపు తదేకంగా చూస్తున్నాడు. అతని కళ్ళల్లో కనబడుతున్న ఆనందం చూసి కమలాకరం తృప్తిగా నిట్టూ





ర్చాడు. జయంతిపట్ల యెందుకో ఆ క్షణంలో యేదో కృతజ్ఞతాభావం కలిగింది.

జయంతి వంకాయకూర కలిపి నోట్లో పెట్టుకున్న తర్వాత కమలాకరం అడిగాడు—

"ఎలా వుంది....చాలా బావుంది కదూ!"

జయంతి నవ్వుతూ అంది "మీరు పొగిడారన్న సంగతి అర్థమైపోయింది".

కమలాకరం నవ్వేశాడు.

"ష్...భోజనం చేసేటప్పుడు నవ్వకూడదు". పెద్ద ఆరిందాలా చెబుతున్న సాగర్‌వైపు ఆశ్చర్యంగా చూశారు ఇద్దరూ.

* * *

"రోజూ అంత కంపల్సరీగా చెయ్యవలసిన ఆఫీసు పనేముంటుంది మీకు" ఫ్లాస్క్ టీపాయ్‌మీద పెడుతూ అంది జయంతి.

కమలాకరం నవ్వాడు.

"రాత్రి అంతసేపు మెలుకువగా వుండి మళ్ళీ పొద్దుటే లేచిపోతారే! ఆరోగ్యం పాడవదూ ?" మందలిస్తున్నట్టుగా అంటున్న జయంతిని చూస్తుంటే చప్పున రాజ్యలక్ష్మి గుర్తొచ్చింది.తను తొందరగా నిద్రపోవడం లేదని విసుక్కోవడం తప్పితే యేనాడైనా తన ఆరోగ్యం గురించి ఈ మాత్రమైనా ప్రశ్నించిందా? చప్పున పొరపాటు పడినట్టు వులిక్కిపడ్డాడు. తనేమిటి యిలా ఆలోచిస్తున్నాడు. ఈమధ్య తన మనసు యెందుకు రాజ్యలక్ష్మిని, జయంతిని పోల్చి చూస్తోంది. ఛ...ఛ.

"మీకిప్పుడేమైనా పనుందా?"

"పనేముంది. ఏ నవలో చదువుకోడమే" జయంతి అంది.

"అయితే కాస్సేపు అలా కూర్చోండి చెబుతాను".

"ఏమిటి?"

"ఇప్పుడు మీరడిగిన ప్రశ్నకు సమాధానం".

జయంతి టేబిల్‌కు మరోపక్కనున్న కుర్చీ లాక్కుని కూర్చుంది. కమలాకరం చేతిలో వున్న బాల్ పాయింటు పెన్, టేబిల్‌మీద పెట్టి కుర్చీలో సరిగా కూర్చున్నాడు.

"చూడండి జయంతిగారూ! మా కంపెనీ - మోటారు వాహనాలకు పనికివచ్చే కొన్ని ముఖ్యమైన స్పేర్‌పార్ట్సని ఉత్పత్తి చేస్తుంది. వాటికి దేశమంతా మంచి పేరుంది. చాలా డిమాండ్ వుంది. విదేశాల్లో కూడా చాలా పేరుబడ్డాయి. అలా పేరు బడటానిక్కారణం, సరుకు నాణ్యత ఒక్కటే కారణం కాదు. మేము బిజినెస్ చేసే విధానం అతి ముఖ్యమైనదీ, అసలైనదీ కూడా. దేశంనిండా మా కంపెనీల్లాంటివి చాలా వున్నాయి. వాటి పోటీని మేం తట్టుకోవాలి. అవి నిరంతరం మమ్మల్ని, మా బిజినెస్‌ను పడగొట్టడానికి ప్రయత్నిస్తాయి. అది తప్పుకాదు. వ్యాపార ముఖ్య లక్షణం అదేకదా! ఇన్నిటినీ తట్టుకొని మేం మా బిజినెస్ పడిపోకుండా చూడాలి. అంచేత అసలు మా బిజినెస్ మోటివ్ యేమిటో, యే దేశానికి యెంత యెప్పుడు యెలా యే రేటుకు యెగుమతి చేస్తున్నామో, వాళ్ళ మధ్య, మనమధ్య టరమ్స్ యేమిటో, మిగతా వాళ్ళకు అర్థమవకూడదు. అందుకే కొన్ని విషయాల్ని అత్యంత రహస్యంగా నేనే చూస్తుంటాను. ఇది



కూడా ఆఫీసులో యేదో క్లర్కుకు అప్పజెప్పవచ్చు. కానీ అది ప్రమాదం. అందుకే ప్రతి ఉత్తరాన్నీ నేనే స్వయంగా చదివి, సమాధానం రాసి, టైపుచేసి పంపిస్తుంటాను. అర్థమయిందను కుంటాను".

కమలాకరం ఆగి వూపిరి తీసుకొన్నాడు. జయంతి అర్థమైందన్నట్టుగా తల వూపింది.

"నేను కూడా అతి ముఖ్యమైన పని మాత్రమే చూస్తాను. అలా చూసినా అది యింతవుతోంది. ఏం చెయ్యనుమరి... కంపెనీ క్షేమం ముఖ్యంగదా!"

జయంతికి అతను చెబుతున్నది సబబుగానే కనిపించింది. 'కానీ యేం చెయ్యాలి' మెరుపులాగా ఒక ఆలోచన వచ్చింది.

"పోనీ....నేను మీకు సహాయం చెయ్యనా! మీకు అభ్యంతరం లేకపోతే" అతని మొహంలోకి చూస్తూ అడిగింది.

"మీరా !... మీరేం చెయ్యగలరు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"మీ సమాధానాలన్నీ టైప్ చేసి పెడతాను. మీకు సగం పని తగ్గుతుంది గదా! అంతేకాదు నాలుగురోజులు అలవాటయితే, మీరు పాయింట్లు చెబితే నేనే స్వయంగా సమాధానాలు రాస్తాను".

"మీరు టైపు చేస్తారా?" నసిగాడు.

"ఏం. చెయ్యలేననా! పరీక్షలకంటే వెళ్ళలేదుగాని బాగానే చెయ్యగలను" అని ఆగి, యేదో అర్థమైనట్టుగా అంది "ఓహో! సారీ!..సారీ...నన్ను నమ్మటం ఎలాగని ఆలోచిస్తున్నారా ?"

"అబ్బెబ్బె...అదేం కాదు" కంగారు పడ్డాడు.

"మరి?" అని ప్రశ్నార్థకంగా చూసి, "ఓహో!... నా క్వాలిఫికేషన్సు సరిపడవనా? ఇది మీ ఆఫీసు కాదుకదా! జస్ట్ మీ పర్సనల్ అసిస్టెంటుగా అనుకోండి. మీ ప్రిన్సిపుల్స్‌కేం భంగం రాదు. ఇంట్లోనేగదా!"

కమలాకరం నవ్వి, ఫైల్లోంచి ఒక కాగితం తీసి ఆమె చేతికిచ్చాడు.

"అది చదివి అర్థం చెప్పండి"

జయంతి ఓసారి కాగితాన్ని పరిశీలించి రెండు నిమిషాల్లో చకచక చదివి క్లుప్తంగా దాని అర్థం చెప్పింది.

కమలాకరం ఆశ్చర్యపోయాడు.

"బాప్‌రే... మీకింత ఇంగ్లీషెలా వచ్చు!"

జయంతి నవ్వింది.

కమలాకరం నాలుగయిదు సూచనలు చేసి, కొన్ని వివరించి

"ఇప్పుడు నేను చెప్పిన విషయాలతో, దీనికి సమాధానం రాసి చూపించగలరా !" అన్నాడు.

"ప్రయత్నిస్తాను. మీకు నచ్చుతుందో లేదో!"

కమలాకరం తెల్లకాగితం, పెన్, ఆమెముందుకు తోశాడు. జయంతి తనలో తను యేదో మననం చేసుకుంటున్నట్టుగా మొదట యిచ్చిన కాగితంలో మేటర్ చదువుకొని, పావుగంటలో దానికి సమాధానం తయారుచేసి యిచ్చింది. కమలాకరం చదివి, ఆశ్చర్యంగా చూశాడు.

"బావుంది... మీ రాత కూడా చాలా బావుంద" అభినందనగా అన్నాడు. జయంతి చిన్నగా నవ్వింది.

"దీన్ని టైపు చెయ్యండి. రెండు




కాపీలు" అంటూ షెల్ఫు తెరిచి, పోర్టబుల్ టైపురైటర్ తీసి, జయంతి ముందు పెట్టాడు.

బాగా అలవాటు వున్నదానిలా, తెల్ల కాగితాలు,కార్బన్ పేపరు, టైప్‌రైటర్‌లో బిగించి, టైపు చేస్తుంటే ఆమె వంక ఆశ్చర్యంగా చూస్తుండి పోయాడు... టైపురైటర్ కీ బోర్డు మీద ఆమె వేళ్ళు ఆశ్చర్యకరమైన వేగంతో కదలడం ఇంకా ఆశ్చర్యాన్ని కలగజేసింది అతనికి. పది నిమిషాల తర్వాత కాగితాలు తీసి అతని చేతికిచ్చింది.

చకచకా వాటిని పరిశీలించి తృప్తిగా నిట్టూర్చాడు.

తరువాత మరో కాగితం.

తరవాత మరోటి...

కమలాకరం రాసి ఇస్తుంటే,జయంతి చకచకా టైపు చేసేసింది.

మరోగంటసేపు మౌనంగా అలా సాగిపోయింది

"వెరీ గుడ్... యింక ఇవాళ చెయ్యవలసిన పనేమీలేదు" ఆఖరుగా ఆమె టైపు చేసిన కాగితాలు పరిశీలించి ఫైల్లో పెట్టి ఫైలు మూసేస్తూ అన్నాడు.

"మీకు నిజంగా చాలా థాంక్స్... లేకపోతే యీ పని నాకు మరో రెండు గంటలు పట్టివుండేది"

"నేనే చెప్పాలి మీకు థాంక్స్"

"ఎందుకు?"

"ఊరికే తిని కూర్చోవడంగా అనిపిస్తోంది నాకు యిన్నాళ్ళూ. ఈ వేళ ఈ పని చేసినందుకు నాకు చాలా తృప్తిగా వుంది. మరింక నన్ను అపాయింటు చేసుకున్నట్టే గదా'' నవ్వింది.

"ఎపాయింట్‌మెంటా ?"

"కంగారు పడకండి మీ ఆఫీసులో కాదు యిక్కడ యింటి దగ్గర"

"ష్యూర్! ఎప్పాయింటెడ్!'' కమలాకరం నవ్వాడు

టైప్‌రైటర్ తీసి షెల్ఫ్‌లో పెట్టేశాడు.

జయంతిలేచి నిలబడింది వెళ్ళానన్నట్టు "మీకో విషయం చెప్పాలనిపిస్తోంది"

"ఏమిటది ?"

"రాజ్యలక్ష్మి సంగతి"

జయంతి ఆశ్చర్యంగా చూసింది... ఆమె పేరెత్తితేనే మండిపోయే ఇతను స్వయంగా తనే ఆ విషయం చెబుతానంటున్నాడు. తిరిగి కుర్చీలో కూర్చుని ఆసక్తిగా చూసింది చెప్పమన్నట్టు.

కమలాకరం నిట్టూర్చాడు.

"నేను రోజూ యిలా యింత కష్టపడి పనిచేస్తుంటే ఏనాడూ ఆమె నామీద సానుభూతి చూ[redacted]లేదు. పైగా విసుక్కునేది. అంతేగాని, ఒక్కరోజు కూడా సాయం చెయ్యడానికి మీలా ప్రయత్నించలేదు".

ఎందుకు ఆ విషయం చెబుతున్నాడో జయంతికి సరిగా అర్థంకాలేదు. ఆదే అడిగింది.

"ఈ విషయం ఎందుకు చెబుతున్నట్టు మీరు ?"

"గడిచిన మా సంసార జీవితంలో ఆమె పాత్ర మీకు అర్థమవుతుందని"

"నేనో విషయం చెప్పనా?" జయంతి అంది.

"చెప్పండి"

"రాజారావుగారు మీలాగే ఆఫీసు పని యింటి దగ్గరే చేసుకొనే వారు అప్పుడే ఆయన తీసుకొచ్చే టైపుమిషన్ మీదే నేర్చుకున్నాను టైపు చెయ్యడం..

ఎందుకో తెలుసా ? నాకు ఆసక్తి వుండి కాదు... ఆయనకు సాయంచేద్దామని. అలాగే చేసేదాన్ని. కష్టపడి, నిద్రమాని కొని చేసేదాన్ని ఆయినా ఏమిటి ప్రయోజనం!"

కమలాకరం తెల్లబోయాడు.

**జయంతి లేచి నిలబడింది.**



# 7

మరో నెల గడిచింది...

జయంతికి యిప్పుడు తృప్తిగా అనిపిస్తోంది. ఊరికే అనాయాసంగా తిని కూర్చుంటున్నట్టు వుండటంలేదు. కమలాకరానికి తను అంతో యింతో సాయపడగలగటం ఆనందంగా వుంది. కమలాకరం కూడా జయంతి పట్ల చాలా సంతృప్తి ఫీలయ్యాడు. ఆమెను తన యింట్లో వుంచుకోవడంవల్ల ఏ సమస్యలు తలెత్తుతాయో అని మొదట్లో భయపడినా తరువాత తను చేసిన పని మంచిదేనని తృప్తిపడ్డాడు. కమలాకరానికి కూడా ఈ మధ్య తన పని బరువు తగ్గినందుకు ఆనందంగా వుంది. అర్జంటయితే యింటికి ఫోన్ చేసి ఫలానా ఫైల్లో కాగితానికి, ఫలానా నోటేషన్‌తో మేటర్ టైప్‌చేసి, మధ్యాహ్నం టిఫిన్‌తోపాటు ఆఫీసుకి పంపించెయ్యమని చెబితేచాలు, జయంతి చేసేస్తోంది. అంతలా జయంతి మీద ఆధారపడడానికి అలవాటు పడిపోయాడు కమలాకరం. ఎక్కువగా మాట్లాడుకోవడ రాత్రిళ్ళే...

ఈ మధ్య జయంతికి ఒక విషయం మీద కుతూహలం బాగా ఎక్కువైంది. అది యింతకు ముందు రాజారావు అద్దెకున్న గది మీద. దాని తాళాలు కమలాకరం దగ్గరే వున్నాయని చెప్పింది రాఘవయ్యమ్మ. అడిగితే ఏమనుకుంటాడు ఫరవాలేదు అడుగుదామనే నిశ్చయించుకొంది ఒకనాడు అడిగింది-

"ఎందుకు ఆ గది అలా తాళం పెట్టి వుంచారు ?"

కమలాకరం ఆమెకేసి ఆదోలా చూసి అన్నాడు "అందులో అతని సామాన్లు వున్నాయి."

"సామానా !" ఆశ్చర్యపోయింది.

"అవును"

"మరి కూడా తీసుకెళ్ళలేదా !"

"పెద్దగా ఏం తీసుకెళ్ళలేదు. అన్నీ అలాగే వున్నాయి"

"తాళం మీరే వేశారా ?"

తల ఊపాడు కమలాకరం.

"ఎందుకు అలా వుంచారు? గది ఖాళీ చేసేయ్యొచ్చుగదా!"

కమలాకరం ఆమెకళ్ళల్లోకి చూశాడు "అతను తిరిగి వస్తాడన్న నమ్మకంతో వాటిని అలాగే వుంచేశాను. ఒకవేళ యెప్పుడైనా వచ్చి అడిగితే సమాధానం చెప్పాలిగదా అందుకని"

జయంతి రెండు క్షణాల తర్వాత అడిగింది.

"ఇంకా ఆ నమ్మకంతోనే వున్నారా మీరు!"

"ఊహుఁ ఎందుకనో యీ మధ్యనే అది పోతోంది. రాకూడదని కూడా అని





పిస్తోంది" అతని మాటల్లో ఏదో అర్థం స్ఫురించి జయంతి గుండె ఝల్లుమంది. అతని మొహంలో యే భావమూ లేదు.

"ఆ గది తాళాలు నాకోసారి యిస్తారా?"

"ఎందుకు?"

"ఊరికే చూడ్డానికి"

కమలాకరం యేదో అనబోయి ఆగి, డ్రాయర్ సొరుగులోంచి వెతికితీసి తాళం చెవి జయంతి చేతిలో పెట్టాడు.

జయంతి తల వూపి బయటకు నడిచింది వీధివైపు అరుగుమీది గది దగ్గరికి. తాళం తీసి, తలుపు తోసింది.లోపల చీకటిగా వుంది. ఎడమవైపు చేత్తో తడిమింది. రెండు మూడు స్విచ్‌లు తగిలాయి. ఒక స్విచ్ నొక్కింది. లైటు వెలిగింది.

జయంతి చుట్టూ చూసి నిట్టూర్చింది. రాజారావు సామాను చూస్తుంటే ఆమెకు ఏవేవో గుర్తుకొచ్చి, బాధ కలుగుతోంది. నెమ్మదిగా ముందుకు నడిచింది. ఆమె నడుస్తోంటే అడుగుజాడలు పడుతున్నాయి. టేబిల్ మీదగుడ్డ బాగా మాసిపోయి వుంది. మడిచివున్న ఫొటో ఫ్రేమ్ చటుక్కున అందుకొని తెరిచి చూసి నివ్వెరపోయింది. అందులో తన ఫొటో, రాజారావ్ ఫొటో వుండేది.కాని, అందులో తన ఫొటో మాత్రమే వుంది. రాజారావు ఫొటో స్థానం ఖాళీగా వుంది. జయంతి హృదయం గిలగిల్లాడింది. నెమ్మదిగా పైనున్న సూట్ కేస్ తెరిచింది. రాజారావ్ బట్టలన్నీ అలాగే వున్నాయి. ఓసారి ఆప్యాయంగా వాటిని తడిమింది. వాటిని చూస్తుంటే రాజారావునే చూసినట్టుంది ఆమెకు.

దేనికోసమో వెతికింది. దొరకలేదు. ఆ సూట్ కేస్ నెమ్మదిగా పక్కనున్న మంచంమీద పెట్టి, కిందనున్న సూట్ కేస్ తెరిచింది. అయిదు నిముషాల తర్వాత తృప్తిగా నిట్టూర్చింది. తనఊహ కరెక్టే. రాజారావ్, రాజ్యలక్ష్మి యిక్కణ్ణించి వెళ్ళిపోయే పదిహేను రోజుల ముందే, కొత్త సంవత్సరం ప్రారంభమైంది. తన ఊహ ప్రకారం గత సంవత్సరం రాజారావ్ డైరీ గదిలోనేవుండాలి ఎందుకంటే రాజారావు దగ్గర ఎల్లవేళలా డైరీ ఉంటుంది. పాతవాటిని దాస్తాడు.

జయంతికి డైరీ ఎప్పుడెప్పుడుచదువుదామా అన్న కంగారెక్కువైపోయింది. ఎందుకంటే, దానివల్ల అసలు రాజారావుకీ, రాజ్యలక్ష్మికీ పరిచయం ఎలా అయింది అన్న విషయం స్పష్టమయిపోతుంది.

సూట్ కేసులు గబగబా మూసేసి, యథాస్థానంలో వుంచి కుర్చీమీద దుమ్ము దులిపి స్థాయిగా కూర్చుని రాజారావు డైరీ తెరిచింది.



# 8

పొద్దుట దాదాపు ఎనిమిది గంటలవుతూ వుండగా కమలాకరం దగ్గర కొచ్చింది జయంతి. కమలాకరం ఆమె మొహం వైపు ఆశ్చర్యంగా చూశాడు. రాత్రంతా నిద్రలేనట్టు ఆమె కళ్ళు ఎర్రగా, వుబ్బి వున్నాయి. రాత్రి అత

నిచ్చిన తాళం చెవి టేబిల్ మీద పెట్టి, కుర్చీలో కూర్చుంది.

"రాత్రి మీరడిగారు ఆ గదిలోకి వెళ్ళే హక్కు మీకుందను కొంటున్నారా? అని నేను తిరిగొచ్చినతర్వాత చెబుతానన్నాను" జయంతి గొంతు అదోలా ధ్వనిస్తోంది. హఠాత్తుగా ప్రారంభించిన ఆమె తీరు కమలాకరానికి అర్థం కాలేదు.

"ఆ గదిలోకి వెళ్ళే హక్కు నాకు లేదని, వెళ్ళినతర్వాతే తెలిసింది. అంతే కాదు. ఈ ఇంట్లో వుండే హక్కు కూడా నాకు లేదు. ఇన్నాళ్ళూ నేను పొరబడ్డాను నన్ను క్షమించండి.

"ఏమిటి మీరు మాట్లాడుతున్నది?"

"అవును. మీరన్నట్లుగా రాజారావు గురించి యింతవరకూ తెలిసింది చాలా తక్కువ. అతను చాలా మంచివాడు. అమాయకుడు అని నమ్మాను. రాజ్యలక్ష్మి గారితో అతను వెళ్ళి పోవడంలో అతని బాధ్యత ఏమీ లేదన్న నమ్మకంతోనే, మీ దగ్గరకు రాగలిగాను. కాని... కాని...అతను నీచుడు, దుర్మార్గుడు." ఆమెకంఠం వణికింది.

"జయంతిగారూ!" కమలాకరం అంతకంటే మాట్లాడలేక పోయాడు.

"అవును కమలాకరంగారూ! జరిగిన దాంట్లో అతని బాధ్యత కూడా చాలా ఎక్కువ."

"అయితే"

"అది రుజువైనతర్వాత కూడా నేను ఈ యింట్లో వుండటం అన్యాయం. నేను వెళ్ళి పోతాను."

కమలాకరం కంగారుగా చూశాడు.

"అదేమిటి ఎక్కడికి కెళతారు? అయినా, మీరు యిన్నాళ్ళూ యిక్కడ వూరికెనే వుండలేదుగదా. నాకు అవసరమైన పని చేసిపెట్టారు. నేను కొద్దిగా ప్రతి ఫలం యిచ్చాను అంతేగదా!"

"అంతే కావచ్చు. అది మాత్రం యివ్వవలసిన అవసరం ఏమిటి? మీ సంస్కారం కొద్దీ మీరు నన్ను ఆదరించారు తప్పితే మరో అవసరం ఏముంది!"

"అలా అనకండి నేను మొదటే చెప్పాను. నేను మీకు అన్యాయం చెయ్యలేదన్న నమ్మకం మీకు కలగడం కోసమే యిక్కడ వుండమన్నాను. అయితే నా అదృష్టం కొద్దీ, మీ వల్ల సాగర్ బెంగపడకుండా ఆనందంగా వుండటం నేను మీ దగ్గర్నించి పొందిన అదనపు ప్రయోజనం. అది చాలా వరకూ నా స్వార్థం కూడా."

జయంతి ఏమీ మాట్లాడలేదు. ఆమె వెళ్ళిపోతా నంటుందేమోనని కమలాకరానికి కంగారుగా వుంది.

"నా వల్ల మీకు యిబ్బందికాని, బాధ కాని కలిగిందా?"

"ఛ...ఛ అదేం లేదు"

"మరి...మరి మీరెందుకెళ్ళిపోవాలి? ఎక్కడికి కెళతారు? వెళ్ళినా మీరు చేసేది బ్రతుకు తెరువు కోసం వుద్యోగమే గదా!"

జయంతి తలూపింది.

"అదేదో యిక్కడే చెయ్యండి. ఇన్నాళ్ళూ ఒకరకం వుద్దేశంతో ఈ యింట్లో వున్నారు. ఇప్పుడు మరోలా కేవలం మీరు నా యింట్లో వుద్యోగం చేస్తున్నట్టుగా వుండండి. ఏమంటారు?"

జయంతి ఏమీ మాట్లాడ్డానికి ప్రయ

త్నించక పోవడం చూసి కమలాకరం మళ్ళీ మొదలు పెట్టాడు.

"ఇప్పుడు మీరెళ్ళిపోతే సాగర్ తట్టు కోలేడు. వాళ్ళమ్మలేని లోటు మీ వల్ల తీరుతోంది వాడికి."

జయంతి మొహం ఎర్రబడడం చూసి, తనన్న మాటల్లో పొరపాటు అర్థం వుందేమోనని కంగారు పడ్డాడు. కమలాకరం.

"సారీ ... సారీ ... నేను తప్పుగా మాట్లాడివుంటే ఎక్స్‌క్యూజ్ మీ"

జయంతి కాస్త బలవంతంగానవ్వింది.

"ఏనాడూ విశ్రాంతి అనేది యెరుగని నేను మీ వల్ల అది పొందగలుగుతున్నాను, దయచేసి మీరు వెళ్ళొద్దు" అభ్యర్థిస్తున్నట్టు అడుగుతున్న అతని గొంతులో మరేదో భావం కూడా వినబడి అతని మొహంలోకి చూసింది జయంతి. అతని కళ్ళల్లో తనింతవరకూ చూడని ఏదో బేలతనం...క్షణంసేపు ఎందుకో కమలాకరంమీద జాలి లాంటిది కలిగింది. అతను అంతలా అడుగుతోంటే, కాదని వెళ్ళి తను మాత్రం చెయ్యగలిగేదేముంది. యింతవరకూ తను గడిపింది విచిత్రమైన బ్రతుకు. పోనీ మరికొంత కాలం సాగనిద్దాం.

"ప్లీజ్ మీరింకేం ఆలోచించొద్దు, అంగీకరించండి"

కమలాకరం అలా ప్రాధేయ పడుతుంటే జయంతికి కాస్త సిగ్గనిపించింది.

"మీరంతలా అడగనవసరంలేదు. సర్లెండి. మీ మాట ప్రకారమే చేస్తాను"

"థాంక్యూ" కమలాకరం ఆనందంగా నవ్వాడు. ఏదో అనబోయేంతలో "మేడమ్ మేఢమ్" అంటూ అరుస్తూ వచ్చాడు సాగర్ కమలాకరాన్ని చూసి చప్పున నిశ్శబ్దమైపోయి,

"మేడమ్ స్కూలుకి టైమవుతోంది ఏ డ్రస్ వేసుకోను?" అన్నాడు.జయంతి నవ్వి "పద వస్తున్నాను" అంటూ లేచింది.

"అన్నట్టు చిన్న సంగతి మర్చిపోయాను"

"ఏమిటది?"

"డైవోర్స్‌కు అప్లయ్ చేస్తున్నాను" అంటూ తన మొహంలోకి చూస్తున్న కమలాకరం చూపుల్ని తప్పించుకొంటూ అలాగా అన్నట్టు తలూపి, బయటకు నడిచింది జయంతి.

కమలాకరం ఆమె వెళ్ళినవేపేచూస్తూ ఏదో ఆలోచనల్లోకి జారబోయి సర్దుకుని లేచి నిలబడ్డాడు.



## 9

సూర్యుడు సముద్రం మీదికి దిగుతున్నాడు. బీచ్ కోలాహలంగావుంది. సముద్రపు హోరును మించిపోయిన మనుషుల గోల. గాలి ఈదురుగా వీస్తోంది.

జయంతి పైట చెవుల చుట్టూ లాక్కొంది. పక్కనే అడుగులు వేస్తున్న సాగర్ రెండు చేతులూ చెవుల మీద వుంచి చిరాగ్గా చూస్తున్నాడు. గోల భరించలేక జన సమ్మర్దానికి దూరంగా నడిచింది జయంతి.

"ఇక్కడ కూచుందామా?" సాగర్ వైపు చూసింది. రెండు చేతులతోటీ చెవుల్ని అదిమి పట్టుకున్న సాగర్‌ను



చూస్తే నవ్వొచ్చింది.

"ఏమిటి మేడమ్ అంటున్నారు? నాకు వినిపించడంలేదు" గట్టిగా అన్నాడు సాగర్. జయంతి గట్టిగా నవ్వేసింది. అతని రెండు చేతులూ పట్టుకొని చెవుల మీంచి తీసేసింది.

"చెవులు మూసుకుంటే ఎలా వినిపిస్తుంది! యిక్కడ కూచుందామా?"

సాగర్ ఓసారి చుట్టూ తల తిప్పి చూశాడు. అక్కడ మనుషులు అంత ఎక్కువగా లేరు.

"యస్ మేడమ్"

ఇద్దరూ ఇసుకలో కూర్చున్నారు. సముద్రపు హోరు తప్ప నిశ్శబ్దంగా వుంది. అక్కడ జనం గోల భరించలేక యిక్కడి కొస్తే యిక్కడ మరీ నిశ్శబ్దంగా వుంది. నిశ్శబ్దం కూడా చిరాగ్గా అనిపించింది జయంతికి.

"మేడమ్ ఏదైనా కథ చెప్పండి" సాగర్ ఆసక్తిగా అడుగుతున్నాడు.

"కథా! ఏం చెప్పను? అయినా బీచ్‌లో కథలేమిటి? రోజూ ఇంటిదగ్గర చెబుతున్నానుగా!"

"బీచ్‌లో కథలు చెప్పుకోకూడదా మేడమ్?" అమాయకంగా అడుగుతున్న అతని మాటల వెనుక చిలిపితనం జయంతికి ముచ్చటేస్తోంది.

"ఉఁహుఁ"

"మరి ఏం చెయ్యాలి?"

"హాయిగా మౌనంగా కూర్చుని, మంచిగాలి పీల్చుకోవాలి, లేకపోతే సరదాగా అటూ యిటూ తిరగాలి అంతే."

అలాగా! అన్నట్టు చూశాడు.

"ఇప్పుడు మనం ఏంచేద్దాం?" బుద్ధిమంతుడిలా అడిగాడు.

జయంతి నవ్వి "నేనిక్కడ కూచుంటాను. నువ్వు సరదాగా ఆడుకో."

సాగర్ ఒక్కక్షణం ఆగి, అలాగే అన్నట్టు తల వూపి ముందుకు నడిచాడు. సాయంత్రపు నీరెండలో అతని నీడ పొడవుగా యిసుకలో పరుచుకొని జయంతి మీద కదులుతోంది.

ప్రతి ఆదివారం సాగర్‌తో బీచ్‌కి

రావడం అలవాటయింది. తనకి యిష్టం లేకపోయినా సాగర్ గురించి రావడం తప్పడం లేదు. సముద్రమంటే తనకూ యిష్టమే కాని, సముద్రాన్ని చూసినప్పుడల్లా రాజారావు స్మృతులు తనను మరింత బాధ పెడతాయి. ఈ మధ్య రాజారావు గురించి మర్చిపోదానికి ప్రయత్నిస్తోంది తను. చాలా వరకూ మర్చిపోగలిగింది.

జయంతికి నవ్వొచ్చింది.

నిజంగా తను మర్చిపోగలిగిందా? మర్చిపోవడం సాధ్యమా? ఏదో చిన్న సంఘటనల్ని మర్చిపోవడంసాధ్యం కాని, ఇలాంటివాటినిమర్చిపోవడంఎలాసాధ్యం! మరి...మరి...వాటికి...అంటే అలాంటి బాధాకరమైన స్మృతుల్ని తట్టుకో గలగడానికి, అలవాటు పడటమే బహుశా మర్చిపోవడమేమో అంతే! ప్రతి మనిషి అంతే.

రాజారావ్ తనను వదిలి పెట్టాడన్న బాధకంటే, తనతో కాపురం చేసిన మూడు సంవత్సరాలూ, అంత దీర్ఘకాలం తనకు యేమాత్రం అనుమానం రాకుండా అత్యద్భుతంగా అనిపించే ప్రేమానురాగాల్ని యెంత గొప్పగా నటించ గలిగాడన్న బాధ తనను తొలిచివేస్తోంది అంతకాలం తను అతన్నించి పొంద గలిగింది కేవలం నటన మాత్రమే అని తోచినప్పుడల్లా ఈ ప్రపంచమంతా కలిసి తనను వంచించారన్నంత బాధ, సిగ్గు కలుగుతున్నాయి.

ఒక మనిషి, మరో మనిషిని అంత కాలం వంచించ గలడన్న విషయాన్ని తను యిప్పటికీ పూర్తిగా విశ్వసించలేక పోతోంది.

తనకే కాదు, రాజారావ్ ప్రవర్తన, స్వభావం తెలిసిన యెవరైనా సరే ఈ విషయాన్ని నమ్మలేరు. వంచన, క్రౌర్యం, అంత సంస్కారవంతంగా మృదువుగా వుంటాయని ఎవరికీ తోచదు.

గంభీరంగా, చిన్నగా నవ్వు కలబోసిన స్వరంతో, చెరగని చిరునవ్వుతో సహనం మూర్తీభవించినట్టు కనిపించే రాజారావ్ నిజ స్వరూపం ఇదని తను కలలో కూడా అనుకోలేదు.

పెళ్ళయిన కొత్తలో అన్నవరం కొండమీద సత్యనారాయణ స్వామి వ్రతం చేసుకొని, తరువాత సింహాచలం దర్శించి, వైజాగ్ వచ్చిన సాయంత్రం తను మొదటి సారిగా సముద్రాన్ని చూసింది. అదొక గొప్ప అనుభూతి. ఉవ్వెత్తున లేస్తున్న కెరటాలతో హోరు హోరున ధ్వనిస్తూ మీది మీదికి వురుకుతున్న అఖండమైన నీలపు జలరాశి...తన గుండెల్లో యేదో వుద్విగ్నత, జలదరింపు. ఏదో భయంలాంటిది...బలంగా వీస్తున్నగాలి ... తను అతనికి మరింత దగ్గరగా జరిగింది తన కళ్ళల్లో కదులుతున్న భయాన్ని పసిగట్టాడు కాబోలు చిన్నగా నవ్వాడు రాజారావ్.

"జయంతీ! భయమేస్తోందా?" తనను మృదువుగా పొదివి పట్టుకొంటూ అడిగాడు.

"ఉంహుం" సిగ్గుపడినట్టుగా నవ్వింది.

"మరి"

"అది...అది ... స్పష్టంగా చెప్పలేను. భయం మాత్రం కాదు"

"అయితే అది గొప్ప సంతోషమై వుండాలి. గొప్పదైన ఆనందం భయానికి దగ్గరగా వుంటుంది."



విస్మయంగా చూసింది అతని వంక, అతని మాటలు ధోరణికి.

"అవును జయంతీ! తట్టుకోలేనంత ఆనందం మనిషిని భయానికి దగ్గరగా తీసుకెళుతుంది. నీకే కాదు మొదటిసారి సముద్రాన్ని చూసినప్పుడు నాక్కూడా యిలాంటి అనుభూతే కలిగింది. నాకే కాదు సముద్రాన్ని మొదటి సారిగా చూసిన ఏ మనిషికైనా అలాంటి భావమే కలుగు తుందనుకుంటాను."

గొప్ప అవగాహన వున్నట్టు మాట్లాడుతున్న అతన్ని చూస్తుంటే, అతని మీద గౌరవం రెట్టింపయింది తనకి.

"ఇలా ఎందుకు జరుగుతుందో తెలుసా? సృష్టి మొదట్లో ఎలావుండేదో నిదర్శనంగా ఆనాటి పరిస్థితికి నమూనాలుగా మిగిలి పోయిన కొండలూ, సముద్రాన్నీ, చూస్తుంటే మానవుడికి సృష్టి మొదటిస్థితి గుర్తొచ్చి కలిగే సంచలనమే యీ ఆనందం."

"అందరికీ అదే రకం భావం ఎలా కలుగుతుంది?"

రాజారావ్ సున్నితంగా నవ్వాడు "మనుషులందరికీ మూలం ఒక జీవే కాబట్టి. ఈ లక్షణం వంశపారంపర్యంగా మనకు తెలియ కుండానే మన మనసుల్ని అనుసరించి వస్తుంది."

గొప్ప విజ్ఞానిలా మాట్లాడుతున్న అతన్ని అభినందించకుండా వుండలేక పోయింది ఆ రోజు. కాని ఈ రోజు ఆ విజ్ఞతకు, సంస్కారానికీ అర్థం లేకుండా అయిపోయింది. ఆ రోజు అతను చిన్న కవిత కూడా చెప్పాడు. అది ఈనాటికీ తను మరిచిపోలేదు.

"ఈ అనంత విశ్వంలో
భూగోళం చిన్న బిందువు
ఈ భూమ్మీద
సముద్రమొక పెద్ద నీటి బిందువు"

తను అతని వంక ఆశ్చర్యంగా చూసింది. సృష్టిలో ఒకదాని ముందు మరొకటి ఎంత అల్పమో చక్కగా చెప్పిన ఆ నాలుగు వాక్యాలూ తన మనసులో హత్తుకు పోయాయి.

"మేడమ్ ... మేడమ్" సాగర్ పిలుస్తున్నాడు. ఉలిక్కి పడి అతని వంక క్షణంసేపు అయోమయంగా చూసి, తల విదిలించింది.

సాగర్ నవ్వుతున్నాడు. జయంతి మొహంలోకి చూస్తూ

"మేడమ్ నాలుగుసార్లు పిలిచాను తెలుసా ?" అన్నాడు.

"నిజంగా!" జయంతి కూడానవ్వింది. సాగర్ చేతులు మీద తడి యిసుక అంటుకొని వుంది. అంతసేపూ అతనేం చేశాడో వూహించగలిగింది జయంతి.

"ఇంతసేపూ ఏం చేస్తున్నావ్ ?"

"ఇల్లు కట్టాను మేడమ్.బలేబావుంది"

"ఇల్లా?"

"అవును మేడమ్! ఇసుకతోకట్టాను. రండి చూద్దురుగాని" వుత్సాహంగా అంటూ ఆమె చేయి పట్టుకున్నాడు. జయంతి లేచి నిలబడి చీర కంటిన ఇసుక దులుపు కొని, అతనివెంట అడుగులు వేసింది.

జాతి నీలం రాతిమీద అరగదీస్తున్న యెర్ర చందనం చెక్కలా వున్నాడు సూర్యుడు. సముద్రంలోకి సగం మునిగి, ఎరుపు,నీలి మిశ్రమంలా వుందిసముద్రం.

నీటికి దగ్గరగా దాదాపు గజం మేర గుండ్రంగా గోడలా యిసుక పేర్చి దాని




మధ్యలో చిన్న యిసుకతో కట్టిన ఇల్లు...దానికిఅక్కడక్కడా సముద్రపు ఒడ్డున దొరికే గవ్వలు,నత్తగుల్లలు, చిన్న చిన్న బొమ్మరాళ్ళు, అందంగా పొదిగాడు. జయంతి ఆశ్చర్యపోయింది అంత చిన్న వయసులో అతని కళాత్మక దృష్టికి.

"ఎలా వుంది మేడమ్?" ఆసక్తిగా అడుగుతున్న సాగర్ భుజం చుట్టూ చెయ్యివేసి చిన్నగా దగ్గరకు తీసుకొంది జయంతి.

"చాలా బావుంది సాగర్. నిజంగా యెంతో బావుంది" అంటూ ప్రేమగా అతని నుదుటి మీద ముద్దు పెట్టుకొంది.

సాగర్ ఆనందంగా నవ్వాడు తను కట్టిన యిల్లువైపు చూస్తూ అలా కాస్సేపు చూసింతర్వాత హఠాత్తుగా ఏదో గుర్తుకొచ్చినట్టు అన్నాడు-

"మేడమ్! మమ్మీ, నేనూ యెప్పుడు బీచ్‌కి వచ్చినా యిలాగే కట్టేవాణ్ణి. మమ్మీ చూసేది కాదు" సాగర్ మాటలకు జయంతి నిటూర్చింది. సాగర్ మళ్ళీ ఏదో చెప్పబోతోంటే, దూరంగా ఏవో నవ్వులూ,చప్పట్లూ వినిపించడంతో యిద్దరి దృష్టి అటు మళ్ళింది. దాదాపు డజను మంది ఆడపిల్లలు కేరింతలు కొడుతూ నీటి అంచునే పరుగెత్తుకు వస్తున్నారు. విద్యార్థినులు కాబోలు అనుకొంది జయంతి.అందరూ బెల్‌బాటమ్స్.. ఒక అమ్మాయి ఏదో యింగ్లీషు పాట-ముక్కలు ముక్కలుగా అంటూంటే మిగతావాళ్ళు అరుస్తున్నట్టుగా వంత పాడుతూ చప్పట్లు కొడుతున్నారు.

"చీకటి పడుతోంది. వెళదామా?" సాగర్‌వైపు తల తిప్పి అడిగింది. సాగర్ తలూపాడు అతని చెయ్యి పట్టుకొని ముందుకు అడుగులు వేసింది జయంతి.

అమ్మాయిలు బాగా దగ్గరకొచ్చారు. పాటపాడుతున్న అమ్మాయి మరీపొడుగ్గా అందరిలోనూ మరీ ప్రత్యేకంగా కనిపిస్తోంది. లావుగా కూడా వుంది. దానికి తగ్గట్టే, వెడల్పాటి బెల్టు, బాగా లూజుగా వున్న బెల్‌పాంటు.

సాగర్ జయంతి చెయ్యి పట్టుకొని చిన్నగా లాగి, ఆ అమ్మాయివైపు చూపిస్తూ కళ్ళు చికిలించి నవ్వాడు. "ష్" అన్నట్టు చూసింది జయంతి నవ్వాపుకొంటూ.

జయంతిని, సాగర్‌ను చూస్తూ ఒక్క క్షణం పాటను స్లో చేసి, ముందుకు సాగిపోయారు అమ్మాయిలు. మరో నాలుగు గజాలు ముందుకు వెళ్ళేసరికి, వాళ్ళ వంకే వెనక్కి వెనక్కి చూస్తున్న సాగర్ జయంతిని చెయ్యిపట్టి ఆపేశాడు

"మేడమ్ మేడమ్ అలా చూడండి"

"యేమిటి?" జయంతి వెనక్కి తిరిగింది. సాగర్ కట్టిన యిసుక యింటి చుట్టూ నిలబడి ఆశ్చర్యంగా చూస్తున్నారు అమ్మాయిలంతా. ఏదేదో గొడవ గొడవగా మాట్లాడుకుంటున్నారు. సాగర్ గర్వంగా నవ్వాడు. జయంతి కూడా నవ్వింది. అంతలోనే పొడుగాటిఅమ్మాయి బిగ్గరగా పాట అందుకుంది. మిగతా వాళ్ళు కూడా చప్పట్లు కొడుతూ వలయాకారంగా డాన్స్ చేస్తున్నట్టుగా తిరుగుతున్నారు.

'మినీ హవుస్ మినీ హవుస్
హవుస్ ఆఫ్ ద మికీ మవుస్'

సాగర్ కిలకిలా నవ్వేశాడు. జయంతికి కూడా నవ్వాగలేదు. రెండు నిమి

షాలు అలాగే చూసినతర్వాత, యిద్దరూ బయలుదేరారు. మళ్ళీ సాగర్ చెయ్యి పట్టుకొని ఆపాడు.

ఏమిటి అన్నట్టు చూసింది జయంతి. సాగర్ ఏదో సందేహిస్తున్నట్టు చూశాడు

"ఏమిటి సాగర్! చెప్పు!"

"వాళ్ళు...వాళ్ళు ... ఆ యింటిని తొక్కేస్తారేమో మేడమ్ !"

అతని భయానికి ఒక్కసారిగా నవ్వొచ్చింది జయంతికి.

"హ్హు ... ఫరవాలేదు సాగర్ .... వాళ్ళు మంచి వాళ్ళు.. వాళ్ళకది బాగా నచ్చింది. పాట కూడా పాడారు అందు కేగా..." అనునయిస్తున్నట్టుగా చెప్పింది. సాగర్ ఒక్క క్షణం అదోలా చూసి తృప్తిగా తలాడించాడు.

మరో అయిదు నిమిషాల్లో యిద్దరూ రోడ్డుమీదకొచ్చి బస్టాప్ దగ్గర నిల బడ్డారు. కారు ఖాళీగా వుంటే కారులోనే పంపిస్తాడు కమలాకరం. కాని ఆ రోజు ఏదో పనుందని చెప్పి, బీచ్‌లో దింపి వెళ్ళిపోయింది కారు.. బాగా చీకటి ముసురుకుంటోంది. రోడ్డు పొడవునా ప్రకాశవంతంగా లైట్లు వెలుగుతున్నాయి. బస్‌స్టాప్ దగ్గర చాలా మంది గుంపులు గుంపులుగా నిలబడి ఏదో గోలగోలగా మాట్లాడుకుంటున్నారు. కొత్తగా అనిపించింది జయంతికి. సాయంత్రం వేళ ఆమాత్రం రద్దీ వుంటుంది. కానీ, ఆ రోజు వాళ్ళ ధోరణి భిన్నంగా ఉంది. అందులో ఎవరూ బస్ ఎక్కే ప్రయత్నంలో లేరు.. సాగర్, జయంతి అల వాటుగా ఒకచోట నిలబడ్డారు... చలి గాలి రివ్వురివ్వున వీస్తోంది...

"చలివేస్తోందా?" సాగర్‌ను అడిగింది

లేదన్నట్టు తలూపాడు సాగర్. అత నేదో ఆలోచిస్తున్నట్టుగా కనబడ్డాడు. బహుశా తను కట్టిన యిసుక యింటిని గురించేమో అనుకొంది జయంతి. మరో పావుగంట గడిచింది.. బస్సు రాలేదు.. బస్టాప్‌లో జనం ఇంకా పెరిగిపోయారు. జయంతికి ఏదో విశేషంవున్నట్టనిపించింది. ఆపుకోలేక అటూ యిటూ చూసి, దగ్గరలో తమలాగే ఏమీ పట్టనట్టు సిగ రెట్ కాల్చుకుంటున్న ఒకతన్ని అడిగింది ఏమిటని. అతను తలతిప్పి జయంతి వంక ఎగాదిగా చూసి చెప్పాడు-

"బస్సుల వాళ్ళకీ, రిషా వాళ్ళకి గొడవటండీ.. బస్సులన్నీ కాన్సిల్ చేశారు.. రిషాలు, టాక్సీలు కూడా తిర గడం లేదు.. కొట్లాటలు, ఘర్షణలు జరుగుతున్నాయని కొన్ని చోట్ల నూట నలభైనాలుగో సెక్షన్ కూడా పెట్టారు.

జయంతి గుండెల్లో రాయి పడినట్ల యింది. ఇప్పుడెలా ! ఈ వూరు తనకు అంతగా తెలియదు. బీచ్ నుంచి ఇంటికి వెళ్ళే ఒకటి రెండు సిటీ బస్‌ల నంబర్లు తప్పితే మరేం తెలీదు..

"ఎందుకైనా మంచిది ఏదో రకంగా తొందరగా యింటికెళ్ళిపోవడానికి ప్రయత్నించండి" సలహా యిస్తున్నట్టుగా అన్నాడు అతను. జయంతి అలాగే అన్నట్టు తలవూపి.. సాగర్ చెయ్యి పట్టుకొని కొంతదూరం నడిచి ఒకచోట నిలబడింది..

"సాగర్ !.. నీకు యింటికెళ్ళేదారి తెలుసా ?"

"ఎందుకు మేడమ్ !"

"బస్సులు, రిషాలు ఏవీ లేవటగా నడిచే వెళ్ళాలి."

సాగర్ రెండు క్షణాలు ఆలోచిస్తు





న్నట్టుగా ఏదో గుర్తు తెచ్చుకొంటున్నట్టుగా ప్రయత్నించి.. "రోజూ కారులో వచ్చేదారయితేతెలుసు మేడమ్" అన్నాడు

జయంతి తేలిగ్గా నిట్టూర్చింది "అయితే.. వెళ్ళిపోదామా ?"

"నడిచేనా !"

"అవును.. ఏం.. నడవలేవా ?"

"ఈజీగా నడిచేస్తాను మేడమ్.." వుత్సాహంగా అన్నాడు సాగర్.

"అయితే పద"

ఇద్దరూ నడవటం మొదలుపెట్టారు. మళ్ళీ జయంతికి మరో ఆలోచన వచ్చింది ఈ గొడవల విషయం కమలాకరానికి తెలియకుండా వుంటుందా.. తెలిస్తే కారు పంపిస్తాడేమో !.. ఏమో !.. అతనెంత బిజీగా వున్నాడో...

సాగర్ ఉత్సాహంగా ఏవేవో కబుర్లు చెబుతున్నాడు. మధ్యలో దారి చెబుతూ చకచకా నడుస్తున్నాడు. జయంతి పరధ్యాన్యంగా వింటోంది.

హఠాత్తుగా సాగర్, జయంతి చెయ్యి పట్టుకున్నాడు.

"మేడమ్ ! అటు చూడండి" ఎదురుగా చూపించాడు. జయంతి వులిక్కిపడింది. దాదాపు పదిగజాల దూరంలో ఏదో కొట్లాట జరుగుతోంది. పెద్ద పెద్ద అరుపులు, కేకలతో సుమారు రెండు వందల మంది కొట్టుకొంటున్నారు. సోడా బుడ్లు ఫెటేల్, ఫెటేల్ మని పగులుతున్న చప్పుళ్ళు. కర్రలు, రాళ్ళు విసురుకొంటున్నారు. భయంకరమైన కేకలు. జనం చెల్లాచెదురై పారిపోతున్నారు. జయంతికి భయంతో కాళ్ళు

కదలలేదు. సాగర్ చెయ్యి గట్టిగా పట్టుకొంది. చూస్తుండగానే పరిస్థితి విషమించిపోయి రణరంగంలా మారిపోయింది. కొట్లాట ముందు ముందు కొచ్చేస్తోంది. జయంతికి కర్తవ్యమేమిటో పాలుబోవడం లేదు.

"మేడమ్! వాళ్ళు యిటే వస్తున్నారు. పారిపోదాం" సాగర్ కంగారుగా అరిచాడు.

జయంతి తేరుకొని సాగర్ చెయ్యి మరింత గట్టిగా పట్టుకొని అటూ యిటూ చూసింది. పక్కనే చిన్న సందులాంటి రోడ్ వుంది. దాదాపు పరిగెడుతున్నట్టుగా నడిచి రోడ్డు మీదికి తిరిగింది. పదిగజాలు నడిచిన తర్వాత వెనక్కి తిరిగి చూసి బిగుసుకు పోయింది. కొంత మంది మనుషులు అదే సందులోకి పరిగెత్తుకు వస్తున్నారు. వాళ్ళలా ఎందుకు పరుగెడుతున్నారో అర్థం కాలేదు. సాగర్‌ను దాదాపు యీడుస్తున్నట్టుగా పరుగెత్తి పక్కనే వున్న చిన్న కిళ్ళీ కొట్టువారగా చీకట్లో బాగా అనుకొని నిలబడిపోయింది. కిళ్ళీ బడ్డీ యజమాని గభాల్న కొట్లోంచి కిందికి ఉరికి, గబగబా కొట్టు మూసేస్తున్నాడు. పెద్దగా ఏదో గొణుక్కుంటున్నాడు. జయంతి రొప్పుతోంది. ఆమె గుండెలు దడదడ లాడుతున్నాయి. సాగర్ భయం భయంగా చూస్తున్నాడు. పెద్ద గొడవ వినిపించింది. జయంతి కొద్దిగా ముందుకు వంగి చూసింది. కొట్లాట సందులోకి కూడా విస్తరించింది. ముందు పరుగెత్తు కొచ్చిన వాళ్ళు, కిళ్ళీ బడ్డీ యజమానిని మెడ పట్టుకుని గెంటుతున్నారు. అతను పెద్దగా అరుస్తూ బూతులు తిడుతున్నాడు. అతన్ని పక్కకిలాగి, కొట్లో వున్న సోడా కేసులు తీసుకున్నారు. రెండు క్షణాల్లో ఆ ప్రదేశమంతా అల్లకల్లోలమైపోయింది. సోడా బుడ్లు విసురు కొంటున్నారు. జయంతి బాగా ఒదిగి నిలబడింది. సాగర్ ఆమెను అంటుకు పోయాడు. కొన్ని సోడా పెంకులు గోడకు తగిలి ఖంగుమని చప్పుడు చేశాయి. జయంతికి నిలువెల్లా ముచ్చెమటలు పోశాయి. ఆ గాజు పెంకులు తగిలితే!...చటుక్కున సాగర్‌ను గోడవారకు అన్చి, అతన్ని చుట్టుకొని, దాదాపు అతను పూర్తిగా కనబడకుండా అడ్డుగా నిలబడింది. కొట్టుకు వేలాడుతున్న పెట్రొమాక్సు లైటు తీశారెవరో! అది కూడా విసిరి వేయబడింది. జయంతి నిలబడిన ప్రదేశం పూర్తిగా చీకటై పోయింది. చప్పుళ్లు, అరుపులు, పెడబొబ్బలు, ఆర్తనాదాలు భయంకరంగా వినిపిస్తున్నాయి. జయంతి ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని కదలకుండా నిలబడింది. గోడకు తగిలి గాజు పెంకులు ఖణేల్, ఖణేల్ మని చప్పుడు చేస్తున్నాయి. జయంతి ఎడమమోచేతి దగ్గర చురుక్కుమంది. జయంతి చిన్నగా కెవ్వుమంది.

"మేడమ్! ఏమిటి మేడమ్!" కంగారుగా అడుగుతున్నాడు సాగర్.

"ఏమీలేదు...ఏమీలేదు...కదలకు"

జయంతి చేత్తో తడిమి చూసింది. తడిగా తగిలింది. రక్తం...పైటచెంగు వుండలా చుట్టి గట్టిగా అదిమిపెట్టింది. సోడా పెంకు చేసిన గాయం... జయంతికి అప్రయత్నంగా కళ్ళు నీళ్ళు తిరిగాయి తన పరిస్థితికి. తనకేమైనా ఫరవాలేదు.




సాగర్‌కేమైనా అయితే...?..? మోచేయి ఎంత బాధ పెడుతున్నా పళ్ళ బిగువున అపుకొని సాగర్‌ను మరింత గట్టిగా పట్టుకొంది.

మరో పదినిమిషాలు అలాగే మొండిగా నిలబడింది. తరువాత ఏం జరిగిందో- కొట్టుకొంటున్న మనుషులు చెల్లాచెదురై పోతున్నారు. బహుశా పోలీసులొస్తున్నారేమో ! జయంతి ఎక్కడలేని ధైర్యం తెచ్చుకొంది. సాగర్‌ను జాగ్రత్తగా పట్టుకొని రోడ్డుమీదికొచ్చి ముందుకు పరుగెత్తింది. అక్కడ్నించి వెళ్ళిపోవడమే ఆమె లక్ష్యం. నాలుగయిదు మలుపులు తిరిగిన తర్వాత పరుగెత్తలేక ఆగిపోయింది. సాగర్ కూడా ఆయాసపడి రొప్పుతున్నాడు.

జయంతికి అయోమయంగా వుంది. తామెక్కడికొచ్చామో, ఎక్కడున్నామో కూడా తెలియడంలేదు. సాగర్ మొహం నీరసంగా చెమటలు పట్టి వుంది.

"సాగర్! యీ వీధి నీకు తెలుసా?"

"తెలీదు మేడమ్, మేడమ్ యిదేవిటి రక్తం...రక్తం!" కంగారుగా అరిచాడు.

"ష్ అరవకు!" అతన్ని అరవద్దన్నట్టుగా భుజంమీద చేయివేసి తరువాత చూసుకొంది జయంతి. ఎడమవేపు చీరంతా పూర్తిగా రక్తంతో తడిసిపోయివుంది. దూరంగా వున్న స్ట్రీట్ లైట్ వెలుగుపడి మెరుస్తున్నట్టుగావుంది. జయంతి గుండెలు ఝల్లుమన్నాయి. నిస్సాణగా అనిపించింది. చాలా రక్తం పోయుండాలి. మోచేతి వంక చూశ్శేక సాగర్ కళ్ళు మూసుకున్నాడు. జయంతి కూడా తన గాయం వంక తనే చూసుకోలేకపోయింది. నాలుగయిదు అంగుళాలు పొడవుగా పేరుకుపోయి, యింకా రక్తం స్రవిస్తోంది. చటుక్కున మళ్ళీ దాని మీద పైటచెంగు అదిమిపట్టింది. సాగర్ భయంభయంగా చూస్తున్నాడు.

"సాగర్! భయమేస్తోందా?" బలవంతంగా నవ్వు తెచ్చుకొని అడిగింది. తను డీలా పడిపోతే అతనెక్కడ భయపడిపోతాడో అని సాధ్యమైనంతవరకూ నవ్వడానికి పయత్నిస్తోంది.

సాగర్ లేదన్నట్టుగా తలం వూపినా అతని కళ్ళల్లో భయం స్పష్టంగా కనిపిస్తోంది.

"పద!" జయంతి ముందుకు నడవబోయింది. కళ్ళుతిరిగినట్టయ్యాయి. శక్తినంతా కూడదీసుకొని నిలదొక్కుకొంది. ముందు డాక్టర్ దగ్గరకెళ్ళాలి. ఇలాగే యింటికి వెళితే ఎలా? అప్పటికే రోడ్డు మీద పోతున్న నలుగురయిదుగురు యధాలాపంగానే అయినా కాస్తపరీక్షగా చూస్తున్నట్టనిపించింది జయంతికి. ఇంకా కొంతసేపు యీ రక్తం యిలాగే పోతే తనకు మరీ నీరసం వచ్చి నడవలేక పోవచ్చు. తమాయించుకొని ముందుకు నడిచింది. ఒకచోట చిన్న రేకుల షెడ్డు ముందు కూర్చొని ఒకావిడ పిండి రుబ్బుకుంటోంది. అది చిన్న హోటల్ లాగ ఉంది. ఆవిణ్ణడిగింది జయంతి. ఆవిడ జయంతి వంక పరీక్షగా చూసి-అక్కడికి మరో అరమైలు దూరంలో హాస్పిటల్ వుందనిచెప్పి ఆనవాళ్ళు చెప్పింది. ఆవిడ చెప్పిన ఆనవాళ్ళు మననం చేసుకొంటూ మధ్యమధ్యలో సాగర్‌కి ధైర్యం చెబుతూ నడిచింది జయంతి. మరో పావుగంటలో అనుకొన్న చోటుకి చేరింది. 'రాఘవా నర్సింగ్‌హోమ్' పెద్ద పెద్ద

అక్షరాల్తో బోర్డు...కొత్తగా కట్టినట్టుగా వుంది హాస్పిటల్ బిల్డింగ్. అక్కడికి మెయిన్‌రోడ్ కనిపిస్తోంది. నెమ్మదిగా గేటు దాటి లోపలికి అడుగు పెట్టింది. వరండా మెట్లు ఎక్కింది. అక్కడున్న పొడవాటి బల్లలమీద నలుగురయిదుగురు పేషెంట్లు కూర్చొని వున్నారు. అందులో యిద్దరు స్త్రీలు...వాళ్ళు కూర్చున్న బల్లి మీద ఒకవైపు కూర్చుని, సాగర్‌ను తన పక్కన కూర్చోబెట్టుకొంది. మాటి మాటికీ తన మొహంలోకి భయం భయంగా చూస్తున్న సాగర్ మొహంలోకి చూసి బలవంతంగా నవ్వుతోంది.

ఎదురుగా వున్న గదికి నీలంరంగు కర్టెన్ వేలాడుతోంది. డాక్టర్ రాఘవ యం.బి.బి.యస్. అన్న అక్షరాలువున్న బోర్డు, గోడకు వుంది. పక్కనకూర్చున్న స్త్రీ, జయంతివంక చూసి ఏదో అడగబోయింది. ఇంతలో కర్టెన్ తొలగించుకొని సన్నగా వున్న నర్సు బయటికొచ్చి జయంతి వంక కొత్తగా చూసి దగ్గరకొచ్చింది. జయంతి ఏదో చెప్పబోయేంతలోనే, ఆమె చిన్నగా అరిచింది.

"మైగాడ్! ఎంత రక్తం....మీరు లేవండ ముందు!"

జయంతి అతి ప్రయత్నంమీద లేచి నిలబడి, ముందుకు తూలబోయింది. నర్సు ఆమెను గట్టిగా పట్టుకొంది పడిపోకుండా.

* * *

డెట్టాల్ వాసన...ఏదో పింగాణీ పాత్రలు కదిలిస్తున్న చప్పుడు...జయంతి కనురెప్పలు విప్పడానికి ప్రయత్నం చేస్తోంది. రెప్పలు బరువుగా, మత్తుగా విడివడ్డం లేదు. 'జయంతీ...జయంతీ' రాజారావు గొంతు పిలుస్తోంది. జయంతి శరీరం గగుర్పొడిచినట్టయింది. రాజారావు యిక్కడికెలా వస్తాడు! నరాలన్నీ వొక్కసారిగా చైతన్యవంతమయి ఏదో చిక్కుముడి విడినట్టుగా అయింది శరీరమంతా. "జయంతీ...మిస్ జయంతీ!" సరిగ్గా వినబడుతోంది. అది రాజారావు గొంతు కాదు. చప్పున కళ్ళు తెరిచింది. రెప్పలు టపటపలాడించి చూసింది.




సుమారు నలభై సంవత్సరాల మనిషి వంగి తన మొహంలోకి చూస్తూ పిలుస్తున్నాడు. భుజం మీద స్టెతస్కోప్ ఆయన్ని డాక్టరుగా తెలియజేస్తోంది. పక్కనే నర్స్ వుంది.

డాక్టర్ చిన్నగా నవ్వాడు "ఇప్పుడెలా వుంది మీకు?"

చప్పున గుర్తుకొచ్చింది జరిగిందంతా జయంతికి. వెంటనే సాగర్ గుర్తుకొచ్చి కంగారుగా తలతిప్పి చూసింది. నర్స్ పక్కనే తనవంక ఆతృతగా చూస్తూ నిలబడి వున్నాడు. అమ్మయ్య అని లోలోపలే తేలిగ్గా శ్వాసవదిలి కదలబోయింది. ఎడమ మోచేయి చురుక్కుమంది. మోచేతి దగ్గర దళసరిగా వేయబడిన తెల్లటి బాండేజ్. కుడిచేతిమీద ఆనుకుని మంచంమీద లేచి కూర్చుంది. కుడి మోచేయి మడతలో అప్పటిదాకా వున్న చిన్న దూదివుండ కిందపడింది.

"గుడ్" సంతృప్తిగా అన్నాడు డాక్టర్.

ఆయనడిగిన ప్రశ్నకు తనింకా సమాధానం చెప్పలేదని గుర్తు వచ్చి తడబడింది జయంతి.

"నాకిప్పుడు బాగానే వుంది డాక్టర్". తన గొంతు తనకే బలహీనంగా వినిపించింది. గొంతు సవరించుకొన్నట్టుగా దగ్గడానికి ప్రయత్నించింది.

"రక్తం చాలా పోయిందమ్మా... అందుకని మీకు రక్తం యెక్కించవలసి వచ్చింది. లక్కీగా మీ గ్రూప్ బ్లడ్ ఈజీగానే దొరికింది. అసలు యెలా తగిలింది అంత దెబ్బ! అయిదు కుట్లు పడ్డాయి".

జయంతి విస్తుబోతున్నట్టు ఆయన మాటలు వింది. తరవాత ఆయనవైపు కృతజ్ఞతగా చూసి చిన్నగా నవ్వడానికి ప్రయత్నం చేస్తూ అంది—

"ఎవరో ఘర్షణ పడుతున్నారు డాక్టర్! సోడాబుడ్లు విసురుకొంటున్నారు, ఆ పెంకు తగిలింది" అని మరోసారి ఆయనవంక కృతజ్ఞతగా చూసి,

"థాంక్యూ ఫర్ యువర్ కైండ్ ట్రీట్‌మెంట్" చేతులు జోడించింది.

"నథింగ్ మోర్ థాంక్స్. ఇట్స్ మై డ్యూటీ. ఇంతకీ మీరు..." అర్ధోక్తిగా ఆగాడాయన. ఆయన అడుగుతున్న విషయమేమిటో జయంతికి అర్థమైంది.

"ఈ ఊరు నాకు కొత్త డాక్టరుగారూ! నేనిక్కడ స్నేహితుల యింట్లో వుంటున్నాను".

"అలాగా! వారికి కబురు చెయ్యమంటారా?"

తలూపింది జయంతి.

"అడ్రస్ చెప్పండి!"

"కమలాకరం, శ్రీకాంత్ ఆటో మోబైల్స్ జనరల్ మేనేజర్, మధురా నగర్".

"ఓహో! ఆయనా!" తల పంకించాడాయన.

"ఆయన మీకు తెలుసా?"

"పెద్ద పరిచయం లేదనుకోండి. ఏదో ఫంక్షన్‌లో చిన్న పరిచయం. అయితే యిప్పుడే ఫోన్ చేస్తాను. నంబర్ చెప్పండి!"

"నంబరా?" గుర్తు తెచ్చుకోడానికి ప్రయత్నించింది. గుర్తురాలేదు. చటుక్కున సాగర్ వంక చూసింది. దూరంగా నిలబడి తన వంకే చూస్తున్నాడు. అతన్ని



చూస్తే అదోలా అనిపించింది జయంతికి.

"సాగర్ యిలారా!" చెయిచాపి ఆప్యాయంగా పిలిచింది. గబగబా ముందుకొచ్చి ఆమెను ఆనుకొని నిల బడ్డాడు.

"మన ఫోన్ నంబరు తెలుసా?"

సాగర్ తలూపాడు. చకచకా చెప్పే శాడు నంబరు. మరోసారి చెప్పమని నర్సును నోట్ చేసుకోమని చెప్పాడా యన. నర్స్ నంబర్ నోట్ చేసుకొంది.

"చూడండి జయంతీ" అని ఆగి నవ్వి,"మీ పేరు సాగర్ చెప్పాడు. మీరు ఇతనికి టీచరటగదా. మీరు వారం రోజులు, కనీసం అయిదు రోజులయినా యిక్కడ విశ్రాంతి తీసుకోవడం మంచిది. మీరు చాలా వీక్‌గా వున్నారు. పైగా చాలా రక్తం పోయింది. ఏమం టారు?"

జయంతి అలాగా అన్నట్టు చూసింది అవుననీ కాదనీ కూడా అనలేదు.

"ఆల్ రైట్ ఆయనతో చెబుతాను. ఓకె" అని వెళ్ళిపోయారు డాక్టర్. నర్స్ దగ్గరకొచ్చింది. మీరు భోజనం చేస్తారా? లేకపోతే బ్రెడ్, మిల్క్ యివ్వమంటారా?"

అప్పుడు గుర్తొచ్చింది జయంతికి ఆకలి సంగతి. తనూ సాగర్ కూడా యింకా భోజనం చెయ్యలేదు. తనకు ఆకలిగా వున్నట్టనిపించలేదు.

"నా సంగతి కేంలెండి. ముందు మా సాగర్‌కి, ఏదైనా ఏర్పాటు చెయ్యండి" ఆప్యాయంగా అతని భుజం చుట్టూ చెయ్యి వేసింది. సాగర్ తన వంక ఆనందంగా చూస్తున్నాడు.





నర్స్ గట్టిగా నవ్వింది. "నేను యిందాకట్నుంచి అడుగుతున్నానండి. మా మేడమ్ మాట్లాడితేనే గాని ఏమీ తిననని భీష్మించుకూర్చున్నాడు."

జయంతి ఆశ్చర్యంగా చూసింది సాగర్ మొహంలోకి. అతను నవ్వాడు.

"అదికాదు మేడమ్. మీరు మాట్లాడక పోతే నా కెంత భయమేసిందో తెలుసా? అందుకని అలా అన్నాను. ఇప్పుడు తినేస్తాను. నాక్కూడా బ్రెడ్ అండ్ మిల్క్" హుషారుగా అన్నాడు.

జయంతి నవ్వి "మా యిద్దరికీ బ్రెడ్ మిల్క్ తీసుకురండి" అంది నర్సుతో.

నర్సు వెళ్ళిపోయింది. జయంతి సాగర్‌ను మంచం మీదే తన పక్కన కూర్చోబెట్టుకుంది.

"మేడమ్ మీకు కళ్ళు తిరిగాయా?"

"అవును."

"ఆ నర్సూ, ఇంకోకావిడా కలిసి మిమ్మల్ని లోపలికి తీసుకెళ్ళారు. నా కేమో ఏడుపొచ్చింది. మేడమ్! నన్ను రానివ్వలేదు. తరువాత మిమ్మల్ని యీ గదిలో మంచం మీద పడుకోబెట్టిం తర్వాత రానిచ్చారు. అప్పుడేమో మీ చేతికి యిక్కడ" అంటూ కుడిమోచేతి మలుపులో వేలుపెట్టి చూపించి "యింజక్షన్ సూది గుచ్చి..ఎర్రగా వుంది రక్తం లాగ ... అది స్టాండుకు పెట్టి ఎక్కిస్తున్నారు. నాకు భయమేసి, అదిగో అక్కడ కూర్చున్నాను మీ వంక చూస్తూ" దూరంగా వున్న స్టూల్ చూపించాడు. అతని మాటల్లో వున్న ఆప్యాయత, గుండెల్లో ఏదో వుద్విగ్న తను పైకిలాగుతోంది. తదేకంగా అతని కళ్ళల్లోకి చూస్తూ అతని మాటలు వింటోంది జయంతి.

ఆ తరవాత మీరు మాట్లాడారు. నాకు సంతోషంగా వుంది మేడమ్''

జయంతి కూడా ఆనందంగా నవ్వింది. మరో పావుగంటలో నర్సు బ్రెడ్, పాలు తీసుకొచ్చింది. బాగా నీరసంగా వున్నా లేని వోపిక తెచ్చుకొని సాగర్‌తో సరదాగా. కబుర్లు చెబుతూ బ్రెడ్, పాలు పూర్తిచేసింది జయంతి.

''మేడమ్ డాడీ తిడతారేమో'' ఏదో ఆలోచిస్తూ భయంగా అన్నాడు సాగర్.

''దేనికి''

''మీకుదెబ్బతగిలిందికదా అందుకు!''

''నాకు దెబ్బ తగిలితే నిన్నెందుకు తిడతారు!'' ఆశ్చర్యంగా అడిగింది.

''నా గురించే కదా మీరు బీచ్‌కి వచ్చారు!''

''అదా! అదేంకాదు. నిన్నేమీ అనరు ఫరవాలేదు'' జయంతి నవ్వింది.

"మేడమ్! వారం రోజుల దాకా ఇక్కడే వుండి పోవాలా?"

''ఏం?''

''ఇంటి దగ్గర మీరు లేకపోతే నాకేం తోచదు'' బెంగగా అన్నాడు.

"మరేం చేస్తావ్ ?"

"స్కూలు మానేస్తే పాఠాలు పోతాయి..."

"పోనీ రోజూ స్కూలు అవగానే వచ్చేద్దువుగాని ఏం"

తలూపాడు మరో పావుగంట ఏవో కబుర్లు చెప్పుకున్న తరవాత,

"మేడమ్ నాకు నిద్రొస్తోంది" ఆవులించాడు.

"ఇలా పడుకో!"

"మంచం మీదా!"

"ఏం?"

"డాక్టరుగారేమైనా అంటారేమో?"

"ఏమీ అనరు పడుకో!" మంచం మీద దిళ్ళు సర్దింది. సాగర్ పడుకున్నాడు. అయిదు నిమిషాల్లో గాఢంగా నిద్రపోయాడు.

"అదేమిటండీ బాబు మంచంమీదే నిద్రపోయాడు" నర్సు లోపలికొచ్చి రాగానే అంది.

"ఏం? పడుకో కూడదా!"

"ఉహూ ... పేషంట్స్ బెడ్స్ కేవలం వారికి మాత్రమే!"

"ఫరవాలేదు లెండి. నేనేమీ అంటు రోగిని కాదుగా!"

"అహఁ అదని కాదు" నొచ్చుకుంటున్నట్టుగా అంది నర్స్. ఏవో బిళ్ళలు, కాప్సిల్సు, యిచ్చి అవి ఎప్పుడెప్పుడు ఎలా వేసుకోవాలో చెప్పింది.

"మీకేమైనా కావాలంటే పిలవండి, మీ పక్కగదిలోనే వుంటాను. ఈ రాత్రి డ్యూటీ నాదే! అప్పుడప్పుడూ వచ్చి చూస్తుంటానులెండి మందులు వేయించాలి గదా!"

జయంతి తలూపి "ఫాన్ స్పీడు తగ్గించండి" అంది. నర్స్ ఫాన్ స్పీడు తగ్గించి బయటి కెళ్ళిపోయింది. చుట్టూ పరిశీలనగా చూసింది జయంతి. గది విశాలంగా శుభ్రంగా వుంది. బహుశా యిది స్పెషల్ రూమ్ కాబోలనుకుంది. వెంటనే డాక్టర్‌గారూ, బిల్లూ గుర్తుకొచ్చాయి. కమలాకరం ఇంకా రాలేదేమిటి? ఇంటి దగ్గర లేడేమో! దిండు సరిచేసుకొని సాగర్ పక్కనే నెమ్మదిగా పడుకొంది. ఏవేవో ఆలోచనలు చుట్టు ముడుతున్నాయి. దూరంగా ఎక్కడో గడియారం గంటలు కొడుతున్న చప్పుడు. లెక్కపెట్టింది. పది...

రోజూ యీ పాటికి సాగర్‌కు కథలు చెబుతూనో, చదువుకొంటూనో, నిద్ర పోతూనో వుండేది...ఈ రోజు ఇక్కడ ఈ స్థితిలో...ఏ రోజు ఎక్కడ వుంటామో బొత్తిగా తెలీదు. ఎందుకని తెలీదు? ఏమో అదే మాయ! ఇది మరీ వేదాంతపు ధోరణి ఆలోచనేమో, కొద్దిగా నవ్వొచ్చింది...సాగర్ అస్పష్టంగా ఏదో కలవరించాడు. అతని మీద దుప్పటి సరిగా సర్దింది. కళ్ళు మూసుకొని నిద్ర పోవడానికి ప్రయత్నించింది.ఫాన్ తిరుగుతున్న చప్పుడు...డెట్టాల్ వాసన... మగతగా కళ్ళు మూతలు పడుతున్నాయి. ఏవో పింగాణీ గిన్నెల చప్పుళ్లు...ఎవరో నెమ్మదిగా మాట్లాడుతున్నట్టు అనుభూతి.

'ఎలా వుంది జయంతీ!' రాజారావ్ గొంతు...

ఉలిక్కిపడి కళ్ళు విప్పింది జయంతి. ఎవరూ లేరు. ఆమె గుండెల్లోనుంచి దుఃఖం గొంతులోకి యెగిసినట్టయింది. ఎందుకీ రోజు పదేపదే గుర్తొస్తున్నాడు రాజారావ్! అవును ఎందుకు గుర్తొస్తున్నాడు!

ఈ డెట్టాల్ వాసన...యీమగత... యీ వాతావరణం, యీ నీరసం తనకు మొదటిసారిగా అనుభవమైనప్పుడు... అప్పుడు రాజారావ్ సమక్షంలోనే కళ్ళు తెరిచింది. ఆ రోజు ... ఆ రోజు ... జయంతి చెయ్యి అప్రయత్నంగా పొత్తి కడుపు మీది కెళ్ళింది.

* * *

డెట్టాల్ వాసన. తల దిమ్ముగా మగతగా వుంది.. ఏవో పింగాణీ గిన్నెలు లాగుతున్న చప్పుడు. ఎవరో నెమ్మదిగా మాట్లాడుకుంటున్నట్టు యేవో శబ్దాలు. ఎవరో పిలుస్తున్నారు. తను కళ్ళు విప్పడానికి ప్రయత్నిస్తోంది. కళ్ళు విడిపడ్డం లేదు. చెవుల్లో ఏదో గాలి...చప్పుడు లాంటి హోరు.

"జయంతీ!"

"ఊఁ" అతిప్రయత్నం మీద పలకగలిగింది.

"జయంతీ! ఎలా వుంది ?" రాజారావ్ గొంతు.

మరోసారి కళ్ళు విప్పడానికి ప్రయత్నించి విఫలమైపోయింది.

"జయంతీ ... జయంతీ" మళ్ళీ మళ్ళీ పిలుస్తున్నాడు రాజారావ్. ఆ పిలుపులో. గొప్ప అనురాగం ఆత్రుతపు ఛాయలు కలుపుకొని వినిపిస్తోంది.

సర్వశక్తులూ కూడ దీసుకొని కళ్ళు విప్పింది తను. రాజారావ్ మొహం కనిపిస్తోంది తన వంక దీనంగా చూస్తూ. రెప్పలు నిలబడటం లేదు. మూసుకుపోతున్నాయి. కాస్సేపటికి తను బాగా చూడగలిగింది. రాజారావ్ పక్కన లేడీ డాక్టర్.

లేడీ డాక్టరు తనను పరీక్షించి,సంతృప్తిగా తలాడించి వెళ్ళిపోయింది.. రాజారావు తన పక్కనే కూర్చొని తన చెయ్యి అతని చేతుల్లోకి తీసుకొని ఆప్యాయంగా నిమిరాడు. "జయంతీ..జయంతీ ఎలావుంది.." తన కళ్ళల్లో చూస్తున్న కళ్ళల్లో కోటి కోట్ల అతని వెన్నెల దీపాలు. వాటి వంక చూస్తుంటే తనకేమీ మాట్లాడ బుద్ధెయ్యలేదు. "అలా చూస్తున్నావేమిటి జయంతీ..ఎలావుంది?" భయంగా అడుగుతున్నాడు. "అసలు.. అసలు.. నాకేం. జరిగింది" ఆమాట అనేసిన తర్వాత చప్పున గుర్తొచ్చింది జరిగిన విషయం.. తన కళ్ళు కిందికి





వాలి చూపులు తన కడుపు మీదికి వెళ్ళాయి.. అది మునుపటిలా ఎత్తుగా లేదు. తొమ్మిది నెలల క్రితం ఎలా వుందో అలాగే పల్చగా వుంది అంటే...అంటే.. తన గుండెలు ఝల్లుమన్నాయి... తల తిప్పి అటుయిటూ ఆత్రుతగా చూసింది. తన పక్కన ఖాళీగా వుంది ... గదిలో ఎక్కడా వుయ్యాల మంచంగాని, పసి పిల్ల ఏడుపుగాని లేదు.. అంటే..అంటే.. లీలగా విషయం తనకు అర్థమవుతోంది.

"ఏమండీ !" భయంగా పిలుస్తూ కదలబోయింది తను.. పొత్తి కడుపు మీద అడ్డంగా చురుక్కు చురుక్కు మంటోంది.

"ఆహాఁహాఁ.. నువు కదలకూడదు జయంతీ" వారిస్తున్నట్టుగా తన భుజం మీద చేయి వేసి నొక్కిపెట్టాడు "కదిలితే కుట్లు తెగిపోతాయి కదలకు !"

"అంటే నాకు...నాకు ఆపరేషన్ చేశారా ? తనకు దుఃఖం వస్తోంది.

"జయంతీ.." బతిమాలుతున్నట్టు అన్నాడు. "నువ్వు గట్టిగా ఏడవడంగాని నవ్వడంగాని, చెయ్యకూడదు ! ఉద్రేక పడకు ... ఏం చేస్తాం.. నువ్వైనా దక్కావ్, నాకు అంతే చాలు" అతను కూడా బాధను దిగమింగుతున్నట్టు అన్నాడు.

తనకు జరిగింది పూర్తిగా అర్థమై పోయింది.

"ఏమండీ .. అసలు ఏం జరిగింది?" తనకు ఎంత ఆపుకొందామన్నా దుఃఖం ఆగటంలేదు. ఆ రోజు సాయంత్రం వంట చేస్తుంటే, హఠాత్తుగా తనకు

నొప్పులు రావడం.. ..రాజారావు హడా వుడిగా రిక్షాలో హాస్పిటల్‌కి తీసుకు రావడం, లేడీ డాక్టర్ తనను పరీక్షించి ఏదో చెప్పడం లీలగా గుర్తుకొస్తున్నాయి

"నీకు..నీకు.. సిజేరియన్ ఆపరేషన్ చేశారు.. జయంతీ !"

"సిజేరియన్.. అంటే.. !" తను అర్థంకాక అయోమయంగా అడిగింది.

"అంటే.. సహజంగా ప్రసవించే అవకాశం లేనప్పుడు ... పొత్తి కడుపు దగ్గర అడ్డంగా ఆపరేషన్ చేసి బేబీని బయటకు తీస్తారు."

తన చేయి అప్రయత్నంగా పొత్తి కడుపును తడిమింది. నడుంచుట్టూ దళ సరిగా చుట్టబడిన బాండేజ్...దానికింద పొదవుగా చురుకు చురుకు మంటున్న స్పర్శ... హఠాత్తుగా తనకు గుర్తొచ్చింది.

"ఏమండీ ..." సందేహిస్తున్నట్టుగా ఆగిపోయింది తను. అంత బాధలోనూ ఆ ప్రశ్న రాజారావును అడగడానికి, ఏదో సిగ్గు అడ్డపడింది.

"ఏమిటి, జయంతీ ?.."

"మరి... మరి..."

"ఊ.. ఏమిటీ!" లాలనగా అడిగాడు

"మరి ఎవరు పుట్టారు ?" ఆఖరికి అడిగేసింది తను.

రాజారావు బాధగా నవ్వాడు, సమాధానం చెప్పలేదు.. మళ్ళీ అడిగింది తను.

"ఎవరయితే యేంలే జయంతీ.. తరువాత చెప్తాను".

"ఊహుఁ..! అదికాదు. ఎవరు ?.. ఇప్పుడే చెప్పండి !"

అతను అదోలా నవ్వి, "నీ పంతమే నెగ్గింది"

"అంటే.. అంటే.. బాబు !.."

అవునన్నట్టు తలాపాడు..తన శరీరం పులకరించింది. అంతలోనే ఆ భాగ్యం దక్కలేదన్న బాధా యెగదన్ను కొచ్చింది.. అయినా ఏదో కుతుహలం..

"ఎలా వున్నాడు ?... బావున్నాడా?" బాధా,సిగ్గూ రెండూ వున్నాయి తన గొంతులో.

"నువు చెబుతుండే దానివే, అచ్చం అలాగే వున్నాడు"

"అంటే. వుంగరాల జుట్టూ...తెల్లగా బొద్దుగా.. ఏం ?"

తలూపాడు రాజారావు.

"ఏమండీ..,ఒక్కసారి చూపించండి" తనలో ఆపుకోలేని వుద్విగ్నత. కదలబోయింది.

రాజారావు కదలకుండా పట్టుకున్నాడు.

"జయంతీ !.. కదలొద్దన్నానా !"

"ఒక్కసారి చూపించండి !"

"సాధ్యం కాదు జయంతీ" నిరాశగా నిట్టూర్చాడు.

"ఏం ఎందుకని! ప్రాణంలేకపోయినా ఫరవాలేదు. ఒక్కసారి చూపించండి!"

"జ య ం తీ!" మందలిస్తున్నట్టు అన్నాడు. "ఉద్రేకపడకు తీసుకెళ్ళిపోయారు."

"ఏమండీ!" ఒక్కసారిగా బావురు మంది తను. రాజారావ్ ఎంత చెబుతున్నా తనకు తానుగా ప్రయత్నిస్తున్నా దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. తరంగాలుగా ఎగిసివచ్చి, చలించి పోతుంటే డాక్టరును పిలుచుకువచ్చాడు రాజారావు. సిరంజిముల్లు తన చేతిమీద దిగబడింది.




బాధనిపించలేదు. గొంతులోకి ఏదో మందువాసన. కనురెప్పలు బరువుగా అయిపోయి, ఏదో మగత కమ్మింది.

ఆ తరువాత మరో నెలరోజులకు యింటికి రాగలిగింది తను. నాలుగు నెలల తర్వాత పూర్తిగా తేరుకోగలిగింది రోజులు సాధారణంగా సాగి పోతున్నాయి.

పోయిన బాబు గురించి ఎలా ఉంటాదని తను అస్తమాను అడిగేది. అతను చెప్పడానికి అంతగా యిష్టపడేవాడుకాదు అయినా మరీమరీ అడిగిచెప్పించుకొనేది.

ఒకరోజు అతను చెప్పిన విషయం విని తను నిర్వీణ్ణులై పోయింది.

ఆ రాత్రి...

తమ యిద్దరి కోరికలూ మరిగిమరిగి చల్లారిన తర్వాత...అతని నుదుటి మీద పట్టిన చిరుచెమటను సుతారంగా ముని వేళ్ళతో తుడుస్తూ

"ఏమండీ!" గారంగా పిలిచింది తను

"ఊఁ"

"నాకు మళ్ళీ బాబే కావాలి!"

అతను మాట్లాడలేదు. ఈ మధ్య తను ఎప్పుడు ఆ మాటన్నా అతని మొహం ఎందుకో ఏదో అసహజమైన భావాల్ని పులుముకోవడం తను గమనిస్తోంది. ఆ రోజు కూడా అతనిమొహం అదోవిధంగా మారిపోయింది. మళ్ళీ అదే మాట అంది తను. కొంతసేపటికి అతను పక్కలో లేచి కూర్చున్నాడు.

"జయంతీ నీకో విషయం చెప్పాలి"

"చెప్పండి. దానికి యిలా లేచి కూర్చోవడం అవసరమా?" అతనిచెయ్యి పట్టితన పక్కకు లాక్కోపోతే, అతను సున్నితంగా తన చేతిని వదిలించుకొన్నాడు. ఆ రోజు అతని వైఖరి తనకు కొత్తగా అనిపించి ఆశ్చర్యమేసింది. అతనేదో గంభీరమైన విషయం చెప్ప బోతున్నట్టు అర్థమై తన హృదయం ఎందుకో రెపరెప లాడింది.

"జయంతీ అసలు..." అతనేదో సందేహిస్తున్నట్టు ఆగిపోయాడు.

"చెప్పండి!"

"చెబుతాను నువ్వు మరీ వుద్రేక పడకు. ఎప్పటికైనా ఈ విషయం నీకు చెప్పక తప్పదు" గబగబా అన్నాడు. తన గుండెలు ఝల్లు మన్నాయి.

"ఏం...ఏమిటది?!"

"నీకు ఇక పిల్లలు పుట్టే అవకాశం లేదు జయంతీ" ఎటో చూస్తూ, ఎవరితోనో అంటున్నట్టుగా నెమ్మదిగా అన్నాడు. అతని మాటలు అర్థం చేసుకోడానికి రెండు క్షణాలు పట్టింది. తన మనసంతా నిర్ఘాంత పోయినట్లు స్తబ్దుగా అయిపోయింది.

"ఏమిటి మీరంటున్నది ! ఎందుకు ? ఎందుకలా జరిగింది ?" గొంతు పెకలించుకో వలసి వచ్చింది తను.

"ఎందుకంటే నీకు సిజేరియన్ చేసినప్పుడు డాక్టర్లు చెప్పారు. మళ్ళీ నీకు గర్భం ధరించే అవకాశం ఉన్నా తిరిగి సిజేరియన్ చెయ్యాలి తప్ప గత్యంతరం లేదని. పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేశారు."

తనకు బాధ, కోపం రెండు ఉధృతంగా వచ్చాయి. చటుక్కున లేచి అతని జబ్బ పట్టుకొని అరిచినట్టుగా అడిగింది

"ఎందుకు చేశారలా...మళ్ళీ సిజేరియన్ అవసరమైతే చేయించుకోడానికి

నేను సిద్ధమే. కాని నన్నడక్కుండా ఎలా చేశారు? ఇది మోసం!"

"నన్నడిగారు జయంతీ ... నా అంగీకారంతోనే జరిగింది."

"మీ అంగీకారంతోనా! ...మీరెలా ఒప్పుకొన్నారు?"

అతను చటుక్కున తన మొహాన్ని రెండు చేతుల మధ్యా పట్టుకొని తన కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

"జయంతీ నాకు, నీ కంటే పిల్లలు ముఖ్యంకాదు. మళ్ళీ సిజేరియన్ జరిగితే నువు నాకు దక్కకపోతే...జయంతీ నా జీవితానికి అర్థంలేదు" వుద్వేగంతో చలిస్తున్న అతని గొంతు ఆర్ద్రమైన అతని కళ్ళు, తనను మాటాడకుండా చేశాయి.

"నువు నాక్కావాలి జయంతీ! నువు లేకుండా నేను బ్రతకలేను" తనను గాఢంగా కౌగలించుకొని తన చెవిలో అంటున్న అతనిని, ప్రేమగా అల్లుకొంది తను. మాతృత్వం కోల్పోయినా, తనను.. అచ్ఛంగా తన గురించే తనను ప్రేమించే భర్త లభించడం తన అదృష్టమనిమురిసిపోయింది. కాని...కాని....

"మిమ్మల్నే ... మిమ్మల్నే"

* * *

వులిక్కిపడి కళ్ళు తెరిచిందిజయంతి. నర్సు పిలుస్తోంది.

"ఏమిటి, అలా కేకలు పెడుతున్నారు! కలొచ్చిందా?" నవ్వుతూ అడిగింది.

"కేకలు పెట్టానా లేదే!" ఆశ్చర్యంగా అంది జయంతి. తన గుండెలు ఆయాసంతో ఎగిసిపడడం గుర్తించింది.

"ఈ మాత్ర వేసుకోండి! బాగా నిద్ర పడుతుంది" నర్స్ గ్లాసుతో నీళ్ళు, మాత్ర యిచ్చింది. జయంతి, నెమ్మదిగా లేచి కూర్చొని మాత్ర నోట్లో వేసుకొని మంచినీళ్ళు తాగి గ్లాసు నర్సుచేతికిచ్చింది. సాగర్ వైపు చూసింది. గాఢంగా నిద్ర పోతున్నాడు. ఏదో గుర్తొచ్చింది.

"నర్స్! కమలాకరంగారొచ్చారా?"

ఆమె రెండు క్షణాలు ఆలోచించినట్టు మొహంపెట్టి "ఓహో ఆయనా! వచ్చారు. మీరు నిద్రపోతున్నారని లేపలేదు.

డాక్టర్‌గారితో మాట్లాడి, పొద్దుటే వస్తానని చెప్పి వెళ్ళిపోయారు" అంది.

"నిద్రపోతున్నానా !" జయంతి లోలోపలే నిట్టూర్చింది. తను ఆలోచనలో పడి, కమలాకరం రాకను గుర్తించలేదన్నమాట.

"కదలకుండా పడుకోండి. నిద్ర పట్టేస్తుంది" నర్సు ఆ మాటలు చెప్పేసి వెళ్ళిపోయింది.

జయంతి దిండు సరిగా సర్దుకొని, నెమ్మదిగా పడుకొని కళ్ళు మూసుకొంది. రాజారావు ఆలోచనలు వదలడంలేదు. ఆ రోజు, తన మాతృత్వం కంటే, తనే ఎంతో ముఖ్యమైనట్టు అంత అద్భుతంగా మాట్లాడిన రాజారావ్ అసలు వుద్దేశమేమిటో అతని డైరీ చదివేవరకూ తనకు తెలియదు. తెలిసిన తర్వాత తను నిజంగా నమ్మలేకపోయింది. అంటే రాజారావ్, కావాలనే తనకు పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించాడన్నమాట!

రాజారావ్‌కు పిల్లలంటే యిష్టంలేదు. ఎంత ఆశ్చర్యం!

జయంతికి తల దిమ్ముగా అవుతున్నట్టయింది. శరీరం బరువెక్కి ఆలోచనలు అస్పష్టమై ఆగిపోతున్నట్టు నిశ్శబ్దంగా అనిపించింది.



## 10

ఉదయం ఎనిమిదయ్యేప్పటికల్లా కమలాకరం వచ్చాడు హాస్పిటల్‌కి. అతని కళ్ళల్లో కదులుతున్న ఆతృత స్పష్టంగా గుర్తించింది జయంతి. అతన్ని చూడగానే, దిండుకు ఆనుకొని సాగర్‌తో ఏవో కబుర్లు చెబుతున్న జయంతి సర్దుకుని కూర్చుంది. కమలాకరాన్ని చూడగానే సాగర్ మంచం దిగి నిలబడ్డాడు. కమలాకరం చేతిలో బత్తాయి, ద్రాక్ష పళ్ళతో నిండిన ప్లాస్టిక్ సంచిని మంచం దగ్గర పెట్టి స్టూలు లాక్కొని కూర్చున్నాడు. జయంతి చిన్నగా నవ్వింది.

"రాత్రి నేను యింటికొచ్చేప్పటికే పది అయిపోయింది. మీరింకా రాలేదని, హాస్పిటల్‌నుంచి డాక్టరుగారు ఫోన్ చేశారనీ రావుయమ్మ చెప్పింది. నే వచ్చేప్పటికి మీరు నిద్రపోతున్నారు" గబగబా అన్నాడు జయంతి చేతికట్టు వంక పదే పదే చూస్తూ. జయంతి ఏమీ మాట్లాడలేదు.

"అయాం వెరీవెరీ సారీ!"

"దేనికి!"

"నా కారణంగానే మీకు దెబ్బ తగిలింది" బాధ పడుతున్నట్టు అన్నాడు.

"మీ గురించా?" నవ్వింది. "ఎందుకను కుంటున్నారు అలా?"

ఊళ్ళో పరిస్థితి వుద్రిక్తంగా వుందని, సిటీ బస్సులు, రిక్షాలు ఏవీ తిరగటం లేదని తెలిసికూడా మీ గురించి కారు పంపలేదు. పంపించాలనే అనుకున్నాను. ఎంత ప్రయత్నించినా వీలుకాలేదు."

"బావుంది. మీరు కారు పంపించనంత మాత్రానే నాకు దెబ్బ తగిలిందను కోవడం సిల్లీ"

"మీరెలా అనుకున్నా సరే. నా బాధ్యత నేను ఎంతో కొంత విస్మరించాను కదా!" జయంతి గట్టిగా నవ్వింది.

కమలాకరం తెల్లబోయినట్టు చూశాడు.

"మీరూ సాగర్ లాగే మాట్టాడు తున్నారే!"

"సాగర్‌లా మాట్టాడు తున్నానా!" ఆశ్చర్యంగా సాగర్ వైపు చూశాడు. సాగర్ నేల చూపులు చూస్తున్నాడు తప్పుచేసినట్టు.

"నా మూలానే మీకు దెబ్బ తగిలింది మేడమ్! నేను మిమ్మల్ని బీచ్‌కి తీసుకు రావడం వల్లే మీ కిది ... అంటూ తెగ బాధపడిపోతున్నాడు" జయంతి నవ్వింది సాగర్ భుజంమీద ఆప్యాయంగా తడిమి.

కమలాకరం కూడా నవ్వేసి సాగర్‌ను దగ్గరకు తీసుకున్నాడు.

"డాక్టరు గారితో మాట్లాడాను. మీరింకా వారం రోజులపాటు యిక్కడే వుండాలన్నారు. బలహీనంగా వున్నారు. విశ్రాంతి కావాలన్నారు."

"డాక్టర్లు అలాగే అంటారు."

"ఊరికే ఎందుకంటారు. సూచర్స్ విప్పడానికి ఎలానూ అయిదారు రోజులు పడుతుందిగదా. పైగా రోజూ డ్రెస్సింగ్ చెయ్యాలి. ఇంటి దగ్గరయితే వీలుకాదు." కమలాకరం నచ్చ జెబుతున్నట్టు అన్నాడు.

"పోనీలెండి అలాగే వుంటాను"

"రామయమ్మను పంపించమంటారా?"

"ఎందుకు?"

"మీకు తోడుగా వుంటుంది."

"అలా ఎందుకు! యింటి దగ్గర పనెవరు చేస్తారు? వద్దు!"

"మీ యిష్టం. మధ్యాహ్నం పూట క్యారియర్ తీసుకొచ్చి, మీకిచ్చి, మళ్ళీ యింటికి వచ్చేస్తుంది. సాయంత్రం క్యారియర్ తీసుకొచ్చిన తర్వాత కావలిస్తే వుంచుకోండి, లేకపోతే పంపించేయండి."

జయంతి అయిష్టంగానే తలూపింది. సాగర్ జయంతి వంక ఏదో చెప్ప మన్నట్టు చూస్తున్నాడు. జయంతికి అర్థమైంది.

"రోజూ స్కూలు అయిపోగానే సాగర్‌ను మాత్రం పంపించండి" కమలాకరం నవ్వాడు. సాగర్ తను రెడీ అన్నట్టు ఉత్సాహంగా తలూపాడు.

"సరే ... అయితే మరి, యీ వేళ స్కూలుకు వెళతావా!" కమలాకరం అడిగాడు. సాగర్ అయిష్టంగా తలూపాడు.

"పోనీ, యివాళ్టికి మానేసి, మేడమ్ గారికి తోడు వుంటావా?" కమలాకరం నవ్వుతూ అన్నాడు. అతని మాటలకు జయంతి అడ్డుపడుతున్నట్టుగా అంది.

"ఎందుకు? స్కూల్ మానొద్దు. సాయంత్రం వచ్చేటప్పుడు పుస్తకాలు తీసుకొచ్చెయ్. నిన్న ఎలాగూ ట్యూషన్ లేదుగా, రెండూ కలిపి యివాళ చెప్పేస్తాను."

సాగర్ తలూపాడు.

"డాక్టర్ మీకు విశ్రాంతి కావాలన్నారు" కమలాకరం అన్నాడు.

"ట్యూషన్ చెప్పడం పెద్ద శ్రమేమీ కాదు."

"ఆల్‌రైట్ మీ యిష్టం మరి నే వస్తాను."

జయంతి తలవూపింది.

"పద" సాగర్ వంక చూస్తూ అన్నాడు. ఇద్దరూ రెండడుగులు వేసిన తర్వాత జయంతికి తను మరిచి పోయిన ఒక విషయం చటుక్కున గుర్తు కొచ్చింది.





"కమలాకరం గారూ!" కాస్త గట్టిగా పిలిచింది. కమలాకరం వెనక్కి తిరిగి మంచం దగ్గరకొచ్చాడు. సాగర్ కూడా పక్కనే నిలబడ్డాడు.

"ఒక విషయం మరిచిపోయాను"

"చెప్పండి!"

"మరోలా అనుకోకండి. సాగర్ పుస్తకాల బీరువా పై అరలో,నా బ్యాంక్ పాస్ బుక్ వుంది. సాగర్‌కి తెలుసు"

"అయితే యేమిటి?" అర్థం కానట్టు అడిగాడు.

"నా కోసం అయ్యే యీ ఖర్చు, డాక్టరుగారి బిల్లు, అందులోంచి తీసి చెల్లిస్తే నాకు సంతోషంగా వుంటుంది" అతను తెచ్చిన బత్తాయి, ద్రాక్షపళ్ళు వున్న ప్లాస్టిక్ సంచీ వైపు చూస్తూ అంది.

కమలాకరం నివ్వెరపోయినట్టే, ఏదో అనబోయి ఆనకుండా "అలాగే" అని గిరుక్కున వెనక్కి తిరిగాడు. అతని కంఠంలో లీలగా ధ్వనించిన చిరుకోపానికి, జయంతి లోలోపలే నవ్వుకొంది.

"మేడమ్! స్కూలునుంచి రాగానే, వెంటనే వచ్చేస్తాను. ఓ.కె." సాగర్ రహస్యం చెబుతున్నట్టు చెప్పి వెనక్కి తిరిగి తండ్రి వెనక పరుగెత్తాడు.

మధ్యాహ్నం పన్నెండయ్యేటప్పటికల్లా రావయ్యమ్మ భోజనం పట్టుకొచ్చింది. భోజనంతోపాటు చదువుకోడానికి నాలుగు నవలలు, కొత్త వారపత్రికలు పంపించిన కమలాకరం శ్రద్ధకు, జ్ఞాపకానికి ఆశ్చర్యపోయింది. రావయమ్మ చాలా విచారించింది. ఆమె చూపిస్తున్న అభిమానానికి జయంతికి మనసంతా అదోలా అయిపోయింది. ఒక గంట కూచొని, క్యారియరు తీసుకొని వెళ్ళిపోయింది. సాయంత్రం సాగర్‌తో పాటు వచ్చి సాగర్‌ను వదిలి వెళ్ళిపోయింది. మరునాడు పొద్దుటే కమలాకరం వచ్చి తీసుకెళ్ళి పోయాడు. దాదాపు ప్రతిరోజూ ఇదే కార్యక్రమం. వారం రోజులూ చకచకా గడిచిపోయాయి.

కమలాకరం రోజూ, పొద్దుట సాయంత్రం శ్రద్ధగా వచ్చి చూసి పోతుండేవాడు. జయంతికి ఇదో కొత్త అనుభూతి. ఊహించని కొత్త పరిస్థితి. ఎనిమిదవరోజు డిశ్చార్జి చేసినతర్వాత సాయంత్రానికి యింటికి వచ్చేసింది.



## 11

"మీ గురించి తాతారావుగారు వచ్చారు"

రావయమ్మ మాటలు ఆశ్చర్యంగా విని, మంచం మీద పడుకొని పుస్తకం చదువుకొంటున్న జయంతి లేచి కూర్చుంది.

"నా గురించి రావడమేమిటి? కమలాకరంగారి గురించేమో!"

"కాదు మీ గురించే అంటున్నారాయన"

"నా గురించా! నేనెలా తెలుసాయనకు! ఇంతకీ ఎవరాయన ?" అనుమానంగా అడిగింది.

"ఇంతకు ముందోసారి మిమ్మల్ని ఫోన్‌లో అడిగారన్నారు. ఆయన..."

రావమ్మ నవ్వుతూ చెప్పింది.

జయంతికి గుర్తొచ్చింది.

"ఓహో! నాతో పనేమిటి?" చిరాగ్గా అడిగింది.

"ఏమోనమ్మా మీతో మాట్లాడాలట" తన బాధ్యత అంతేనన్నట్టు చెప్పేసి బయటికి వెళ్ళిపోయింది రావమ్మ.

జయంతి విసుగ్గా లేచి డ్రాయింగ్ రూమ్‌లోకి నడిచింది. సోఫాలో హుందాగా కూర్చుని, ఆమె అడుగులచప్పుడు విని తల తిప్పి చూశారు తాతారావుగారు. కూచోవాలో అక్కర్లేదో తెలియక తటపటాయిస్తూ రెండు క్షణాలు అలాగే నిలబడింది జయంతి.

"నా పేరు తాతారావ్. కమలాకరం పన్జేస్తున్న కంపెనీ డైరెక్టర్లలో నేనూ ఒకణ్ణి...."గంభీరంగా చెబుతూ కళ్ళజోడు లోంచి తీక్షణంగా తనను ఆపాదమస్తకం పరిశీలిస్తున్న ఆయన చూపుల్ని తప్పించుకొంటూ చిన్నగా నవ్వి చేతులు జోడించింది.

"అలా కూచో అమ్మాయ్" చనువుగా అన్నారు తాతారావుగారు.

జయంతి మౌనంగా ఆయన ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంది.

"చూడమ్మాయ్! కమలాకరానికి నేనంటే చాలా గౌరవం, భక్తి. అంతే కాదు భయం కూడానూ".

అలాగా అన్నట్టు నవ్వింది.

"ఎందుకంటే అతనన్నా నాకు చాలా ప్రేమ, అభిమానం. అతని భవిష్యత్తు ఉజ్వలంగా వుండాలని కోరుకునే వాళ్ళలో నేను మొదటివాణ్ణి.''

ఆయన యిదంతా ఎందుకు చెబుతున్నాడో జయంతికి అర్థం కాలేదు. తాతారావుగారు తన ధోరణి కొనసాగిస్తున్నారు.

"ఈ వయసులో యింత పెద్ద కంపెనీకి జనరల్ మానేజర్ అయినవాడు ఇండియాలో యితనే కావచ్చు. దానికి కారణం ఏమిటి? అతని దీక్ష, పట్టుదల, కృషి, ఇవేకాదు... మా అభిమానం కూడాను. అతనింకా పైకి రావలసిన వాడు. వస్తాడు కాని..." ఆగి, అటూ యిటూ చూసి నెమ్మదిగా గొంతు తగ్గించి అన్నారు "ఈ వయసులో అతనికి భార్యా వియోగం. దానికి ఎంత బుద్ధి లేకపోతే యిలాంటి మొగుణ్ణి, ఈ యింటిని వదిలివెళుతుంది చెప్పు"అని ఆగి జయంతి మొహంలో తనకు కావలసిన రియాక్షనేదో రాకపోవడం చూసి...

"అహఁ ఈ విషయాలన్నీ నీకు తెలిసే వుంటాయనుకో ... తెలియనివి కావుగాని యిలా ఎన్నాళ్ళు..."

జయంతికి ఆయన మీద ఎందుకో చిరాకు, కోపం పుట్టుకొస్తున్నాయి. బహుశా ఆయన చెప్పే ఆ తీరే దానికి కారణమేమో అనుకొంది.

"అతని వయసెంత. ఈ వయసులో ముసలాడిలాగ ఎందుకు వుండటం ? హాయిగా చక్కటి అమ్మాయిని చూసి పెళ్ళి చేసుకోక. ఏమంటావ్ ?"

జయంతి అసహనంగాఅటూ యిటూ కదిలింది.

"ఏమిటో నేనెంత చెప్పినా వినిపించుకోడు. ససేమిరా అంటాడు. పోనీ... నువ్వు చెప్పి చూడకూడదూ !"

జయంతి ఆశ్చర్యంగా చూసింది.

"నేనా ! ఏమిటి మీరనేది?"

"అవునమ్మా...నువ్వే పెళ్ళి చేసుకోమని చెప్పి చూడకూడదూ !"





అతని ధోరణి, మాటలు జయంతిలో పూర్తిగా చిరాకును లేపాయి.

"నే......నేనెందుకు చెబుతాను !" అర్థం కానట్టుగా అంది.

తాతారావు బిగ్గరగా చెవులు ఆదిరి పోయేలా, చిరాకు పుట్టేలా నవ్వాడు.

"అదేమిటమ్మా అలా అంటావు మరి ఏదో దగ్గరి వాళ్ళు చెబితేనే బావుంటుంది. అతను గభాల్న మాట తీసెయ్యలేదు. అవునూ ఇంతకూ నువ్వు కమలాకరానికి ఏమవుతావు ?"

జయంతికి ఈ మాటతో పూర్తిగా అర్థమైపోయింది తాతారావుగారు ఎందుకొచ్చాడో...రివ్వున పైకి లేస్తున్న కోపాన్ని అధిమి పెట్టి బలవంతంగా నవ్వింది. అంతకు ముందు ఆయనంటే వున్న గంభీరభావం పోయి, ఏదో లోకువతనం చోటు చేసుకొంది ఆమె మనసులో.

"నేనేమవుతా నను కుంటున్నారు మీరు?"

తాతారావుగారు మళ్ళీ గట్టిగా నవ్వి "అబ్బో గడుసు దానివే... నా చేత చెప్పించాలనా ! ?"

"అవును మీరే చెప్పండి ! నేను ఆయనకు ఏమవుతానో !" మరింత గడుసుగా అంది.

తాతారావుగారు తడబడినట్టు నవ్వి, సర్దుకొని "బహుశా ... దూరపు బంధువయ్యుంటావు అంతేనా!" ఇంకా గడుసుగా చెప్పాడు.

"ఉహుఁ కాదు"

"మరి దగ్గర బంధువా !"

"ఉఁహుఁ...అదీ కాదు" జయంతి

నవ్వింది. అతన్ని ఆట పట్టించడం ఆమెకు సరదాగా వుంది. తాతారావుగారి మొహంలో క్రమంగా యింతకు ముందున్న సౌమ్యం పోయి ఏదో కరుకుతనం చోటు చేసుకొంటోంది.

"దూరపు బంధువూ కాక... దగ్గర బంధువూ కాకపోతే నువు కాబోయే బంధువైవుండాలి." ఆయన మాటల్లోని వ్యంగ్యం, జయంతి మనసును చురుక్కుమనిపించింది.

"అంటే!" తీవ్రంగా అడిగింది.

"అంటే... అంటే యేముంది... దానికి అర్థం చెప్పవలసింది నువ్వే" మెత్తగా కత్తితో కోస్తున్నట్టుగానవ్వాడు. జయంతికి అర్థమయింది ఆయన ఏ భావంతో మాట్లాడుతున్నాడో. అతి ప్రయత్నం మీద నిగ్రహించుకొంది. బలవంతంగా నవ్వేస్తూ అంది..

"మీరనుకున్నవేమీకాదు.. నేనిక్కడ వుద్యోగిని"

"ఓహో ... అదా ... ఏం వుద్యోగం! ఎక్కడ?"

"ఈ యింట్లోనే... సాగర్‌కి ప్రయివేట్ టీచర్ని"

"అలాగా బావుంది.. కాని అమ్మాయ్ ప్రైవేట్ టీచర్ అంటే రోజుకి గంట అరగంటే, చెబుతారు. ఇలా ఇంట్లోనే వుండిపోవడం నేనెక్కడ చూళ్ళేదు" నవ్వాడు.

జయంతి మొహం యెర్రబడింది. తనను తాను నిగ్రహించుకొంటూ మౌనంగా వుండిపోయింది.

"పాపం... సాగర్‌కి వాళ్ళమ్మ లేని లోటు తీరుస్తున్నావన్నమాట. బావుంది అమ్మాయ్ నీ వుద్యోగం"

"ఏమిటి మీ వుద్దేశం!" కోపంగా అడిగింది.

"ఉద్దేశానికేముంది. ... ఉద్యోగం బావుందంటున్నాను ... కమలాకరం సెలక్షన్ బాగానే వుంది."

"ఛీ ... ఛీ ... ఇందాకట్నించి చూస్తున్నాను.. పెద్దమనిషిగదాని మర్యాదిస్తుంటే, హద్దుమీరి మాట్లాడుతున్నారు" విసురుగా లేచి నిలబడి, నిప్పులు కురిపించే కళ్ళతో అతన్ని చూసింది..

తాతారావు బెదర్లేదు సరిగదామరింత హేళనగా నవ్వాడు.

"మరీ కోప్పడకమ్మాయ్.. కూచో.. ఏ వూర్నించి తీసుకొచ్చాడు కమలాకరం నిన్ను. ఎంతిస్తున్నాడు నెలకి?"

"ఛీ అసహ్యంగా మాట్లాడకండి.. ముందు మీరు బయటకు పోండి" అరిచింది జయంతి. తాతారావుగారు తటాలున లేచి నిలబడ్డారు.

"ఊరికే ఎందుకలా అరుస్తావ్! నేనన్నదాంట్లో తప్పేముంది. ఉన్నమాటంటే వులుకెక్కువట ఎవరికైనా.. నీకూ,కమలాకరానికి ఏమిటి సంబంధం? ఏమీలేదు, నేను ప్రయివేటు టీచర్ని, నమ్మమంటావ్.. అంతేనా? ఎవరూ నమ్మరు. అతనికీ, నీకూ ఆ సంబంధం కాక మరోటి వుంటే నువ్వేచెప్పొచ్చుగా.. చెప్పవేం!.. చెప్పు" గద్దించాడాయన..

"యూ.. షటప్?.. పిచ్చిదానిలా అరిచింది.

"అనవసరంగా నోరు పారేసుకోకు.. నీలాంటి నదరైన దాన్ని యింట్లో పెట్టుకొంటే, ఏ మగాడికైనా పెళ్ళెందుకు... ఏదో సామెత చెప్పినట్టు..."

జయంతిలో విచక్షణ నశించిపోయి




రెచ్చిపోయింది.

"తాతారావుగారూ.... కమలాకరం గారికీ, నాకు ఏదో ఒకటుంది వుంటే మాత్రం.. మీకెందుకు, మీరెవరు అడగ డానికి?" తీవ్రంగా అడిగింది.

"నేను కమలాకరం శ్రేయోభిలాషిని అతని మంచి చెడ్డలు చూడవలసిన బాధ్యత నాకుంది. అంతేగాక, కంపెనీ డైరెక్టర్లలో ఒకడిగా అతని నైతిక పత నాన్ని నేను అంగీకరించలేను..సహించ లేను.."

"అయితే వెళ్ళి ఈ వా గు డ ం తా ఆయన దగ్గర వాగండి.. పొండి"

అక్కడ నిలబడలేనట్టు వెనక్కితిరిగి గదిలోకి పరుగెత్తింది. వెనకనుంచి తాతారావు గారు ఏదో అంటున్నారు. ఆపుకోలేనంత కోపం, దుఃఖం...మంచం మీదపడి దిండులో తలదూర్చి ఏడ్చేసింది జయంతి.

తన బ్రతుకు మీద, తన బ్రతుకుని ఇలా చేసిన రాజారావు మీద-కోపం, అసహ్యం, రెండూ కలిగాయి జయంతికి. ఏనాడూ ఎవరితోనూ మాటపడని తను... ఎన్నిమాటలుఅనిపించుకోవలసివచ్చింది! దీనికంతటికీ కారణం ఎవరు? రాజారావ్. తన బ్రతుకును నట్టేట్లో ముంచి, తను మాత్రం హాయిగా బ్రతుకుతున్న కాము కుడు. నీచుడు. తను మాత్రం ఎందుకు సుఖపడకూడదు! ఎలా? తాతారావ్ చెప్పినట్టు, కమలాకరంతో సంబంధం పెట్టుకొని...ఉలిక్కిపడింది. ఛీ.ఛీ.మరింత దుఃఖం ముంచుకొచ్చింది. సాయంత్రం వరకూ అలాగే వుండిపోయింది. మధ్యలో రావమ్మ రెండు మూడు సార్లు భోజ నానికి పిలిచినా వెళ్ళలేదు. మగతగా నిద్రపోయింది.

రావమ్మ లేపుతోంటే వులిక్కిపడి లేచింది. గదిలో లైటు వెలుగుతోంది. కళ్ళు నులుముకొని చూసింది. పక్కనే సాగర్ నిలబడి తనవైపు అదోలాచూస్తు న్నాడు.

"జయంతి గారూ!" కమలాకరం గొంతు విని చప్పున లేచి కూర్చుంది. గుమ్మం దగ్గర నిలబడివున్నాడు..మంచం దిగి నిలబడింది.

"జరిగినదానికి చాలా విచారిస్తు న్నాను. తాతారావు చేసినదానికి, నేను క్షమాపణ చెప్పుకొంటున్నాను" తప్పు చేసినవాడిలా అన్నాడు.

బలవంతంగా నవ్వినట్టు నవ్వి, నెమ్మ దిగా అంది. "మీరేం చేస్తారు"

"ఆయన కూతుర్ని నాకు కట్టబెట్టా లని ఆయన తాపత్రయం. ఒకోసారి భగవంతుడు పశువులుగా పుట్టించవలసిన వాళ్ళని పరధ్యానంగా, మనుషులుగా పుట్టిస్తాడనటానికి, తాతారావుగారు మంచి వుదాహరణ. అంతకంటే ఆయన గురించి ఏం చెప్పలేను. బాధపడకండి."

లేదన్నట్టు తలవూపింది. కమలాకరం నెమ్మదిగా బయటికి వెళ్ళిపోయాడు.



## 12

నాలుగయిదు రోజులు అదోలా వున్నా, తరవాత జయంతి తేరుకోగలిగింది.



మామూలుగానే సాగిపోతున్నాయి రోజులు.

"జీవితానికి అర్థం ఏమిటి?" ఒకరోజు మామూలుగా కబుర్లు చెప్పుకొంటూ హఠాత్తుగా జయంతి అడిగిన ప్రశ్నకు నివ్వెరపోయాడు కమలాకరం.

"మాట్లాడరేం?" మళ్ళీ అడిగింది. ఆమె గొంతులో పలుకుతున్న ఆసక్తి, కమలాకరానికి భయంగా అనిపించింది. సర్దుకున్నాడు.

"చాలామంది చాలా రకాల అర్థాలు చెప్పారు. కాని అసలు జీవితానికి అర్థం లేదు"

"ఇది మీరు చెప్పే అర్థమా?" నవ్వింది.

"కావచ్చు. అసలు జీవితానికి అర్థమేమిటని నిరంతరం తెలుసుకోడానికి ప్రయత్నించడమే జీవితానికి అర్థం"

"తెలుస్తుందా?"

"ఏమో! ఎవరికి తెలుసు. కొంతమంది తెలిసిందంటారు. కొంతమంది తెలుసుకోగలిగామంటారు. అది వారివారి నమ్మకం మాత్రమే"

"పోనీ జీవితానికీ, బ్రతుక్కీ యీ రెండు మాటలకూ వుండే తేడా చెప్పగలరా?"

"నాకు తెలిసినంతవరకూ చెప్పగలను. జీవితమంటే, ఒక ప్రాణి పుట్టిన దగ్గర్నించీ గిట్టేవరకూ వుండే మధ్యకాలం. బ్రతుకంటే ఆ జీవి జీవన విధానం. ఇది దేశ, కాల, నైసర్గిక స్వరూపాలమీద ఆధారపడి వుండేది."

"బ్రతుక్కి నిర్వచనం ఏమిటి?"

"బ్రతకడం"

"బ్రతకడమే బ్రతుక్కి నిర్వచనమైతే అది అందరూ చేస్తున్నదే" జయంతి సాలోచనగా అంది.

"మరోలా చెప్పాలంటే చుట్టూవున్న సాంఘిక పరిస్థితులకు లోబడి బ్రతకడం"

"అందరూ అలా బ్రతుకుతున్నారా?"

"లేదు. అది సాధ్యం కాదు. అలా జరిగితే, మనుషుల్లో పరిణామం లేకుండా ఆగిపోయేది. అందుకే బ్రతుక్కి మరో

అర్థం సంఘర్షణ"

జయంతి నవ్వేసింది... "మీరుచాలా కలగాపులగంగా చెబుతున్నారు"

కమలాకరం కూడా నవ్వేసిఅన్నాడు "జీవితం గురించీ, బ్రతుకు గురించీ ఆలోచిస్తే అలాగే వుంటుంది''

"నాక్కాస్త అర్థమయ్యేలా చెప్పండి"

"సరే అయితే ! సాంఘిక వ్యవస్థ కెప్పుడూ ఒక అస్పష్టమైన రూపం మాత్రమే వుంటుంది. ఎందుకంటే అది నిరంతరం పరిణామంచెందే దశల్లోనే వుంటుంది కాబట్టి. అంటే మానవుడు తను సృష్టించుకొన్న వ్యవస్థలోంచి తాను బయటపడ్డానికి చేసే నిరంతర ప్రయత్నం అది. అందుకే బ్రతుకు సంఘర్షణాత్మకం. సాంఘిక న్యాయంకంటే గొప్పదైన జీవన న్యాయం మానవుణ్ణి ఎల్లప్పుడూ సంఘర్షణకు లోనుచేస్తుంది. అదే మానవుని పరిణామానికి ప్రేరణ"

"అంటే?"

"అంటే! ఉదాహరణ చెప్పాలంటే ఇంతకు ముందు మన సాంఘిక వ్యవస్థలో, ఆడవాళ్ళు రెండో పెళ్ళి చేసుకోవడం నేరం, పాపం. కాని ఇప్పుడు సహజం, సాధారణం. ఎందుకని! యీ పరిణామానికి కారణం ఏమిటి ?... ఆడది కూడా మనిషేననీ, ఆమెకూ కోర్కెలూ మనసూ వుంటాయనే జీవన న్యాయాన్ని సంఘం అంగీకరించడమే"

జయంతి అతని మాటలు శ్రద్ధగా వింటోంది.

"వీరేశలింగం మొదలయిన మహానుభావులు ముందుకు రాకపోయినా, ఈ పరిణామం సహజంగా సమాజంలోకి వచ్చి వుండేదని నా నమ్మకం"

రెండు నిమిషాల తర్వాత జయంతి అడిగింది.

"అంటే మనిషి తన బ్రతుకును సుఖమయంగా చేసుకోడానికిపడే తాపత్రయమేనా సంఘర్షణంటే!"

"ఒక రకంగా అంతే"

జయంతి నవ్వి "మరో రకంగా అయితే!" అంది.

కమలాకరం ఆమె కళ్ళల్లోకి చూసి నవ్వి "అది మీరే ఆలోచించుకోండి" అన్నాడు.

ఆమె అతని వంక అర్థం కానట్టు చూసింది.



## 13

రమతే యమునా పులినవనే
విజయీ మురారిరధునా"

తలుపు తోసుకొని లోపలికొచ్చి, వెంటనే వెళ్ళిపోతున్న జయంతిని చూసి చటుక్కున టేప్ రికార్డర్ ఆఫ్ చేశాడు కమలాకరం.

"అరె వెళ్ళిపోతున్నారేం! రండి"

జయంతి వెనక్కి తిరిగి నవ్వింది. "మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యడం ఎందుకని"

"ఫరవాలేదు. రండి! ఇందులో డిస్టర్బెన్స్ ఏముంది!"

జయంతి వచ్చి ఎదురుగా వున్న ఫ్రేము కుర్చీలో కూర్చుంది.

"ఇంతకు ముందు ఇలాగే రెండు

మూడు సార్లు, మీరు యీ పాటలు వింటుండగా వచ్చాను. మీరు కళ్ళు మూసుకొని చాలా తన్మయత్వంగా వింటున్నారు. నేను రావడం, వెళ్ళడం కూడా గుర్తించలేదు మీరు. ఇప్పుడు కూడా అలాగే వెళ్ళిపోతున్నాను."

కమలాకరం నవ్వాడు.

"ఈ జయదేవుడి అష్టపదులంటే నాకు చాలా యిష్టం.ఎంతిష్టమంటే.."అని ఆగి నవ్వి "యిప్పుడు మీరు చెప్పారు గదా!..."

జయంతి కూడా నవ్వింది.

"మీ కిష్టమేనా ?"

"ఏమిటి?"

"అష్టపదులు"

ఇష్టమేనన్నట్టుగా తల వూపింది. "రేడియోలో వినేదాన్ని అప్పుడప్పుడూ. ఘంటసాల గారి గొంతు నాకు చాలా యిష్టం"

"ఇవి వింటున్నప్పుడు మీ కేమనిపిస్తుంది?" చప్పున అడిగాడు.

"భక్తి భావాన్ని ఎలా చెప్పినా పవిత్రంగానే వుంటుందనిపిస్తుంది"

కమలాకరం తృప్తిగా నిట్టూర్చాడు. 'నాకు పచ్చి శృంగారమనిపిస్తుంది' అన్న రాజ్యలక్ష్మి మాటలు గుర్తుకొస్తున్నాయి. భగవంతుడు కొంత మందిని తప్పుగా ముడేస్తాడు అనిపించింది ఆ క్షణంలో అతనికి.

"మీకు భగవంతుడి మీద నమ్మకముందా?" కమలాకరం అడిగాడు. జయంతి అతని వంక ఆశ్చర్యంగా చూసి రెండు క్షణాల తర్వాత అంది.

"ఉంది అని చెప్పలేను ... లేదనీ చెప్పలేను. పూజలూ అవీ చెయ్యడం అలవాటు లేదు. కాని యీ సమస్త సృష్టి వెనకాల ఏదో అదృశ్య హస్తం వుందని అనిపిస్తుంటుంది. దాని మీద నమ్మకముంది"

"నేనూ అంతే" కమలాకరం అన్నాడు.

జయంతి అతని మొహంలోకి చూసింది. అతని కళ్ళల్లో తన పట్ల ఏదో ఆరాధనా భావం తరచుగా కనబడుతోంది యీ మధ్య,

"ఈ వేళ పనేంలేదా ?" అతని చూపులు తప్పించుకొంటూ అంది.

లేదన్నట్టు తల అడ్డంగా వూపాడు.

"తాతారావుగారు డైరెక్టర్స్ మీటింగ్ ఏర్పాటు చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు. ఎందుకో తెలుసా?"

"ఎందుకో?" అతని పేరు వినగానే జయంతికి ఒళ్ళంతా పాములు పాకుతున్నట్టనిపించింది.

"నాకు వార్నింగ్ ఇప్పించడానికి"

"దేనికి?" అర్థంకానట్టు అడిగింది.

"మొన్న జరిగిందానికి."

"అదేమిటి! యిందులో మీరు చేసిందేముంది. ఆయన నన్ను అన్నాడు, నేను ఆయన్ని అన్నాను. మధ్యలో మీ కేమిటి?"

"ఆ మరునాడు నేను ఆయనింటికి వెళ్ళాను"

''వెళ్ళి"...అనుమానంగా అడిగింది.

''చెయ్యి చేసుకోవడం మినహా అంతా చేశాను''

జయంతి భయంగా చూసింది అతని వంక.

''ఎందుకు చేశారలా?"

"లేకపోతే నా యింటికొచ్చి, నా మనిషిని నానా మాటలూ అనడానికి వాడి

కెన్ని గుండెలుండాలి. పెద్దవాడై పోయాడు గాని లేకపోతే....''

కసిగా అంటున్న అతనివైపు భయంగా చూసింది.

''నేను...నేను...మీ మనిషినా?"

జయంతి ప్రశ్నకు వులిక్కిపడ్డట్టు తలతిప్పి ఆమె కళ్ళల్లోకి చూశాడు.ఆమె కళ్ళు లీలగా తడిదేరి వున్నాయి. నెమ్మదిగా తల వంచుకొని అన్నాడు

"మీరు నాయింట్లో వున్నారు. మీ మంచి చెడ్డలు నావికావా?"

జయంతి చాలా సేపు మాట్లాడలేదు. చివరికి అడిగింది.

''మీటింగ్ పెట్టి ఏం చేస్తారు?''

''బహుశా!నన్ను తాతారావుకి క్షమాపణ చెప్పుకోమంటారు!''

''చెప్పకపోతే?''

''వుద్యోగం తీసెయ్యొచ్చు! లేకపోతే తీవ్రమైన హెచ్చరికతో వదిలేయొచ్చు''.

జయంతి బాధగా అంది''కమలాకరం గారూ ఎందుకు నా గురించి మీకింత బాధ. నేనెవర్ని? మీరెవరు?? మీ కిన్ని ఇబ్బందులు నా గురించే...నన్ను క్షమించండి."

''ఛ...ఛ'' వారిస్తున్నట్టు అన్నాడు. మీరనుకోవడం తప్పితే నిజానికిది సమస్య కాదు - యిది తాతారావుకి నాకూ చాలా కాలం నుంచి ఉన్న అకారణ శతృత్వం. దీంట్లో యధాలాపంగా మీరు యిమిడారంతే'' అనునయిస్తున్నట్టు చెప్పాడు.

జయంతి అతని వంక తదేకంగా చూస్తూ వుండిపోయింది.

మళ్ళీ కమలాకరమే మాట్లాడ్డం మొదలు పెట్టాడు.

''మీరనవసరంగా ఆలోచించి బాధపడకండి. యిన్నాళ్ళూ కంపెనీ అభివృద్ధి కోసం అహర్నిశలూ కృషి చేశాను. ఆ కృతజ్ఞత వాళ్ళకు లేకపోయిం తర్వాత యీ వుద్యోగం నాకున్నా ఒకటే లేకపోయినా ఒకటే.''

''వుద్యోగం మానేస్తారా!'' కంగారుగా అంది. తన కారణంగా పరిస్థితులు అంత వరకూ పరిణమించడం జయంతికి యిష్టం లేదు.

"అంతవరకూ వస్తుందనుకోను... వచ్చినా బాధలేదు. ఇంతవరకూ విశ్రాంతి లేకుండా పనిజేశాను. నేను సంపాదించింది నాకు చాలు. హాయిగా యేదో బిజినెస్ చేసుకుంటాను. నాకు చాలా శాంతిగా వుంటుంది. నిన్నటితో నాకో సమస్య వదిలిపోయింది".

"ఏమిటది?"

"కోర్టు రాజ్యలక్ష్మి నుంచి విడాకులు మంజూరు చేసింది" చాలా సాధారణంగా చెప్పాడు.

"నిజమా?" విస్మయంగా అడిగింది.

"అవును. ఆమె గొడవ పెడుతుందనుకున్నాను. చాలా ప్రశాంతంగా యే షరతులూ, మినహాయింపులూ లేకుండా జరిగిపోయింది. మనోవర్తి కూడా కోరలేదు".

"అదేమిటి?"

కమలాకరం అదోలా నవ్వాడు... "ఆమెకే బోలెడంత డబ్బుంది. నా నీచమయిన డబ్బు ఆవిడకెందుకు".

"రాజ్యలక్ష్మిగారికి వెనకాల యెవరూ లేరా?" చాలా కాలంనుంచి తెలుసుకోవాలనుకుంటున్న సమాచారం, కుతూహలంగా అడిగింది జయంతి.

"ఎందుకు లేరు ? తల్లి మాత్రమే

వుంది. ఆమె రోగిష్టి. లేవలేదు. మిగిలిన వాళ్ళంతా బంధువులు. ఈవిడొక్కతే సంతానం. తోబుట్టువులెవరూ లేరు. అనకాపల్లిలో దాదాపు యాభై ఎకరాల మాగాణి వుంది. ఆ భూముల వ్యవహారం ఆవిడ బంధువులే చూస్తారు. రాజ్యలక్ష్మి నాతో కలసి వుండడానికి వాళ్ళు కూడా యిష్టపడరు".

"ఏం...ఎందుకని!"

"వాళ్ళకు ఆహారం కరువైపోతుంది అని".

స్థూలంగా రాజ్యలక్ష్మి గురించి అర్థమైంది జయంతికి. మరో అయిదు నిమిషాలు అలాగే యేవేవో మాట్లాడుకున్న తర్వాత జయంతి లేచి నిలబడింది.



## 14

"మిమ్మల్ని పొగుడుతున్నానని మీరు అనుకోపోతే నేనో మాట చెబుతాను" జయంతి టైప్‌చేసి యిచ్చిన కాగితాన్ని మళ్ళీ మరోమారు పరిశీలిస్తూ అన్నాడు కమలాకరం.

"అంటే మీరిప్పుడు నన్ను పొగడబోతున్నారన్నమాట !" జయంతి నవ్వింది.

కమలాకరం నవ్వి "అలా అనుకోపద్దంటున్నానుగా!" అన్నాడు.

"అదే అయినప్పుడు అనుకోకుండా యెలా వుండను! పైగా ముందే హెచ్చరిస్తున్నారాయె!"

"అలా అనుకుంటే నేనేమీ చెప్పలేను"

"సర్లెండి ! నేనేమీ అనుకోను. చెప్పండి"

"ఉత్తరాలు రాయడం గొప్ప కళ అంటారు చాలామంది".

"ఉత్తరాలు రాసేవాళ్ళందరూ కళాకారులన్నమాట!"

కమలాకరం కాస్త గట్టిగా నవ్వాడు. "ఐ మీన్...అందంగా, ఆసక్తికరంగా ఉత్తరాలు రాయడం"

జయంతి నవ్వుతూ అలాగా అన్నట్టు తలూపింది.

"మామూలుగా పర్సనల్ లెటర్స్ రాయడంలోనే, అంతటి కళాత్మకతకు అవసరమూ, అవకాశమూ వుంటాయనుకునేవాణ్ణి. కానీ యీమధ్య మీరు టైపు చేస్తున్న ఉత్తరాలు చూస్తుంటే, నా అభిప్రాయం మార్చుకోవలసి వస్తోంది".

"అదేమిటి ?"

"కంపెనీ లెటర్సు కూడా యింత అందంగా రాయొచ్చనీ, అలా రాస్తే దానివల్ల బిజినెస్‌కు కొంత ప్రయోజనం వుందనీ అర్థమైంది".

"అహా!"

"నిజం...మీ భాష, మీ కనస్ట్రక్షన్ రియల్లీ సుపర్బ్!"

జయంతి గట్టిగా నవ్వింది... "ఇక్కడితో మీరు ఆ విషయం చెప్పడం ముగిస్తే, నాకు చాలా సంతోషంగా వుంటుంది".

కమలాకరం ఆమె వైపు అభినందిస్తున్నట్టు చూసి "ఆల్‌రైట్" అన్నాడు.

"ఇంకా ఏమైనా వున్నాయా?"

లేవన్నట్టు, అడ్డంగా తలాడించాడు

కమలాకరం. కాగితాలు ఫైల్లో పెట్టేసి డ్రాయర్ సొరుగులో పెట్టి టైప్‌రైటర్ లోపల పెట్టేశాడు. ఆ తర్వాత ఫ్లాస్క్‌లో టీ, పక్కనే వున్న కప్పు లోకి వంచుకున్నాడు.

జయంతి ఎప్పుడోగాని రాత్రిళ్ళు టీ తాగదు. అతను టీ తాగడం ముగించే వరకూ చూసి, జయంతి లేచి నిల బడింది.

''వెళ్ళి పోతున్నారేం ?''

"పనేమీ లేదన్నారుగా !" అని తిరిగి కుర్చీలో కూర్చుని "యివాళ చదువుకోడానికి పుస్తకాలు కూడ ఏమీ లేవు. పోనీ కాసేపు ఏదైనా చెప్పండి."

కమలాకరం ఆమె వంక ఒక్క క్షణం పాటు కాస్త ఆశ్చర్యంగా చూశాడు. ఆమె కళ్ళల్లో ఈ మధ్య తనకర్థం కాని చనువేదో కనపడుతోంది. జయంతి నవ్వినట్టనిపించి తప్పున తేరుకొని అన్నాడు.

"ఏదైనా కాదు. మీకు చెప్పవల సింది ఒక ముఖ్యమైన విషయం వుంది"

జయంతి కుతూహలంగా చూసింది చెప్పమన్నట్టు.

"మీరెప్పుడైనా సింహాచలం వెళ్ళారా ?"

జయంతి కొద్దిగా వులిక్కిపడింది. సింహాచలం...మళ్ళీ అంతలోనే ఆశ్చర్య పడింది, తనంతగా వులిక్కి పడ్డానికి ప్రత్యేకమైన కారణం ఏమీ లేదు. కాక పోతే, సింహాచలం పేరు చెబితే రాజా రావు గుర్తుకొస్తాడు. మొదటి సారిగా అతనితోనే కలసి వెళ్ళింది సింహాచలం.

"మాట్లాడరేం...మీరెప్పుడూ వెళ్ళ లేదా ?"

"వెళ్ళాను... ఒకేసారి" తడబాటు కనిపించకుండా అంది జయంతి.



"సింహాచలం అంటే మీ కిష్టమేనా?"

అతనెందుకా ప్రశ్న అడుగుతున్నాడో జయంతికి అంతు బట్టలేదు.

"ఇష్టమంటే! అందులో యిష్టమేముంటుంది !"

"అహఁ...అది కాదు. కొన్ని ప్రదేశాలు కొంత మందికి బాగా నచ్చుతాయి. వాటిని మళ్ళీ మళ్ళీ చూడ్డానికి యిష్టపడతారు" వివరిస్తున్నట్టుగా అన్నాడు.

"చెప్పాను కదా! ఒకేసారి వెళ్ళానని! నాకు బాగానే నచ్చింది" అని ఆగి ఏదో గుర్తుకు తెచ్చుకుంటున్నట్టుగా కళ్ళు అటు యిటూ కదిలించి నెమ్మదిగా అంది

"అయితే మళ్ళీ చూడాలనిపించలేదు."

"పోనీ మళ్ళీ చూడ్డానికి మీకు అయిష్టమేమీ లేదుగా ?"

"ఇష్టమూలేదు. అయిష్టమూ లేదు."

కమలాకరం రెండు క్షణాలు ఏదో ఆలోచించినట్టుగా నిశ్శబ్దంగా వున్న తర్వాత అన్నాడు

"అవసరమైతే, మళ్ళీ మీరు మరోసారి సింహాచలం వెళ్ళగలరా !"

"అవసరమైతేనా?...దేని గురించి!"

"దేని గురించయినా !"

జయంతి నవ్వి "ఎందుకు వెళ్ళను. హాయిగా వెళతాను'' అంది.

"ఆల్ రైట్. అయితే మీరు ఎల్లుండి సింహాచలం వెళ్ళాలి.''

"దేనికి !''

"ఎల్లుండి నుంచి అక్కడ దేవుడి ఉత్సవాలు జరుగుతాయి.''

"అయితే నేనెందుకు ?'' అర్థం కానట్టు అడిగింది.

''ప్రతి సంవత్సరం సాగర్‌ను తీసుకెళ్ళడం అలవాటు. ఈ సారి నాకు అసలు తీరుబడి లేదు. మీరు సాగర్‌ను తీసుకొని, సింహాచలం వెళ్ళండి. మరీ అంత అవసరం కాదనుకోండి. ఈ మధ్య సాగర్‌ను ఎక్కడికి తీసుకెళ్ళడం లేదు. ప్లీజ్...''

అభ్యర్థిస్తున్నట్టన్నాడు. జయంతి యిబ్బందిగా కదిలింది, అతని ప్రాధేయపూర్వకమైన మాటలకు. వారిస్తున్నట్టుగా అంది

''దానికేముంది... అలాగే వెళతాను.''

''థాంక్యూ... ఎల్లుండి ఉదయమే యిక్కడ్నించి మిమ్మల్ని కారులో పంపిస్తాను. మిమ్మల్ని డ్రాప్ చేసి, కారు వెనక్కి వచ్చేస్తుంది. మీరు ఆ వేళ రాత్రి అక్కడే వుండి. మర్నాడు వుదయమే వచ్చేయండి. మళ్ళీ కారు పంపిస్తాను. లేకపోతే మీరు బస్సులో వచ్చినా సరే.''

జయంతి అలాగే అన్నట్టు తలూపింది.

"ఆ రాత్రి మీరు అక్కడ దేవస్థానం సత్రంలో వుండొచ్చు. ఫోన్‌చేసి గది బుక్ చేయిస్తాను".

"ఎందుకు. నేను గది తీసుకోగలను. ఒకసారి వెళ్ళానుగదా!"

"తీసుకోలేరని కాదు. ఉత్సవాలు జరుగుతున్నాయి కదా, బాగా రష్‌గా వుంటుంది. ఖాళీ వుండకపోవచ్చు... నాకు తెలిసినవాళ్ళొకరున్నారు. ఫోన్‌చేసి యివాళే గది బుక్ చేయిస్తాను".

"మీ యిష్టం"

"మీకూడా డ్రయివరొస్తాడు, అక్క





దేమైనా కావలిస్తే అన్నీ యేర్పాట్లుచేసి వచ్చేస్తాడు".

"అలాగే"

కమలాకరం టైంపీస్‌వంక చూశాడు. "అబ్బా!...పదిన్నరై పోయింది. మీకు నిద్రొస్తుందేమో పడుకోండి".

జయంతి నవ్వి "మీకు రావడం లేదా?"

కమలాకరం కాస్త గట్టిగా నవ్వి, "పని లేకపోయినా పాత అలవాటు పోవడంలేదు" అన్నాడు. జయంతి లేచి నిలబడింది.

"గుడ్‌నైట్!"

"గుడ్‌నైట్!"

జయంతి బైటికి నడిచింది. తన గదికి వెళ్ళేసరికి గదిలో బెడ్‌రూమ్ లైటు వెలుగుతోంది. చాపమీద రావమ్మ, మంచంమీద సాగర్ గాఢంగా నిద్ర పోతున్నారు. సాగర్‌ను కొద్దిగా పక్కకు సర్ది, మంచినీళ్ళు తాగి, అతని పక్కనే పడుకొంది. బెడ్‌రూమ్ లైటు వెలుగులో సాగర్ మొహం అందంగా, ముద్దుగా ఉంది. సుతారంగా వేళ్ళతో, నుదుటి మీద పడుతున్న అతని జుట్టు సవరించింది. సాగర్‌కు యింకా యీ ప్రయాణం విషయం తెలీదు. తెలిస్తే ఎగిరి గంతేసాడు. జయంతి నవ్వుకొంది. అంతలోనే నిట్టూర్చింది. ఈ మధ్య సాగర్ మరీ దగ్గరయి పోయాడు తనకు. తనకు తెలీకుండానే ఏదో ఆత్మీయత పెరుగుతోంది. ఏమిటి కారణం! దాదాపు తామిద్దరూ ఒకే రకం దురదృష్టవంతుల మవడం వల్లా? వుహుఁ ఒకరి కారణంగానే తమకీ పరిస్థితి యేర్పడింది. అయినా సాగర్ తనకు దగ్గరవడానికి కారణం అంతరాంతరాల్లోంచి పైకి వుబికి జయంతికి అర్థమవుతోంది. చాలా సార్లు తనకు యిటు వంటి భావనలు కలిగాయి. సాగర్‌ను మొదటిసారి చూసినప్పుడు కలిగిన ఏదో అవ్యక్తమైన అనుభూతే ఎప్పుడూ కలుగుతోంది .... తను పొందలేనిది, పోగొట్టుకొన్నది ఏదో దొరికినట్టు. ఒకోసారి తను పెంచుకొంటున్న ఆత్మీయత ప్రమాదకరమేమో అనిపించి నిరాశ కలుగుతోంది. తను ఈ యింట్లో ఎంత కాలముంటుంది ! యిది తనకు శాశ్వతం కాదు. ఎప్పుడో ఒకప్పుడు యిక్కణ్ణించి వెళ్ళిపోక తప్పదు. ఎందుకో...ఎలాగో.. అన్ని విషయాలూ వూహకు రాక పోయినా, వెళ్ళిపోక తప్పదని తెలుసు. అప్పుడు ఈ ఆత్మీయత అత్యంత బాధాకరంగా పరిణమిస్తుంది. తప్పదు! అయినా దీని పెరుగుదల అనివార్యమై పోయింది. దీనికి కారణం చాలా వరకూ సాగర్. కమలాకరం ఒకసారి అన్నట్టు సాగర్ తనలో రాజ్యలక్ష్మిని దర్శిస్తున్నాడా? ఏమో? అలా అయితే కమలాకరం కూడా? ఈ వూహ రాగానే జయంతి అదోలాఅయిపోయింది.సాగర్ పట్ల తను చూపిస్తున్న అనురాగం. ప్రయత్నపూర్వకమైనది కాదు. అప్రయత్నంగా, సహజంగా, తన గుండెల్లోంచి ఎగదన్ను కొస్తున్న అభిమానమది. ఎవరి గురించో ఎందుకు! తను అపురూపంగా, తరగని నిధిలా నిక్షిప్తం చేసుకున్న ప్రేమానురాగాలవి. ఎంత అణుచు కొందామన్నా ఆగని అమృత ప్రవాహమది. సాగర్‌ను ఎప్పుడు చూసినా, తనెప్పుడో నిర్మించుకొన్న అస్పష్టమైన రూపం అతనిలో కదలాడు

తుంది. బొద్దుగా తెల్లగా అందంగా తన బాబు బ్రతికి యీ వయసొస్తే దాదాపు సాగర్ లాగే వుండే వాడేమో? ఏమో కనీసం ఒక్కసారి చూడ్డానికైనా నోచుకో లేదు తను. ఊహా చిత్రం తప్ప నిజంగా తనకు పుట్టిన వాణ్ణి చూసుకోడానికి తనకు అవకాశం లేకపోయింది. తన బ్రతుకు నుంచి పూర్తిగా ఆ అదృష్టాన్ని దూరం చేశాడు రాజారావ్. జయంతి హృదయ బాధగా మూలిగింది. పలుచటి నీటిపొర కళ్ళ నిండుగా ఆవరించుకొని, సాగర్ మొహం అస్పష్టంగా కనిపిస్తోంది. సాగర్ నవ్వుతున్నట్లై, జయంతి రెండు మూడు సార్లు కనురెప్పలు టపటప లాడించి చూసింది. నిద్రలో నవ్వుకొంటున్నాడు సాగర్. ప్రశాంతమైన మొహం. ప్రపంచంలో వున్న శాంతిని కదలకూడా అదిమి పెట్టిన కనురెప్పలు విశ్రాంతిగా మూసుకొని వున్నాయి. అస్పష్టంగా ఏదో కలవరించాడు. సాగర్ మీద ఏదో వాత్సల్య భావం పొంగి పొరలి...జయంతి అతనికి మరింత దగ్గరగా జరిగి, అతని మీద చెయ్యివేసి కళ్ళు మూసుకొంది.



## 15

"డాడీ భలేచేశారు మేడమ్! అసలు నాకు చెప్పలేదు. సింహాచలమంటే భలే యిష్టం నాకు" సాగర్ వుత్సాహంగా అన్నాడు.

కారులోంచి వేగంగా వెనక్కి పరుగెడుతున్న చెట్లనీ, కొండల్నీ చూస్తూ అలాగా అన్నట్టు తలూపుతోంది జయంతి.

"సోమరాజూ! యింకా స్పీడుగా పోనివ్వాలి" ముందుకు వంగి డ్రైవర్‌కు ఆజ్ఞాపిస్తున్నట్టు చెప్పి సీటు వెనక్కి దర్జాగా జారబడ్డాడు సాగర్. జయంతి చటుక్కున తలతిప్పి "వద్దు సోమరాజూ! యిలాగే పోనీ" అంది. డ్రైవరు నవ్వాడు "లేదమ్మా! పెదబాబుగారు కారులో లేకపోతే చినబాబుగారు ఇలాగే అంటారు. పెదబాబుగారు మాత్రం నలభై కిలోమీటర్లు దాటివెళ్ళొద్దంటారు''.

"ఎందుకని! డాడీకి భయమా!" సాగర్ నవ్వాడు. జయంతి అతని వంక అలా అనొచ్చా అన్నట్టు కళ్ళు పెద్దవి చేసి చూసింది.

"భయంకాదు చినబాబూ! అంతకంటే స్పీడుగా వెళితే కారు తొందరగా దెబ్బ తినేస్తుందని"

"ఓహో!" అన్నాడు సాగర్ ఏదో అర్థమైనట్లు. జయంతివైపు తిరిగి,

"మేడమ్! మీకు స్పీడుగా వెళ్ళడమంటే భయమా?" అనడిగాడు.

జయంతి అవునన్నట్టు తలూపింది.

"ఎందుకు భయం?"

సాగర్ ప్రశ్నకు సమాధానం ఏం చెప్పాలో తోచలేదు జయంతికి. కాస్సేపు ఆలోచించి అతన్నే అడిగింది.

"నీకు ఎక్కువ స్పీడుగా వెళ్ళడం అంటే యిష్టమా?"

"అవును మేడమ్"

"ఎందుకని!"





"ఎందుకంటే..." అని ఏదో చెప్పబోయి, ఏం చెప్పాలో తెలియనట్టు తడుముకొని "ఎందుకంటే స్పీడుగా వెళ్ళిపోతుంటే. అదోలాగ వుయ్యాల వూగుతున్నట్టు... అదేదో బావుంటుంది మేడమ్" చెప్పలేక చెబుతున్న అతన్ని చూసి జయంతి ఫక్కుమని నవ్వింది. సాగర్ ఏదో చెబుతుంటే ఆమె పరధ్యానంగా దూరాన కనిపిస్తున్న యెత్తైన కొండలకేసి చూస్తుండిపోయింది...యుగయుగాల్నించి తపస్సులో లీనమైపోయిన వృద్ధ ఋషుల్లా గంభీరంగా వున్నాయి. వాటిని చూస్తుంటే, రాజారావ్ గుర్తుకొస్తున్నాడు జయంతి నిట్టూర్చి,చూపులు తిప్పేసుకొంది. మరో పావుగంటకు సింహాచలం చేరుకొంది కారు. యాత్రికులతో చాలా రద్దీగా వుంది. ఎక్కడ చూసినా జనం. రకరకాల మనుషులు. రకరకాల వేషాలు. అన్ని వయసులవాళ్ళు అంతా గోలగోలగా వున్నట్టు ఏదో అంతర్వాహినిగా పొంగుతున్న ఉత్సాహం కనిపిస్తోంది. జయంతి అటూ యిటూ చూసి ఎంత జనం! అనుకొంది. రాజారావ్‌కు యిలా తొడ తొక్కిడిగా జనంతో మహా రద్దీగా వున్న ప్రదేశాలంటే చాలా యిష్టం. తనకు అంతగా యిష్టమనిపించదు.

కారు దేవస్థానం సత్రం ముందు ఆగింది. కారును కొద్దిగా పక్కకు పోనిచ్చి ఆపాడు సోమరాజు. డోర్ తెరుచుకొని కిందికి దిగాడు.

"ఇప్పుడే వచ్చేస్తాను. కాస్సేపు కూచోండమ్మా" అన్నాడు.

"ఎక్కడికి!" అడిగింది జయంతి.

"రూం నెంబరెంతో అడిగొస్తాను"

"మేమూ వచ్చేస్తాం" సాగర్‌కు హుషారు ఆగటంలేదు.

"వద్దు బాబూ. చూడండి, జనం ఎంత రద్దీగా వున్నారో. కౌంటర్‌లో మనకు తెలిసినాయన ఒకరున్నారు. ఆయనే మనకు గది బుక్ చేసింది."

"తొందరగా వచ్చెయ్" జయంతి అంది.

సోమరాజు తలూపి లోపలికి పరుగెత్తాడు.

సాగర్ కారులోంచి అటూ యిటూ చూస్తున్నాడు.

"ఏయ్ ఇలారా!" సాగర్ తప్పట్లు ఎవరినో పిలవబోతుంటే జయంతి చటుక్కున ఆపుచేసింది.

"ఎవర్ని పిలుస్తున్నావ్!"

"అదిగో అతన్ని" చూపించాడు.

జయంతి చూసింది. వెదురు బొంగుకు అడ్డంగా కర్రలు కట్టి, వాటికి బుడగలు బూరాలు, రిబ్బన్లు, దువ్వెనలు, యింకా యితరమైన చిన్నచిన్న ఫాన్సీ సామాన్లు వేలాడదీసి, దాన్ని భుజం మీద పెట్టుకొని అమ్ముతున్నాడు. అతని భుజాన సంచీ...యిద్దరు ముగ్గురు పిల్లలు కొనుక్కుంటున్నారు. అతని చేతిలోవున్న చిన్న పంపుతో బుడగల్లోకి గాలి నింపి, వాటిని రకరకాల ఆకారాల్లోకి మార్చి యిస్తున్నాడు. ఆపిల్ పళ్ళలాగ, ద్రాక్షగుత్తులుగానూ చేస్తున్నాడు. సాగర్ విచిత్రంగా చూస్తున్నాడు.

"కావాలా?" అడిగిందామె.

అవునన్నట్టు హుషారుగా తల వూపాడు.

"ఇప్పుడొద్దు. కొండమీద కొనుక్కుందాం. ఏం?" అని సాగర్ నిరుత్సా

హంగా మొహం పెట్టడంతో "సరే అయితే పిలు!" అంది.

సాగర్ చప్పట్లు కొట్టి పిలిచాడు. అవి అమ్ముతున్న మ ని షి కారు దగ్గర కొచ్చాడు.

రెండు ఆపిల్ పళ్ళలాగ వున్న బెలూన్లు, రెండు ద్రాక్ష గుత్తుల్లాంటివి, మరోటి దాదాపు చెవుం పిల్లిలా వున్నది, రెండు వెదురు బూరాలు తీసుకున్నాడు. డబ్బుల కోసం హేండ్ బాగ్ తెరవబో తుంటే సాగర్ అన్నాడు —

"మేడమ్...డబ్బు నా దగ్గర వుంది. డాడీ యిచ్చారు".

"అహఁ...అలాగా! యెంతిచ్చారు?" అంటూ హేండ్ బాగ్లోంచి అయిదు రూపాయల నోటు తీసి అమ్మే అతనికి యిచ్చింది. మిగిలిన చిల్లర యిచ్చి వెళ్ళి పోయాడు. చిల్లర హేండ్బాగ్లో వేసు కొంది.

వెనక అద్దం దగ్గర వున్న బ్రీఫ్ కేస్ ఒళ్ళో పెట్టుకొని తెరవడానికి ప్రయ త్నిస్తున్నాడు సాగర్.

"అందులో ఏముంది? ఎందుకు?" జయంతి అడిగింది. తనని ఓ చీర, జాకెట్, సాగర్కు ఓ జత బట్టలు, రెండు రుమాళ్ళు, టూత్ బ్రష్, మొదలయిన చిన్నసామాన్లు తప్ప ఏంలేవు.

సాగర్ బ్రీఫ్ కేస్ తెరిచాడు. మూతకు లోపలివైపు అరలా వున్న సిల్కుగుడ్డ వెనకనుంచి వందరూపాయల కాగితం తీసి జయంతి చేతిలో పెట్టాడు.

"ఏమిటిది?"

"డాడీ యిచ్చారు...అన్నీ కొనుక్కో డానికి. మీకిమ్మన్నారు".

"నాకు దేనికి?"

"ఏమో! నా దగ్గరెందుకు?" అంటూ బ్రీఫ్ కేస్ మూసి వెనక పెట్టేశాడు. జయంతి వందరూపాయల నోటు హేండ్ బాగ్లో పడేసి జిప్ లాగింది. సోమరాజు పరుగెత్తుకొచ్చాడు.

"రండమ్మా! మేడమీది గది" అంటూ వెనక డోర్ తీసి పట్టుకొని బ్రీఫ్ కేస్ అందుకున్నాడు. చేతిలో బెలూన్లు పట్టుకొని ముందు సాగర్, వెనక జయంతి దిగారు. సోమరాజు వెనకాల యిద్దరూ నడిచారు. కౌంటర్ దగ్గర చాలా రద్దీగా వుంది. మేడ మెట్లెక్కి పైకి వెళ్ళారు. వరుసగా వున్నాయి గదులు. పొడవుగా వున్న వరండామీద, గదుల్లో వుండేవాళ్ళ చంటిపిల్లలు, గోలగా తిరుగు తున్నారు. వరండా నిండా జనం చిందర వందరగా విసిరేసిన సామానులాగా నిద్రపోతున్నారు. కొంతమంది రుమాళ్ళు పరుచుకొని నిద్రపోతున్నారు. కొంత మంది యేమీ లేకుండా నిద్రపోతున్నారు. కొంతమందికి బోడిగుండ్లు. అడ్డదిడ్డంగా నిద్రపోతున్న మనుషుల్ని జాగ్రత్తగా తప్పించుకొంటూ నడుస్తున్నాడు సోమ రాజు...అతని వెనక జయంతి...సాగర్ అదోలా వరండా అంతా చూస్తూ నడు స్తున్నాడు. చివరగా వున్న గదిదగ్గర ఆగి, తాళం తెరిచాడు సోమరాజు. పక్కగది తాళంవేసి వుంది. జయంతి, సాగర్ లోపలికి నడిచారు. గది బాగానే వుంది అనుకొంది జయంతి. క్యాంప్కాట్ లాంటి చెక్కమంచం, మూలగా చిన్న టేబిల్, అద్దం, సీలింగ్ ఫాన్, అద్దాల కిటికీలు.

"దుప్పట్లు, తలగడలు తీసుకొస్తా నమ్మా" అన్నాడు సోమరాజు.

"అవును, అన్నట్టు మరిచేపోయాను





కారులో వెయ్యడం" పొరబాటు చేసినట్టు అంది జయంతి.

"ఎందుకమ్మా...అక్కణ్ణించి పట్టు కొస్తే మళ్ళీ రేపు మీరు బస్సులో రావలసి వస్తే తీసుకురావడం కష్టంకదా!"

"అందుకని!"

"పెదబాబుగారు అవన్నీ యిక్కడే గది బుక్ చేయించినాయన్నే పురమాయించమన్నారు. వెళ్ళి పట్టుకొస్తాను"అని చెప్పి బయటకు వెళ్ళిపోయాడు.

కమలాకరం అన్నీ జాగ్రత్తగా ముందే ఆలోచిస్తాడేమో అనుకొంది జయంతి.సాగర్ మంచంమీద కూర్చొని, వెదురు బూరామీద యేదో పాట పలికించడానికి ప్రయత్నిస్తున్నాడు. స్పష్టంగా లేదుకాని శబ్దం వినసొంపుగానే వుంది. జయంతి అతని పక్కనే కూచుంది. ఊదుతున్న బూరా నోట్లోంచి తీసి జయంతి వంక చూసి నవ్వాడు.

"వాడు యించక్కా వూదాడు. నాకు రావడంలేదు మేడమ్" అన్నాడు.

"ఒక్కసారిగా వచ్చేస్తుందా ? నెమ్మదిగా నేర్చుకోవాలి మరి"

సాగర్ అలాగా అన్నట్టు తలూపి బూరా మళ్ళీ నోట్లో పెట్టుకోబోతూ ఆగి యేదో గుర్తొచ్చినట్టు అన్నాడు, "మేడమ్ యింతకు ముందొచ్చినప్పుడు యిలాంటి బూరా కొనుక్కున్నాను. ఊదుతుంటే మమ్మీ చిరాకుపడి బయటకు విసిరేసింది" గబగబా చెప్పి, మళ్ళీ నోట్లో పెట్టుకొని వూదడం ప్రారంభించాడు.

రెండు దిళ్ళు, రెండు దుప్పట్లు పట్టు కొచ్చాడు సోమరాజు.

"లేవండమ్మా పరుస్తాను" అన్నాడు.

"అక్కర్లేదు. అక్కడ పెట్టెయ్.నేను వేసుకుంటాన్లే" అంది జయంతి.

దుప్పట్లూ, దిళ్ళూ టేబిల్ మీద పెట్టాడు సోమరాజు.

"మధ్యాహ్నం మీకు భోజనం కావాలా ?" అడిగాడు.

జయంతి రెండు క్షణాలు ఆలోచించి "అక్కర్లేదు. కొండ మీద తినేస్తాం"

"సరే అయితే సాయంత్రానికి క్యారేజీ తీసుకొస్తాడు మనిషి. మీ కింకా ఏమైనా కావలిస్తే చెప్పండి"

"ఇంకేమున్నాయి. ఏమీలేవు"

"ఈ వరండా చివర బాత్ రూముందమ్మా! కాసేపటికి మనిషి వచ్చి, ఇదిగో యీ కూజాతో నీళ్ళు పెడతాడు. మరి మిమ్మల్ని కొండమీద దింపి వెళ్ళిపోమంటారా?"

"ఏం సాగర్! పైకి కారులో వెళదామా ?"

"వద్దు మేడమ్!బస్సులోనే వెళదాం"

"నువ్వెళ్ళొచ్చు రేపు మేం బస్సులో వచ్చేస్తాంలే" అంది జయంతి.

సోమరాజు సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. కాసేపటికి, దాదాపు నలభై ఏళ్ళ మనిషి వచ్చి, కూజాతో నీళ్ళు పెట్టి, గాజు గ్లాసు పెట్టి వెళ్ళిపోయాడు.

మరో పావుగంటలో గదికి తాళం వేసుకొని జయంతి సాగర్ బయటకు వచ్చారు. జయంతి చేతిలో హేండ్ బాగ్, సాగర్ భుజాన వేలాడుతున్న స్కూల్ బాగ్ లాంటి రెక్సెన్ క్లాత్‌తో తయారైన సంచి...బెలూన్‌లు, బూరాలు గదిలోనే వదిలేశాడు. ఒక్క బూరా మాత్రం జేబులో వేసుకున్నాడు.

వరండా లోంచి నడుస్తుంటే "అబ్బ! ఏమిటి మేడమ్! వాసన" ముక్కు

మూసుకున్నాడు. అస్తవ్యస్తంగా కూచొని, పడుకొని వున్న జనాన్ని చూస్తూ "ష్...ష్...తప్పు అలా అనకూడదు" అంది జయంతి.

"ఎందుకు వాళ్ళంతా అలా పడుకున్నారు?" బయటకు వచ్చింతర్వాత అడిగాడు.

"ఎక్కణ్ణించో దూరాన్నుంచి వస్తారు గదా! రాత్రంతా నిద్రలేనట్టుంది" అంది.

బస్ స్టాండ్ చాలా రద్దీగా వుంది. టిక్కెట్లకోసం జనం యెగబడుతున్నారు అంత రద్దీ చూసిం తరవాత కారులోనే పైకి వెళ్ళిపోతె బావుండునేమో అనుకొంది జయంతి. టిక్కెట్ల కోసం క్యూ వున్నప్పటికీ జనం వత్తిడికి అస్తవ్యస్తమై పోతోంది. బలం కలవారికే టిక్కెట్లు అన్నట్టుంది పరిస్థితి. ఆ తొడ తొక్కిడిలోకి వెళ్ళడానికి జయంతికిమనస్కరించలేదు. అటూ యిటూ చూసింది. కాస్త పొడవుగా బలంగా కనిపిస్తున్న ఒక స్త్రీ ఆమెను ఆకరించింది. ముదురు వంగ పండు రంగు చీర, జాకెట్ లేని భుజాలు బలంగా కనిపిస్తున్నాయి. ముక్కులో నత్తు, చెవులకు పోగులు... దాదాపు ముప్పయ్ సంవత్సరాలుంటాయ్. మీద పడుతున్న మగాళ్ళను బండ బూతులు తిడుతూ పెద్ద కేకలు పెడుతూ అరుస్తోంది. ఆమె మాట చాలా యాసగా వుంది. జయంతి నెమ్మదిగా ఆమె దగ్గరకు వెళ్ళింది. రెండు టిక్కెట్లు తీసి పెట్టమని అడిగితే, జయంతిని కిందా మీద చూసి, ఏదో అనబోయి, ఎందుకనో ఆగి, డబ్బులకోసమన్నట్టుగా చెయ్యి చాపింది. చేతిలో వున్న అయిదు రూపాయల నోటు ఆమె చేతిలో పెట్టింది జయంతి. కొంగు నడుం చుట్టూ తిప్పి, యుద్ధానికి వెళుతున్న వీరుడిలా జనంలో కురికిందామె. జయంతి సాగర్ చెయ్యి పట్టుకొని కాస్త దూరంలో నిలబడింది. మరో పావుగంటకు ఆమె రొప్పుకుంటూ వచ్చి టికెట్లు, చిల్లర జయంతి చేతిలో పెట్టి, జయంతి ఏదో చెప్పబోతున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయింది. జయంతి ఆవిడనే ఆశ్చర్యంగా చూస్తుంటే, సాగర్




ఆమె చెయ్యి పట్టి లాగాడు. బస్సు బయలు దేరడానికి సిద్ధంగా వుంది. యిద్దరూ గబగబా బస్సెక్కి కిటికీ వారగా కూర్చున్నారు. బస్సు బయలు దేరింది. ఘాట్‌రోడ్ మీద బస్ వెళ్ళే కొద్దీ కిందనున్న యిళ్ళు, మనుషులూ, బాగా చిన్నవిగా అయిపోవడాన్ని సాగర్ ఆనందంగా చూస్తున్నాడు. జయంతి కూడా తదేకంగా తిలకిస్తోంది... యింకా మంచు లీలా మాత్రంగా స్ఫురిస్తున్న లోయల్ని చూస్తుంటే ఆమెకు రాజారావ్‌తో ఇదే రోడ్డుమీద చేసిన ప్రయాణం గుర్తుకొస్తోంది.. బరువుగా నిట్టూర్చింది. తప్పదు. సింహాచలమంటేనే తనకు రాజారావు స్మృతులమయం. వాటిని భరించడానికే తను సిద్ధపడి వచ్చింది.

తప్పదు భరించాలి. అసలు మనం దూరంగా పోవాలనుకుంటున్న భరించలేని అనుభవాల్ని, స్మృతుల్ని పదేపదే ఆలోచిస్తే వాటిని తట్టుకొనే శక్తి వస్తుందేమో అనిపిస్తుంది. తట్టుకోడమేగాని, మర్చిపోవడం మనిషికి అసాధ్యం...

"మేడమ్!" పిలుస్తున్నాడు సాగర్. వులిక్కిపడి చూసింది జయంతి.

సాగర్ నవ్వి "ఆలోచిస్తున్నారా!" మళ్ళీ నవ్వాడు.

జయంతి కూడా నవ్వింది.

"మేడమ్ బస్సులో అయితే ఇవన్నీ కనిపిస్తాయి. ఎత్తుగా వుంటుంది. కారులో అయితే కనిపించవ్ అదుగో అలా చూడండి పైనాపిల్... పైనాపిల్..."

జయంతి చూసింది. కొండవాలు కింద చాలా మేర వరసగా నాటిన అనాసతోట

"మేడమ్ యిలా చూడండి" అరుస్తున్నట్టు అన్నాడు.

"ష్...ష్ ఎందుకలా కేకలు పెడతావ్! చూస్తున్నాను" జయంతి మాటలు సాగర్ పట్టించుకొన్నట్టు లేదు. జయంతి చూస్తోంది. బరువుగా వేలాడుతున్న పనస కాయలు, రంగురళగుల పువ్వులు, రకరకాల తీగలు, పొదలు నిర్వచించలేని ఏవేవో పరిమళాలు...సాగర్ ఆపకుండా ఏదో మాట్లాడుతూనే వున్నాడు.జయంతి అన్యమనస్కంగా 'వూ'కొడుతూనే వుంది. అరగంటకల్లా కొండమీదికి చేరుకొంది బస్సు. బస్సులోంచి అందరూ దిగేవరకూ కూర్చొని ఆఖరున దిగారు.

సాగర్ చటుక్కున చేతుల్తో కళ్ళు మూసుకున్నాడు. జయంతి ఆశ్చర్యంగా చూసింది.

"ఎందుకు సాగర్ అలా కళ్ళు మూసుకుంటున్నావ్?"

"నాకు భయం మేడమ్" భయం భయంగా అన్నాడు.

"దేనికి భయం!" ఆశ్చర్యంగా అడిగింది. సాగర్ ఓ చేత్తో కళ్ళు మూసుకొనే, రెండో చేత్తో అక్కడ వున్నవిద్యాపీఠం వారి సింహద్వారం వైపు చూపించాడు. బ్రహ్మాండమైన సింహం నోరు ఆవులించుకొన్నట్టు, నోట్లోంచి లోపలికి మెట్లు వున్న 'ఆధార సింహ ద్వారం' జానపద చిత్రాల్లోని సెట్టింగ్‌లా వుంది. జయంతి యింతకు ముందు చూసినప్పుడు కూడా ఆ కళాకౌశలానికి అబ్బురపడింది. మరోసారి అభినందనగా చూసి, సాగర్‌వైపు తలతిప్పి నవ్వింది. సాగర్ కళ్ళు మూసుకొనే వున్నాడు.

"ఓస్ ఎందుకంత భయం! బొమ్మలవి గీస్తావ్ మరి! సింహం బొమ్మ వెయ్యమంటే మానేస్తావా?...ఫరవాలేదు

చూడు" అతని భుజం మీద చెయ్యివేసి కుదుపుతూ అంది.

"ఒద్దు మేడమ్ నాకు భయమేస్తుంది"

"ఏమీకాదు. ఫరవాలేదు. నేనున్నానుగా చూడు వూఁ చూడమంటుంటే!" ధైర్యం చెబుతున్నట్టు అంది. సాగర్ నెమ్మదిగా చేతివేళ్ళు వదులు చేసి, వాటి సందులోంచి కొద్దిగా చూసి చటుక్కున బిగించేశాడు.

జయంతి గట్టిగా నవ్వేసింది. సాగర్, రోషమొచ్చినట్టు అన్నాడు.

"ఎందుకు నవ్వుతున్నారు మేడమ్?"

"నీ ధైర్యానికి.కొద్దిగా చూశావుకదా, ఇంకా యేమిటి భయం చేతులు తియ్యి" అంది జయంతి.

సాగర్ చటుక్కున రెండుచేతులూ కళ్ళ మీది నుంచి తీసేసి ఒక్కసారిగా కళ్ళు బాగా తెరిచి చూసేసి మళ్ళీ కళ్ళు మూసేసుకున్నాడు.

"అబ్బబ్బ కళ్ళు తెరు ఫరవాలేదు"

సాగర్ కళ్ళు తెరిచి చూసి, మొహం పుల్లద్రాక్ష పళ్ళు తిన్నట్టుగా పెడుతూ పక్కకు తిప్పేసుకున్నాడు, చూడలేనట్టు. అతన్నలా చూస్తుంటే జయంతికి ఆపుకోలేనంత నవ్వొచ్చింది.

"సరే పద" అంది సాగర్ చెయ్యి పట్టుకొంది. ఇద్దరూ బయలుదేరారు. అక్కణ్ణించి కొంత దూరం మెట్లు...

"నాకు ఆ బొమ్మంటే భలే భయం మేడమ్! ఇవాళ కొద్దిగా భయం పోయింది" ఆమె చెయ్యి పట్టుకొని మెట్లెక్కుతున్నాడు. మెట్లకు యిరువైపులా అందంగా పెంచిన పూల మొక్కలు. ఒక చోట పెద్దపొదలా వున్న బోగన్ విల్లా చెట్టు మొత్తం ఎర్రగా కనిపిస్తోంది.

పైనుంచి 'సిమ్మాద్రప్పన్నో' అంటూ కేకలు పెడుతూ పరుగులాంటి నడకతో దిగి వస్తున్నారు కొంతమంది. పైకి చేరుకుని, ఇరువైపులా వున్న దుకాణాలను చూస్తూ నడిచారు. సాగర్ అవీయివీ కొనమంటుంటే జయంతి వారించింది.

"వద్దు సాగర్! ఇప్పుడే అన్నీ కొనేసుకుంటే, ఆ బరువు మోస్తూ తిరగాలి. దేవుడి దర్శనం చేసుకున్న తర్వాత, వెళ్ళిపోయేటప్పుడు కొనుక్కుందాం. ఏం?" అంది. సాగర్ అంగీకారంగా తలూపాడు. ఇద్దరూ గుడి దగ్గరికి చేరుకున్నారు. బాగా రద్దీగా వుంది.

అరటి పళ్ళు, కొబ్బరికాయలు మొదలయిన సామాగ్రిని సాగర్ భుజాన వేలాడుతున్న సంచీలో వేసింది జయంతి. తరువాత దైవదర్శనానికి, కొబ్బరికాయలకు టిక్కెట్లు తీసుకొని గుళ్ళోకి నడిచారు. క్యూ చాలా పెద్దగా వుంది. గుడి చుట్టూ ఏర్పాటు చెయ్యబడి వుంది క్యూ. సాగర్‌ను తనముందు నడవమని క్యూలో ప్రవేశించింది. తన వెనక కూడా స్త్రీలే. క్యూలో నిలబడగానే జయంతికి చప్పున ఒక విషయం గుర్తుకొచ్చి గుండెలు ఝల్లుమన్నట్టై చెంపలు ఎర్రబారాయి. చప్పున అంతలోనే సర్దుకొంది. అప్రయత్నంగా ఆమె పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. ఎంత ఆపుకుందామన్నా చిరునవ్వు అనివార్యమై పోయింది. పదే పదే ఆ దృశ్యం కళ్ళముందు కదులుతోంది. ఆరోజు తనూ రాజారావ్ సింహాచలం వచ్చినప్పుడు క్యూలో నడుస్తున్నారు. తనవెనక రాజారావ్ ... క్యూ గుడి పక్కనుంచి సాగుతుండగా రాతి

రథందాటిన తర్వాత వెనక నుంచి రాజా రావు తన నడుం మీద తట్టాడు. చప్పున తను తల వెనక్కు తిప్పి కోపంగా చూసింది. రాజారావ్ నవ్వి,

"జయంతీ ఆ బొమ్మలు చూశావా?" చిలిపిగా నవ్వుతున్నాడు.

"ఏవి? అవా? చూశాను," నృసింహావతార చరిత్ర వివరిస్తూవున్న చిత్రాలు అనుకొని చప్పున చెప్పేసింది తను.

"ఎలా వున్నాయి?"

"బావున్నాయి" సాధారణంగా అంది తను. అతనికేదో అనుమాన మొచ్చినట్టు అన్నాడు. "ఇంతకీ ఏవి నువ్వు చూసింది?" చూపించింది తను. అతను నవ్వేసి నెమ్మదిగా తనకు మాత్రమే వినబడేలా అన్నాడు.

"అవికాదోయ్. అదిగో అలా చూడు గుడి మీద శిల్పాలు..."

గుడిమీద చూసింది మామూలుగానే అనిపించాయి.

"బాగానే వున్నాయి" అంది.

"ఆ పెద్ద శిల్పాలు కాదు! మధ్య మధ్యన వున్నాయి చూడు చిన్నవి, అవిగో ఆ స్తంభంలా చెక్కిన చోట సరిగ్గా చూడు'' విసుక్కుంటున్నట్టు అన్నాడు.

"ఏమిటది?" అంటూ పరీక్షగా చూసింది తను. కాసేపటికి గాని అర్థం కాలేదు, అర్థమైన తర్వాత ఆశ్చర్యపోయి అలాగే నిలబడి "అరె" అనేసింది గట్టిగా తను.

"ఏమిటి 'అరె' పద ముందుకు, వెనకాల జనం కోప్పడుతున్నారు" గట్టిగా అని ముందుకు వంగి చెవిలో అన్నాడు "ముందు యిలాంటివి చాలా వున్నాయి పద" అతని చిలిపి తనానికి సిగ్గేసినట్టుయి ముందుకు కదిలింది, ఓరగా ఆ శిల్పాన్ని పట్టి పట్టి చూస్తూ. 'యిద్దరు స్త్రీ పురుషులు నగ్నంగా వున్న శృంగార భంగిమ.' శిల్పి చాతుర్యం మెచ్చుకో దగింది. అంత చిన్న సైజులో అంత పరిపూర్ణంగా శిల్పాన్ని మలచడం గొప్పకళ. మరోశిల్పం, మరోభంగిమ...

"అలా దొంగ చాటుగా చూడకు. పాపం. దేవాలయంలో ఏదైనా సరే పవిత్రమైందే సరిగ్గా చూడు. ఫరవాలేదు" తన వెనక్కి బాగా దగ్గరకొచ్చి అంటున్న అతన్ని మోచేత్తో పొడిచి అంది

"నేనేం దొంగ చాటుగా చూడ్డంలేదు గాని, మీరు కాస్త అల్లరి తగ్గించండి."

"ఓ యస్ అలాగే జయంతీ, అసలు దేవాలయాల మీద యిలాంటి వెందుకో తెలుసా?"

"ఎందుకు?"

"మనలా కొత్తగా పెళ్ళై వచ్చిన దంపతులు..."అని నవ్వి రహస్యంగా అన్నాడు

"మరిన్ని కొత్త విషయాలు తెలుసుకోడానికి"

"ఛీ... మరీ మితిమీరి పోతున్నారు. నేనసలు మీతో మాట్లాడను'' తను కోపంగా ముందుకు నడవబోతే కదలకుండా యినుప బద్దీ మీదవున్న తన చేతిమీద అతని చెయ్యివేసి అదిమి పట్టుకున్నాడు.

"మేడమ్! మేడమ్!" సాగర్ పిలుస్తున్నాడు. జయంతి తేరుకొని ఏమిటన్నట్టు చూసింది.

"రథం చూడండి" సాగర్ అన్నాడు.

అప్పుడే రాతిరథంవరకూ వచ్చేశామా అనుకొంది జయంతి. క్యూ ముందుకు సాగుతూనే వుంది. మరో అరగంటకు గర్భగుడిలోకి ప్రవేశించారు. నేలంతా తడిగా వుంది. లైట్లు వేసినా వెలుతురు సరిపోవడంలేదు. అగరువత్తులు, కొబ్బరి నీళ్ళు, కర్పూరం, మొదలయిన వాసన లన్నీ కలగాపులగంగా కలిసిపోయిన పరిమళం. దేవుడి దగ్గరకు చేరుకొనే సరికి మరో యిరవై నిమిషాలు పట్టింది. కొబ్బరికాయలు, అరటిపళ్ళు పళ్ళెంలో వుంచి, ప్రసాదం పుచ్చుకొనేసరికి, జనంలో విపరీతమైన తొక్కిసలాట ప్రారంభమైంది. అతికష్టంమీద,సాగర్‌ను జాగ్రత్తగా చూసుకొంటూ గుళ్ళోంచి బయటకు తీసుకొచ్చింది జయంతి. ఇద్దరూ ఖాళీగా వున్నచోట చతికిల బడ్డారు. సాగర్ కొబ్బరిచిప్ప నేలకేసి కొట్టి ప్రసాదం జయంతికిచ్చాడు. జయంతి కళ్ళకద్దుకొని నోట్లో వేసు కొంది.

"సాగర్ నీకు ఆకలిగా వుందా?"

"యింకా లేదు మేడమ్!"

ఇద్దరూ గుడి సింహద్వారం దాటి బయటకు వచ్చి, టికెట్లిచ్చి, పాద రక్షలు తీసుకున్నారు. దగ్గరలో కాస్త మంచిగా కనబడిన హోటల్‌కు వెళ్ళి కాఫీ తాగారు. ఆ తరవాత బజారులో ఒక్కొక్క దుకాణమూ పరిశీలిస్తూ బయలుదేరారు. గాజుల దుకాణాలు,చెక్క బొమ్మలు, రాసులు రాసులుగా పోసిన రంగురంగుల కుంకుమ దుకాణాలు. చిన్న చిన్న యిత్తడి బొమ్మలు బస్తాలతో అమ్ముతున్న శనగలు, బఠాణీలు, ఫాన్సీ కొట్లు అవీ యివీ అని కాకుండా, సాగర్ అడిగినదల్లా కొని యిచ్చింది జయంతి. అతని మొహం సంతోషంతో వెలిగిపోవడంచూసి తృప్తిగానవ్వుకొంది.

"సాగర్ ఆకలి వెయ్యడంలేదూ?"

"వేస్తోంది మేడమ్"

"పద భోంచేద్దాం!" ఇద్దరూ భోజన హోటల్‌కు వెళ్ళారు. ఏదో ఎంగిలిపడ్డాం అనిపించి బయటకు వచ్చేశారు. సాగర్ అసలు సరిగ్గా తినలేదు. పైగా తను కొనుక్కున్న బొమ్మలు, ఆట వస్తువులుచూసుకొని మురిసిపోతున్నాడు. జయంతికి యేమీ కొనుక్కోవాలనిపించ లేదు.

"మేడమ్! అదిగో అలా చూడండి" గావుకేక పెట్టినట్టు అరిచిన సాగర్ అరు పుకి జయంతి అదిరిపడింది. బజారులో కొంతమంది ఒక్కసారి తలలు తిప్పి జయంతి వంకా, సాగర్‌వంకా చూశారు. ఏమిటన్నట్టు జయంతి కోపంగా చూసింది సాగర్‌వంక

"మేడమ్ అదిగో అలా చూడండి. మ...మమ్మీ" కంగారుగా అంటున్న అతని మాటలకు వులిక్కిపడి చూసింది జయంతి. అదిరిపడింది. సందేహం లేదు ఆమె రాజ్యలక్ష్మి. వెనకనుంచయినా స్పష్టంగా గుర్తించగలదు తను. ఆమె పక్కన...పక్కన...జయంతి గుండెలు రెపరెపలాడాయి. రాజారావ్...యిద్దరూ ఏదో మాట్లాడుకుంటూ చకచకా నడిచి మెట్లు దిగుతున్నారు బస్‌స్టాప్‌వైపుకు.

"మేడమ్ మమ్మీయే పిలుస్తాను" ఆనందంగా అరిచినట్టని ముందుకు పరు గెత్తబోయిన సాగర్‌ను చటుక్కున చెయ్యి పట్టుకొని ఆపుచేసింది జయంతి. "సాగర్‌ను వెళ్ళనివ్వాలా? వద్దా?" అన్న

ప్రశ్నకు చప్పున ఒక నిర్ణయానికొచ్చే సింది. సాగర్‌ను వెళ్ళనిస్తే చాలా సమస్యలు యెదురు కావచ్చు.

"మేడమ్ నన్ను వదలండి మమ్మీని పిలుస్తాను" సాగర్ ఆమె చెయ్యి వదిలించుకోడానికి ప్రయత్నిస్తుంటే జయంతి మరింత గట్టిగా పట్టుకొంది.

"సాగర్ ఏమిటి నీ అల్లరి. సరిగ్గా నిలబడు. అందరూ మన వంకే చూస్తున్నారు" కోపంగా అంది. అంతకోపాన్ని ఆమె మొహంలో ఎప్పుడూ చూడని సాగర్ నిర్విణ్ణుడయినట్టుగా గింజుకోడం మానేసి నిలబడి పోయాడు

"ఎవర్నో చూసి అలా అనుకుంటున్నావ్. ఆవిడ మమ్మీ కాదు."

"లేదు మమ్మీయే! పక్కన రాజారావ్ 'అంకుల్' వున్నాడు."

'అంకుల్' అన్న మాట సాగర్ నోట్లోంచి వాడి ములుకులా జయంతి గుండెల్లో దిగబడింది. ఆమె హృదయం బాధగా విలవిల్లాడింది. అప్పటికే రాజారావ్ రాజ్యలక్ష్మి కనుమరుగయిపోయారు. జయంతి బాధగా నిట్టూర్చి, సాగర్ వంక చూసింది. సాగర్ కళ్ళు, జనంలో తనకు కావలసినవారి గురించి అన్వేషిస్తున్నాయి.

"మనుష్ల్ని పోలిన మనుషులు చాలామంది వుంటారు. పోదాం...పద సాగర్". తన సమాధానం తనకే వెగటుగా అనిపించింది జయంతికి. అతని భుజంచుట్టూ చెయ్యివేసింది. సాగర్ కదిలాడు. అతని మొహంలో అంతకు ముందు వరకూ వున్న వుత్సాహం లేదు. అతని కళ్ళు మాత్రం అతి చురుగ్గా అటూ ఇటూ చలిస్తున్నాయ్.

బస్‌స్టాండ్‌కు చేరుకున్న తర్వాత అటూ ఇటూ చూసి తేలిగ్గా నిట్టూర్చింది. రాజారావు, రాజ్యలక్ష్మి యెక్కడా కనిపించలేదు. సాగర్ ధోరణిలో మరీ మార్పొచ్చేసింది. బాగా దిగులుగా యేదో ఆలోచిస్తున్నట్టుగా వున్నాడు.



# 16

చౌల్ట్రీ దగ్గరకు చేరుకుని గది తాళం తెరిచింది జయంతి. పొద్దుట సోమరాజు టేబిల్‌మీద పెట్టిన డబ్బా, దుప్పటీ అలాగే వున్నాయి. వాటిని తీసి మంచం మీద పరిచి, ఫాన్ స్విచ్ నొక్కింది. సాగర్ మంచినీళ్ళు తాగి మంచంమీద పడుకున్నాడు. జయంతి కూడా అతని పక్కనే సర్దుకొని పడుకొంది. బాగా అలసటగా వుండడంవల్ల సాగర్ మగతగా నిద్రపోయాడు. జయంతికి నిద్ర పోవాలనిపిస్తోంది. కానీ యేదో బాధ నిద్ర పోనివ్వడం లేదు. ఇదేమిటి ఇలా జరిగింది? ఇక్కడకు రాకుండా వుంటే బావుండిపోను....అసలు వాళ్ళెందుకు వచ్చారు? ఇంకా ఇక్కడే వున్నారో, వెళ్ళిపోయారో...మళ్ళీ రాజ్యలక్ష్మి, సాగర్‌కు కనిపిస్తే పెద్ద గొడవ పెట్టేస్తాడు. ఎలా? పోనీ యిప్పుడే వెళ్ళిపోతే కమలాకరానికి యేమని సమాధానం చెప్పాలి? జయంతికి తోచలేదు. సాగర్ లోలోపల నెమ్మదిగా యేదో గొణుక్కొంటున్నాడు. కాస్సేపటికి జయంతి ఓ నిర్ణయానికొచ్చింది. రేపటివరకూ

బయటికి వెళ్ళకుండా వుండిపోతే, యే సమస్యా వుండదు. అంతే కళ్ళు మూసుకుంది. కాస్సేపటికి నిద్ర పట్టింది.

మళ్ళీ మెలుకువొచ్చేప్పటికి గదంతా చీకటిగా వుంది. చాలా సేపు నిద్రపోయానన్నమాట అనుకొంది జయంతి. బయట రోడ్డుమీది నుంచి యేదో వూరేగింపు వెళుతున్నట్టు చప్పుళ్ళు వినిపిస్తున్నాయి. నాదస్వరం, డోలు, యితరమైన యేవో వాయిద్యాలు...బాణాసంచా చప్పుళ్ళు. కిటికీ అద్దంమీద వాటి వెలుగు మెరుపుల్లా పడుతోంది. జయంతి లేచి తడుముకొంటూ వెళ్ళి, లైటు స్విచ్ నొక్కింది. లైటు వెలిగింది. సాగర్ గాఢంగా నిద్రపోతున్నాడు. జయంతి ఒళ్ళు విరుచుకొంది. కాస్త తేలిగ్గా వున్నట్లనిపించింది. బాగా నిద్రపట్టడంవల్ల కాబోలు అనుకొంది. టైము చూసింది. పది నిమిషాలు తక్కువ యెనిమిది బ్రీఫ్‌కేస్ తెరిచి, టవల్ తీసుకొని, తలుపు తెరిచి, కారిడార్‌లోకి వచ్చింది... చల్లటి గాలి హాయిగా అనిపించింది. పక్కగదివాళ్ళు వచ్చినట్టున్నారు. లైటు వెలుగుతోంది. చివరగా వున్న బాత్‌రూమ్‌కెళ్ళింది... పది నిమిషాల్లో తిరిగివచ్చి, మొహం శుభ్రంగా తుడుచుకొని, దువ్వెనతో పైపైన తల దువ్వుకొని సాగర్‌ను లేపింది. సాగర్ లేచి కూర్చుని కళ్ళు నులుముకున్నాడు. తలుపు కొట్టిన చప్పుడు...వెళ్ళి తలుపు తెరిచింది. మధ్యాహ్నం కూజాతో నీళ్ళు పెట్టిన మనిషి, చేతిలో పెద్దసైజు సిల్వర్ కారేజ్‌తో నిలబడి వున్నాడు. మరో చేతిలో రెండు అరిటాకులు. పక్కకు జరిగి నిలబడింది. అతను లోపలికొచ్చి, కారేజ్ టేబిల్‌మీద పెట్టి, కూజాలో నీళ్ళు వున్నాయో లేవో చూసి వెళ్ళిపోయాడు.

"సాగర్!...వరండా చివర బాత్‌రూమ్ వుంది వెళ్ళి మొహం కడుక్కురా!" అంది టవల్ భుజంమీద వేసి. సాగర్ తలూపి బయటకు వెళ్ళాడు. అతను తిరిగి వచ్చేటప్పటికి టేబిల్ మంచానికి దగ్గరగా లాగి, రెండోపక్క కుర్చీ దగ్గరకు లాగి, రెండు అరిటాకులు పరిచి వడ్డించింది. వడ్డన పూర్తయ్యేటప్పటికి సాగర్ మొహం తుడుచుకొంటూ వచ్చాడు.

"మేడమ్...ఏమిటి కూర?" అతని గొంతు ఉత్సాహంగా వుండటం జయంతికి ఆనందం కలిగించింది.

"పప్పు, అరటికాయ, సాంబారు, మజ్జిగ" వరసగా చెప్పేసింది.

"మరి...అన్నం, మంచినీళ్ళు" అని సాగర్ నవ్వాడు. జయంతి కూడా పకపకా నవ్వేసింది.

మరో అర గంట తర్వాత పని మనిషి వచ్చి, క్యారేజీ, డబ్బులు తీసుకొని వెళ్ళిపోయాడు. బయటకు వెళదామని, సాగర్ అనలేదు. అతనికి ఏవేవో కథలు చెప్పి నిద్ర పుచ్చేటప్పటికి పది గంటలయింది. లైటు తీసేసి నిద్రపోదామనుకుంది. కానీ, బెడ్‌రూమ్ లైటులేదు చీకటిగా వుంటుందని లైటు అలాగే వుంచి, సాగర్ పక్కన పడుకొంది. మళ్ళీ ఆలోచనలు ముసురుకొంటున్నాయి. అప్పటివరకూ నిద్రపోవడం వల్ల, నిద్రావడం లేదు. బలవంతంగా కనురెప్పలు మూసుకొంది.

రాజారావ్, రాజ్యలక్ష్మి కళ్ళ ముందు




నిలబడుతున్నారు.

తలుపు చప్పుడయింది. వేళ్ళతో తలుపుమీద టకటక కొడుతున్నారెవరో! ఈ సమయంలో ఎవరు తలుపు కొడతారు? క్షణం సేపు గుండెలు రెపరెపలాడాయి. లీలగా గాజుల చప్పుడు వినబడి నట్టయింది. జయంతి మంచంమీద లేచి కూర్చుంది. సాగర్ వంక చూసింది. అమాయకంగా నిద్రపోతున్నాడు.

"జయంతీ! జయంతీ!"

ఆడ గొంతుక, నెమ్మదిగా పిలుస్తున్నారు. జయంతి వులిక్కి పడింది. ఆ గొంతు...తనకు బాగా గుర్తు అది.ఖచ్చితంగా రాజ్యలక్ష్మి గొంతే. చటుక్కున లేచి నిలబడి, తడబడుతున్న అడుగులతో తలుపు వైపు నడిచి, గడియ తీసింది. శబ్దం కాకుండా తెరుచుకుంది తలుపు. ఏదో మధురమైన సెంటు వాసన గదిలోకి చొరబడింది.

* * *

పెద్ద పెద్ద గులాబీలు ఎంబ్రాయిడరీ చేసిన తెల్లటి అమెరికన్ జార్జెట్ చీర, తెల్లటి బ్లవుజ్, తల నిండా పువ్వులు... చిరునవ్వు ముఖాన అలంకరించుకొని, గుమ్మంలో నిలబడి వుంది రాజ్యలక్ష్మి. గదిలో లైటు వెలుగు ఆమె మీద పడగా మిగిలింది వరండాలోకి పరుచుకుంటోంది అలా ఆమెను చూస్తుంటే జయంతికి విచిత్రంగా అనిపించింది. ఒక రోజున తను తలుపు తడితే ఆమె యిలాగే సందేహంగా చూసింది యీ రోజు ఆవిడ....

"నేను గుర్తున్నానా!" నెమ్మదిగా అడిగింది రాజ్యలక్ష్మి ఆమె ప్రశ్నలో వెటకారం. జయంతి మనసు చివుక్కుమంది. ఓ సారి వెనక్కి తల తిప్పి, నిద్రపోతున్న సాగర్ వంక చూసి... వరండాలోకి ఒక అడుగు వేసి, తలుపు దగ్గరకు లాగింది. రాజ్యలక్ష్మిలో లీలామాత్రంగా కలిగిన నివ్వెరపాటుజయంతి గమనించింది.

"నేను ఇక్కడున్నానని మీకెలా తెలుసు!" వస్తున్న కోపాన్ని నిగ్రహించుకోడానికి ఏదో ఒక ప్రశ్న అనుకొంది జయంతి.

"అది అంత ముఖ్యమైంది కాదు" రాజ్యలక్ష్మి చాలా సాధారణంగా అంది.

"అంతకంటే ముఖ్యమైన విషయం ఏమిటి మాట్లాడానికొచ్చారు?" ఆమెను చూస్తుంటే జయంతిలో ఏదో ఎక్కడో, అణిగిపోయిన పగ లాంటి భావం పడగ విప్పుకొని పైకి లేస్తోంది. రాజ్యలక్ష్మి, రెండడుగులు ముందుకువేసి పిట్ట గోడనానుకొని నిలబడింది. వరండాలో అక్కడక్కడా మనుషులు నిద్రపోతున్నారు. తమ మాటలు ఎవరూ వినే అవకాశం లేదు.

"ఒకరోజు నువ్వు నా తలుపు తట్టావ్. నాకు గుర్తుంది ఎలా మాట్లాడానో, అందుకేనా నువ్వీరోజు ఇలా మాట్లాడుతున్నావ్!" రాజ్యలక్ష్మి నిర్లక్ష్యంగా నవ్వింది.

తనను ఏక వచనంతో సంబోధిస్తున్న ఆమె దర్పానికి జయంతికి లోలోపల ఆశ్చర్యమనిపించింది.

"ఎవరి పరిస్థితికి అనుగుణంగా వారు మాట్లాడడంలో తప్పు లేదు" జయంతి కూడా నిర్లక్ష్యంగా చెప్పింది సమాధానం.

"ఓహో! అయితే, ఈ రోజు నీ పరిస్థితేమిటి?" వెటకారంగా అడిగింది రాజ్యలక్ష్మి.

"మీకు తెలియదనుకోను"

"తెలుసు నా కొడుకును చూడాలనుకుంటే దానికి, నీ పర్మిషన్ కావాలి. అంతేనా?"

ఆమె గొంతులో లీలగా కోపం కదిలింది. జయంతి హేళన ధ్వనించేలా నవ్వింది.

"కమలాకరం గారు, మీ భర్త కానప్పుడు సాగర్ మీ కొడుకెలా అవుతాడు?''

"జయంతీ!" దెబ్బతిన్నట్టుగా అంది, రాజ్యలక్ష్మి. రెండు నిమిషాలుపాటు ఆమె నిశ్శబ్దంగా వుండి పోయింది. ఆమె ఉఛ్వాస, నిశ్వాసలు స్పష్టంగా జయంతి చెవులకు వినబడుతున్నాయి. తరువాత గొంతు సర్దుకున్నట్లుగా దగ్గి, అంది.

"మధ్యాహ్నం. కొండ మీద వాడు అరిచిన అరుపు నాకు...వినబడింది... అందుకే...అందుకే...వాడిని చూడాలనిపించింది"

"వినబడిందా!"

"అవును"

"అయితే అప్పుడే మీరెందుకు వెనక్కు తిరగలేదు" ఆశ్చర్యంగా అంది.

"తిరగలేదు. కావాలనే అలా చేశాను. నువ్వురానిస్తే వాడొస్తాడని,నాకు తెలుసు. వాడు రాలేదు. అంటే నువ్వు రానివ్వలేదన్న మాట"

"అవును అతను మిమ్మల్ని గుర్తుపట్టాడు. కాని నేనే మీరు కాదనిచెప్పాను"

"ఎందుకు చెప్పావలా? వాడిని నా దగ్గరకెందుకు రానివ్వలేదు?" ఆమె గొంతులో ఏదో అర్థంకాని ఆర్ద్రితాభావం లాంటిది.

"అతని బాధ్యత నా మీద వుంది.. యేం జరిగినా కమలాకరంగార్కి సమాధానం చెప్పవలసింది నేను."

"అయితే మాత్రం!" అర్థం కానట్టు అడిగింది.

"ఈ మధ్య అతను మిమ్మల్ని మరిచి పోతున్నాడు మీ దగ్గరికి రానిస్తే అతను మిమ్మల్ని వదిలి రానని పేచీ పెట్టవచ్చు... అప్పుడు నేను కమలాకరంగారికి యేం చెప్పుకోవాలి?"

"సాగర్! నన్ను మర్చిపోతున్నాడా?" ఆమె గొంతులో విస్మయం.

"తప్పదు గదా!" నవ్వింది జయంతి... ఆ నవ్వు ఆమెను గాయపరుస్తుందని తెలుసు.

మళ్ళీ ఆమె నిమిషం పాటు నిశ్శబ్దమై పోయింది...

"కమలాకరం దగ్గరే వుంటున్నావని తెలిసింది... యేం చేస్తున్నావక్కడ?"

"ఉద్యోగం"

"ఏమిటది!"

"మీకు అనవసరమనుకుంటాను" నిర్లక్ష్యంగా అంది.

"ఊరికే అడిగాను నాకు అనవసరమే... అసలు నేనిలా రావడమే అనవసరం కాని ... వాడు ... సాగర్ పిలిచాడని" యెందుకో ఆపై ఆమె మాట్లాడలేక పోయింది. ఆమె మొహం మీద దూరంగా వున్న లైటు వెలుగు పడుతోంది ఆమె అలా మాట్లాడుతుంటే, జయంతికి యెందుకో బాధనిపించింది.. జాలి లాంటి భావం గుండెల్లో పొంగి, తను క్రూరంగా ప్రవర్తిస్తోందా అనిపించింది క్షణంసేపు... రాజ్యలక్ష్మి కదిలింది.

"నేను వస్తాను మరి..." అని, "నువ్వు రాజారావును చూడాలనుకుంటే, రావొచ్చు" అంది. జయంతి క్షణంసేపు తెల్లబోయి నిగ్రహంగా అంది.

"అవసరంలేదు." రాజ్యలక్ష్మి చిన్నగా నవ్వింది.

"జయంతీ... నువు నాకు నచ్చావ్.. నీ పట్టుదలా నాకు నచ్చింది" అభినందిస్తున్నట్టుగా అని, "నేనిలా రావడం అనవసరం అనుకుంటున్నాను. కాని రావడం వల్ల ఒక కొత్త విషయం తెలుకోగలిగాను." ఆ మాటలు ఎంతో ఆమె నిజాయితీగా చెబుతున్నట్టనిపించి, జయంతి ఆశ్చర్యపడింది.

"ఏమిటా విషయం" ఆసక్తి కనబడకుండా జాగ్రత్తపడుతూ అడిగింది జయంతి. రాజ్యలక్ష్మి ఆమె వంక చూసి, కొద్దిగా తలవంచుకొని, కాస్త నలుగుడు పడినట్టుగా కదిలి అంది.

"సాగర్... నా కొడుకు కాదని" ఆమె గొంతులో పలికిన ఆర్ద్రత, సన్నటి వణుకు, ఏదో నిర్లిప్తత, జయంతి మనసును చివుక్కు మనిపించాయి. ఎందుకో ఆ క్షణంలో ఆమె మీద ఏదో సానుభూతి రివ్వున పైకెగిసింది.

"నే వస్తాను" అంటూ ముందుకు కదలబోయిన రాజ్యలక్ష్మి చెయ్యి చటుక్కున పట్టుకుని, ఆపుజేసింది జయంతి. విచిత్రంగా చూసింది రాజ్యలక్ష్మి.

"అయామ్ సారీ... మీరు నన్నేదో అన్నారనీ, మిమ్మల్ని బాధ పెట్టాలనీ కాదు. సాగర్ నిద్రపోతున్నాడు... రండి చూద్దురుగాని."

రాజ్యలక్ష్మి కళ్ళు లీలగా తడిదేరినట్లనిపించాయి. జయంతికి ఆమె చిన్నగా నవ్వి జయంతి చెయ్యి విడిపించుకొంది.

"ఒద్దు జయంతీ ... యీ మాత్రం తట్టుకోలేకపోతే... నేనసలు గడపదాటి వుండేదాన్నే కాదు.. సాగర్ నాకు కావలిస్తే కోర్టులోనే పొందగలిగేదాన్ని. కాని అతన్ని కమలాకరానికి వదిలిపెట్టాను.. అతన్ని చూడాలనుకోవడం తప్పు. ఇలా రావడం .. యింకా నాలో మిగిలిపోయిన బలహీనత.. దాన్ని యీ రోజుతో పోనీయ్."

"అదికాదు.. ప్లీజ్.." తనగొంతులో అభ్యర్థన తనకే ఆశ్చర్యమనిపించింది జయంతికి. రాజ్యలక్ష్మి క్షణం సేపు జయంతి వంక ఆశ్చర్యంగా చూసి, అడ్డంగా తలూపింది.

"వద్దు జయంతీ.. నా అభిప్రాయం మీద నాకు నమ్మకంవుంది.. వాడిని నేను చూడను అదంతే.. వస్తాను."

"ఒక్క విషయం" జయంతి మాటకు, రెండడుగులు వేసిన రాజ్యలక్ష్మి ఆగింది.

"ఏమిటది ?"

"రేపు కూడా మీరు యిక్కడే వుంటారా ?"

"ఏమో !.. రేపటి వరకూ చెప్పలేను.. యేం ?"

"మేము రేప్పొద్దుటే వెళ్ళిపోతాం దయచేసి మీరు సాగర్‌కు కనిపించకండి."

రాజ్యలక్ష్మి గట్టిగా నవ్వింది. అప్పటి వరకూ కనిపించిన మెత్తదనం, మృదుత్వం లేవు. మామూలు దర్పం, కరకుతనం స్పష్టంగా వున్నాయి.

"చూడు జయంతీ! సాగర్ నా కొడుకు కాదు. అతని పట్ల నాకు ఏ రకమైన బాధ్యతా లేదు. నేను కనిపించడానికి ప్రయత్నించను.కనిపించ కుండా వుండడానికి కూడా ప్రయత్నించను. ఎందుకంటే, యీ రెంటిలో ఏది చేసినా సాగర్‌ను యింకా నేను, నా కొడుకే అనుకుంటున్నట్టు లెఖ్ఖ.సాగర్ ఎవరో... నేనెవరో" రాజ్యలక్ష్మి విసురుగా వెనక్కు తిరిగింది. జయంతి నోట మాటరాలేదు.



# 17

జయంతి కంగారుగా లేచింది. బాగా తెల్లవారి పోయింది. టైము చూసింది, ఏడున్నర. జయంతికి కొద్దిగా నవ్వొచ్చింది. రాత్రి రాజ్యలక్ష్మి ఆలోచనలతో చాలా సేపు నిద్రపట్టలేదు. ఎలాగూ పొద్దుటే వెళ్ళిపోవాలి గదా, మొత్తం రాత్రంతా మెలుకువగా వుందామని ప్రయత్నించి, తనకు తెలీకుండానే నిద్రపోయింది. దానికి ఫలితం యిది.

సాగర్ బద్ధకంగా అటూ ఇటూ కదులుతున్నాడు. అతన్ని తట్టి లేపింది. గబగబా కాలకృత్యాలు ముగించి, ఈ లోగా పనిమనిషి వస్తే - టిఫినూ, కాఫీ తెప్పించుకొని తిని రూము ఖాళీ చేస్తున్నట్టు చెప్పింది. పని మనిషికి అయిదు రూపాయలిచ్చింది. ఆనందంగా అందుకొన్నాడు. బ్రీఫ్‌కేస్, కింద కౌంటర్ వరకూ తెచ్చాడు. కౌంటర్‌లో వున్న మనిషి రిజిష్టర్ చూసి, అదనంగా ఏమీ చెల్లించనక్కర లేదని చెప్పాడు. అప్పటికే ఎనిమిదిన్నర అయింది. ఎంత తొందరగా వైజాగ్ వెళ్ళి పోదామా అని కంగారుగా వుంది.

రెండు నిమిషాల్లో బస్‌స్టాండ్ చేరుకున్నారు. క్రితంరోజుకంటే రద్దీగావుంది.

"సాగర్! ఇవి పట్టుకుని యిక్కడే నిలబడు,ఎక్కడికీ కదలకూడదుసుమా" అంటూ, చేతిలో హాండ్‌బాగ్, బ్రీఫ్‌కేస్,




సాగర్ చేతికిచ్చి టికెట్ల కోసం జనంలో చొరబడింది. అంతా తొక్కిసలాటగా వుంది. అయినా పళ్ళబిగువున అంతా సహించి, మరో యిరవై నిమిషాల్లో టిక్కెట్లతో బైట పడింది.

"అమ్మయ్య ఫరవాలేదింక!పద పద బస్ ఎక్కుదాం" అంటూ, ఆత్రుతగా ఏదో చెప్పబోతున్న సాగర్ వంక ఏమిటన్నట్టు చూసింది. సాగర్ గభాల్న బ్రీఫ్‌కేస్, హాండ్‌బాగ్ ఆమె చేతిలో పెట్టాడు.

"మేడమ్ మేడమ్ ... అదిగో అలా చూడండి అదిగో మమ్మీ" అరిచినట్టుగా అని, పూల దుకాణాల వైపు రివ్వున పరుగెత్తాడు. జయంతి భ్రమాస్పడిపోయింది క్షణంసేపు. దూరంగా పువ్వుల దుకాణం దగ్గర రాజ్యలక్ష్మి, రాజారావ్ వారి పక్క పాత మోడల్ ప్లిమత్ కారు. అయిపోయింది, తన శ్రమ వృధా అయిపోయింది. ఇప్పుడేం చెయ్యాలి! మరుక్షణంలో తేరుకొని, అతని వెనక తనూ పరుగెత్తింది.

"మమ్మీ మమ్మీ" అరుస్తూ రాజ్యలక్ష్మిని చుట్టుకు పోయాడు సాగర్. రాజ్యలక్ష్మి తెల్లబోయినట్లుగా చూసింది. జయంతి రొప్పుతూ ఆగింది. రాజ్యలక్ష్మి జయంతి వంక అదోలా చూసింది. రాజారావ్ ఇదేమీ పట్టనట్లు ఎటో చూస్తున్నాడు.

"మమ్మీ!! మమ్మీ! ఎక్కడికెళ్ళావ్, మమ్మీ!" సాగర్ ఆమెను చుట్టుకొని ఏడుస్తున్నట్టు అంటున్నాడు. జయంతికి కడుపులో దేవినట్టయింది. రాజ్యలక్ష్మి నిగ్రహించు కుంటునట్టుగా కనబడింది. రాజారావు ఏం చేస్తున్నాడో నని ఓరగా చూస్తోంది జయంతి. అసలు తన వునికిని కూడా గుర్తించినట్టు లేదు. అతని వైఖరి అసహ్యమేసింది.

రాజ్యలక్ష్మి, తనను బలంగా చుట్టుకున్న సాగర్ చేతుల్ని బలవంతంగా విడిపించుకొని, అతని భుజాలు పట్టుకొని విడదీసింది.

"సాగర్ ఏమిటిది! ఆ యేడుపేమిటి ఆపు!" కోపంగా అంది.

చుట్టుపక్కల వున్న మనుషులు కొంతమంది ఆసక్తిగా చూడ్డం భరించలేక పోతోందామె. జయంతికి ఏం మాట్లాడాలో పాలుపోవడంలేదు. సాగర్ యేడుపు ఆపేశాడు. అతనికి రాజ్యలక్ష్మి అంటే భయంలా వుంది.

"మమ్మీ యింటి కెళ్ళిపోదాం. వచ్చెయ్" దీనంగా అడుగుతున్నాడు.

"సాగర్ నువ్వెళ్ళు. నేనిప్పుడు రావడం కుదరదు" నచ్చజెబుతున్నట్లయినా చిరాగ్గా అంది.

"అంకుల్ నువు కూడా రా అంకుల్! మమ్మీకి చెప్పు, రమ్మని" రాజారావ్ చెయ్యి పట్టుకొని లాగాడు. రాజారావ్ ఏం మాట్లాడలేదు. సాగర్, రాజారావును అంకుల్ అని పిలుస్తుంటే రాజ్యలక్ష్మి చప్పున జయంతి మొహంలోకి చూసింది. ఆమె నవ్వుతున్నట్టనిపించి రాజ్యలక్ష్మి మొహం జేవురించింది.

"సాగర్! చెబుతుంటే నీక్కాదూ వెళ్ళు" అరిచినట్టుగా అంది.

"వుహుఁ నువు రాకపోతే నేను వెళ్ళను" మొండిగా అన్నాడు.

నెమ్మదిగా జనం పోగవుతున్నారు. రాజ్యలక్ష్మి కోపం కట్టలు తెంచుకుంది.

"యూ రాస్కెల్" అంది. మరు క్షణంలో ఆమె చెయ్యి సాగర్ చెంప మీద టప్‌మని శబ్దం చేసింది. జయంతి గుండెల్లోనించి కోపం రివ్వున పైకి లేచింది. చటుక్కున ఒకడుగు ముందుకు వేసి, సాగర్‌ను జబ్బ పట్టుకుని, దగ్గరకు లాక్కుని ఏదో అనబోయేంతలో

"రాజారావ్ పద" అంటూ అతని చెయ్యి పట్టుకొని, గబగబా ముందుకు నడిచి, కారు డోర్ తెరుచుకొని ఎక్కింది. రాజారావు మంత్రముగ్ధుడిలా ఆమె వెంట నడిచాడు. వెళ్ళిపోతూ అతను తన వంక చూసిన చూపు జయంతికి అమితాశ్చర్యం కలిగించింది. అది, ఎవరో ఎప్పుడూ తెలియని వాళ్ళని చూస్తున్న చూపు.

సాగర్. చెంపమీద చెయ్యి ఆనించుకొని నిర్విణ్ణుడైనట్టు చూస్తున్నాడు అతని కళ్ళు ఎర్రగా వున్నాయి. కారు శబ్దం చేస్తూ కదిలి వెళ్ళిపోయింది. బస్సు బయలుదేరుతున్నట్టుగా హారన్ మ్రోగిస్తున్నాడు డ్రైవర్. జయంతి, సాగర్ రెక్క పట్టుకొని, దాదాపు లాక్కుపోతున్నట్టుగా బస్సువైపు పరుగెత్తింది,

* * *

"ఇదంతా మీరు డాడీకి చెప్పకండి కోప్పడతారు" సాగర్ అన్నాడు.

"అలాగే చెప్పను కాని నువ్విలా భోజనం చెయ్యనని మంకుపట్టు పడితే మాత్రం చెప్పేస్తాను'' అంది జయంతి. సాగర్ భయంగా చూశాడు.

''ఏం మరి భోజనం చేసావా?''

తలూపాడు. ఆమె వెనకే డైనింగ్ హాల్లోకొచ్చి భోజనం పూర్తిచేశాడు.

''చినబాబుగారేమిటి అదోలా వున్నారు'' రావమ్మ అడిగినప్పుడు ప్రయాణం బడలిక అని సర్దిచెప్పేసింది జయంతి.

''సాయంత్రం మీ డాడీ వచ్చేప్పటికి నువు ఎప్పటిలా మామూలుగా వుండాలి తెలిసిందా!లేకపోతే ఆయనకంతా తెలిసిపోతుంది''

అలాగే అన్నట్టు తలూపాడు సాగర్.

"మేడమ్! మమ్మీ ఎందుకు యింటికి రానంది?'' అమాయకంగా అడుగుతున్న అతనికి ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తోచలేదు జయంతికి.

''నేను స్నానం చేస్తాను. నువు కాస్సేపు నిద్రపో యేం?''

సాగర్ తల వూపాడు. జయంతి బాత్‌రూంలోకి నడిచింది. చాలా చికాగ్గా వున్నట్టనిపించింది ఆమెకు. తలమీది నుంచి హాయిగా స్నానం చేసి బట్టలు కట్టుకొని గదిలోకొచ్చేప్పటికి అరగంట పట్టింది. జయంతి గదిలోకి రావడంకూడ గమనించినట్టు లేదు సాగర్. మంచానికి మధ్యగా బాసింపట్టు వేసుక్కూచుని, ఏదో దీక్షగా వ్రాస్తున్నాడు.

"అరె నిద్రపొమ్మంటే ఏమిటి చేస్తున్నావ్!" అంటూ దగ్గరకొస్తున్న జయంతి మాటలు విని చేతిలో వున్న దాన్ని చటుక్కున వెనక్కి పెట్టేసుకున్నాడు. జయంతి ఆశ్చర్యంగా చూసింది.

"ఏమిటి దాచుకుంటున్నావ్! చూపించకూడదా?" నవ్వింది.

సాగర్ మాట్లాడలేదు. జయంతిఅతని వెనగ్గా వెళ్ళి చేతుల్లో వున్న దాన్ని చటుక్కున లాక్కుని చూసి, క్షణంసేపు తెల్లబోయింది. అది రాజ్యలక్ష్మి ఫొటో. ఆ యింట్లో వున్న ఏకైక ఫొటో, సాగర్

యెంతో అపురూపంగా దాచుకొనేఫొటో. దానిమీద యింకు మరకలు. ఆమెమొహా నికి పెద్దపెద్ద మీసాలు, ఫొటో నిండా పిచ్చిగీతలు...ఆశ్చర్యంగా సాగర్ వంక చూసింది. అతను తలగడలో తలదూర్చి బోర్లా పడుకున్నాడు. ఫొటోమీద మర కలు అతని హృదయంమీద గాయాల్లా అనిపించాయి.



## 18

మరునాడు జయంతి పేరున వుత్తరం వచ్చింది. జయంతి ఆశ్చర్యపోతూ చూసింది. తనకు వుత్తరాలు రాసే వాళ్ళు యెవరున్నారు!

కవరు అటూ ఇటూ తిప్పిచూసింది. ఫ్రమ్ అడ్రస్ లేదు. వైజాగ్-నుంచి పోస్ట్ చేసిందే. చిరునామా చూసివులిక్కి పడింది. అది రాజారావ్ దస్తూరే. వణుకుతున్న చేతుల్తో కవరు చింపి వుత్తరం బయటకు లాగింది.

జయంతీ.

నువ్వు నన్ను నోటితో అడగక పోయినా, నీ కళ్ళు నన్ను అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పవలసిన బాధ్యత నా మీద వుంది. నిన్ను నేను ఎందుకు విడిచిపెట్టేశాను అనేది వాటి ప్రశ్న. అది అన్యాయం, అక్రమం అని పించవచ్చు కాని దానికి నా సమాధానం..

ప్రపంచంలో ప్రతిఒక్కరూ 'జీవ హింస' మహాపాపం అని అంగీకరిస్తారు. కాని 'జీవహింస' మినహాయిస్తే మనిషి మనుగడ అసాధ్యం. ఇది కూడా అందరూ అంగీకరించే సత్యమే.

ఇంతకంటే నీకు అర్థమయ్యేలా చెప్ప నవసరం లేదనుకుంటాను.

రాజారావ్

"ఛీ...ఛీ" యింతటి దుర్మార్గుడు ప్రపంచంలో వుండొచ్చునుగాని, యిలాంటి దుర్మార్గుడు ప్రపంచంలో వుండడు. అనుకొంది జయంతి. అతనుచేసిన వెధవ పని, అనివార్యమైన ప్రపంచావసరంతో పోల్చిన అతని వితండ వాదం జయంతికి చెప్పలేనంత అసహ్యం కలిగించింది. ఆ వుత్తరాన్ని వెంటనే ముక్కలు ముక్క లుగా చింపేసింది.

*  *  *

"మీరు సింహాచలం వెళ్ళిన దగ్గర నుంచీ అదోలా వుంటున్నారు."

కమలాకరం అన్నాడు, ఆ రోజు పనంతా అయిన తర్వాత.

"ఎలా వుంటున్నాను... బాగానే వున్నానే!"

"ఉహుఁ... కాస్త డల్‌గా వుంటు న్నారు."

"ఏం డ్రైపు చెయ్యడంలో తప్పు లెక్కువౌతున్నాయా?" నవ్వుతూ అంది.

"అదేం లేదు... మీ మొహంలోనే ఏదో మార్పొచ్చింది."

"ఏమీ లేదు మీ అనుమానం" నవ్వే సింది.

"కాదు నా ఊహ ప్రకారం ... బహుశా" ... అంటూ ఆగిపోయాడు. కమలాకరం ఆమె కళ్ళల్లోకి లోతుగా చూస్తూ...

"ఊఁ... బహుశా... చెప్పండి...

ఫరవాలేదు."

"రాజ్యలక్ష్మి కనిపించిందా ?"

జయంతి వులిక్కి పడింది. ఉలికి పాటును కప్పిపుచ్చుకుంటూ అంది.

"ఎందుకను కుంటున్నారు అలా?"

"ఏం కనిపించిందా ?"

"మీరెందుకలా అనుకుంటున్నారో చెప్పండి ముందు."

"రాజ్యలక్ష్మి ప్రతి సంవత్సరం, ఈ ఉత్సవాలకు వెళుతుంది. ఇలాంటి వంటే ఆవిడకు చాలా యిష్టం"

"అంటే ఆవిడ వస్తుందని తెలిసే, నన్ను పంపించారా?" జయంతి కొద్దిగా తీవ్రంగా అడిగింది.

"నో...నో...అదేం కాదు" కంగారుగా అని "ఆ ఉద్దేశం నాకు లేదు. అయినా ... ఆవిడొచ్చినా, రాకపోయినా అది నాకుసంబంధించిన విషయంకాదు." సర్దిచెపుతున్నట్టు అన్నాడు.

జయంతి యేమీ మాట్లాడలేదు. రాజ్యలక్ష్మి కనిపించిందనిగానీ, కనిపించలేదనిగానీ చెప్పలేదు. కమలాకరం రెట్టించి.అడగనూ లేదుజయంతి లేచి నిలబడింది.

"వెళ్ళిపోతున్నారేం....కూర్చోండి" అన్నాడు.

"వన్ మినిట్...యిప్పుడే వస్తాను" అంటూ బయటకు నడిచింది జయంతి.

అయిదు నిమిషాల్లో తిరిగి వచ్చింది. చేతిలో యేవో కాగితాలున్నాయి. వాటిని కమలాకరం చేతికిచ్చింది.

"ఏమిటివి?" అర్థం కాలేదు అతనికి.

"ఇందులో నా గురించి, రాజారావు గురించి కావలసిన వివరాలున్నాయి"

అంటూ మరో రెండు లావుసైజు తెల్ల కాగితాలు కూడా అతని చేతిలో పెట్టి—

"ఈ తెల్ల కాగితాలమీద సంతకాలు పెట్టాను. మీ లాయర్‌గారితో చెప్పి, నాకూడా రాజారావు నుంచి విడాకుల కోసం అప్లయ్ చెయ్యమనండి. ఇదిగో బ్యాంక్ పాస్‌బుక్...లాయర్‌గారి ఫీజు వగైరాలు చూడండి"

స్థిరంగా, నిశ్చలంగా, నిర్వికారంగా చెప్పింది జయంతి.

సంభ్రమంగా ఆమెవంక చూశాడు కమలాకరం.

"మీరు...మీరు...బాగా ఆలోచించుకున్నారా?"

"ఆలోచించాను యిప్పటికే బాగా ఆలస్యం చేశానేమో అనిపిస్తోంది" చాలా దృఢంగా చెప్పింది జయంతి.



## 19

తను కోర్టులో హాజరు కానవసరం లేకుండానే విడాకులు పొంద గలిగింది జయంతి. రాజారావ్ అభ్యంతర పెడతాడేమో గొడవ పెడతాడేమో అని భయపడింది. కాని, అలాంటివేమీ లేకుండా జరిగిపోయినందుకు కాస్త సంతోషం, బాధా రెండూ కలిగాయి జయంతికి.

తీరా విడాకులిచ్చింతర్వాత తనేమిటో ఒంటరిగా ఫీలయింది జయంతి. ఎక్కడో ఎవరో తనకు వున్నారన్న లీలామాత్రపు భావన కూడా మనసులోంచి తుడిచి పెట్టుకు పోయింది. ఇప్పుడు

జయంతికి ఒకటే ప్రశ్న ... తన భవిష్యత్తేమిటి? ఆ ప్రశ్న వెనకే సమాధానం స్ఫురించినా దాన్ని ఆలోచించడానికిఆమె మనసు ఎందుకో భయపడేది.

తారారావ్, కమలాకరం మీద చర్య తీసుకోవడానికి ఏర్పాటు చేస్తున్న డైరెక్టర్స్ మీటింగ్ ఇంకో రెండు రోజులుంది అది గుర్తొచ్చినప్పుడల్లా జయంతికి బాధ కలుగుతోంది. తన గురించి కమలాకరానికి చాలా ఇబ్బంది వచ్చింది. అతను ఏరకం నిర్ణయం తీసుకున్నా దానికి తనే కారణమవుతుంది. ఏమిటిది? ఎంత... చిత్రంగా వుంది తన బ్రతుకు! తన బ్రతుకు నాశనం చేసిన వ్యక్తి యొక్క భర్త నీడలో తను జీవిస్తోంది. ఇలాంటిది లోకంలో ఎక్కడైనా జరుగుతుందా? వూహించడానికి కూడా అస్కారం లేని చిత్రమైన కథతన జీవితం. కమలాకరం తన పట్ల అభిమానం పెంచుకున్నాడా? అది అభిమానమా? సానుభూతా! తను కమలాకరం పట్ల పెంచుకొన్నదేమిటి?

జయంతి నిట్టూర్చింది.

ఈ ప్రశ్నకు సమాధానం దొరకడం లేదు.

"ఈ వేళ వంట ఏం చెయ్యమంటారమ్మా?" రావఁయమ్మ గొంతు విని వులిక్కి పడింది. తలతిప్పి చూసింది. రావఁయమ్మ కొత్తగా కనిపిస్తోంది. ఆమెలో ఏదో కొత్తదనం ... కాని అది ఏమిటో స్పష్టంగా తెలియడంలేదు.

"ఏమిటమ్మా అలా చూస్తున్నారు!" సిగ్గుపడినట్టు నవ్వుతున్న రావఁయమ్మను జయంతి చిత్రంగా చూసింది.

"ఏమీలేదు. నువ్వు మొన్న ఊరికెళ్ళి వచ్చిన దగ్గర్నించీ కాస్త కొత్తగా కనిపిస్తున్నావ్ అందుకు."

రావఁయమ్మ అంగీకార సూచకంగా నవ్వింది గాని కారణం చెప్పలేదు.

"పద నేనూ వస్తున్నాను" రావఁయమ్మ వెనకాలే వంటగదిలోకి నడిచింది జయంతి. రావఁయమ్మ నడుస్తుంటే ఏదో చిత్రంగా చప్పుడవడం జయంతి చెవుల్ని ఆకర్షించింది. అప్పుడు చూసింది ఆమె కాళ్ళవైపు...పసుపు రాసుకున్న ఛాయలు పూర్తిగా పదలని ఆమె పాదాలు...వేళ్ళకు తళ తళ మెరుస్తున్న కొత్త వెండి మట్టెలు.

"రావఁయమ్మా !" ఆశ్చర్యంగా అంది, అంతకంటె ఏమనాలో తెలియక. రావఁయమ్మ తన కాళ్ళవంక చూసుకొని నవ్వుకొంది.

"ముందు వంట చెయ్యనివ్వండి, తరువాత అంతా చెబుతాను. ఏం వండమంటారు." ఆశ్చర్యంగా ఆలోచిస్తూ కూరల బాస్కెట్‌లోంచి కాలీఫ్లవర్ తీసి బయట పెట్టింది జయంతి. దాదాపు ముప్పై అయిదేళ్ళ రావఁయమ్మకు, పెళ్ళి అవలేదని ఎప్పుడూ అనుకోలేదు. ఆమెను ఎప్పుడూ పెద్ద పరిశీలనగా చూడలేదు.

* * *

భోజనాలైన తర్వాత తాపీగా కూర్చొని తన చరిత్రంతా చెప్పడం మొదలు పెట్టింది రావఁయమ్మ. జయంతి ఆశ్చర్యంగా ఆమె చెప్పేది వింటోంది.

"మాది యిక్కడకు దగ్గరున్న పల్లెటూరేనమ్మా. నా పదోఏట నుంచి, ఇలా పట్నంలో పెద్దపెద్దోళ్ళ ఇళ్ళల్లో వంటలు చెయ్యడమే నా పని. అందుకే నా మాటలు కూడా పల్లెటూరి దాని మాటల్లా

వుండవ్."

జయంతి అవునన్నట్టు తలూపింది.

"నాకు అయ్యి వుండేవాడు. నన్ను పదోఏట నా మేనమామకిచ్చి పెళ్ళి చేశాడు."

"పదో ఏటా!"

"అవునమ్మా! మా కులంలో ఇది చాలా మామూలు. అప్పటికి వాడి వయసు యిరవై ఏళ్ళు నన్ను పెళ్ళి చేసుకున్న వారం రోజులకే వాడు 'పటాలం'తో కలిసి ఎక్కడికో పోయాడు."

"అదేమిటి! మరి!..." సానుభూతిగా అంది.

రావఁయమ్మ కిసుక్కున నవ్వింది.

"అంతేనమ్మా మరెళ్ళిపోడూ! నాకు పదేళ్ళు, వాడికి యిరవై. నేనెందుకు పని కొస్తాను వాడికి" మళ్ళీ నవ్వింది.

ఆమె చెబుతున్న విషయం వింటుంటే జయంతికి కాస్త సిగ్గేసి నట్టయింది.రావఁయ్యమ్మలో అంత చతురత వుందను కోలేదు.

"ఆ తరవాత ఏడాదికో వుత్తరం చొప్పున, రెండేళ్ళు రెండుత్తరాలు రాశాడు వచ్చేస్తానని. కాని, వాడు రాలేదు. ఈ రోజుదాకా వాడు రాలేదు."

"అంటే ఏమయ్యాడో కూడా తెలియదా!"

"ఉహుఁ... బ్రతికున్నాడో లేదో కూడా తెలీదు. ఇరవై మూడు సంవత్సరాలు వాడి గురించి ఎదురు చూశాను."

"ఇరవై మూడు సంవత్సరాలు" విస్మయంగా తనలో తనే గొణుక్కుంది జయంతి.

"అవునమ్మా యిన్నేళ్ళూ వాడొస్తాడని గిరిగీసుక్కూర్చున్నాను. మా కులపోళ్ళు ఎంతోమంది అడిగారు మనువు చేసుకోమని".

"అంటే మళ్ళీ పెళ్ళా!"

"మా కులంలో తప్పులేదు. పాతిక రూపాయలు సంఘం పెద్దలకు కట్టెయ్యడమే. అసలు నన్నడిగితే ఏ కులంలోనైనా రెండో పెళ్ళి ఎందుకు తప్పు... మగోళ్ళు చేసుకుంటే లేంది, ఆడదాని

కేమొచ్చింది."

జయంతి తలూపింది.

"మొన్నటిదాకా చూసి చూసి విసుగొచ్చి, మా ఊళ్ళోనే నాకు దగ్గరోడే అనుకోండి ఎల్లయ్య. అసీ... నేనంటే చాలా అభిమానం...నన్ను చేసుకోవాలని అయిదేళ్ళనుంచీ ప్రయత్నం. వాణ్ని చేసేసుకున్నాను" నవ్వింది. జయంతి ఆమెను కొత్తగా ఆపాదమస్తకం పరిశీలిస్తోంది. మనిషిలో నిలువెల్లా ఏదో ఆనందం వుట్టిపడుతోంది. జయంతిలో ఆమె రూపం, మాటలు ఏవేవో కొత్త ఆలోచనల్ని లేపుతున్నాయి.

"ఇంతకాలం చూశావ్‌గదా... మరి ఇంకొంతకాలం ఎందుకు ఆగలేక పోయావ్?" జయంతి ఆమెను ప్రశ్నించింది.

వెంటనే సమాధానం యిచ్చింది.

"అప్పుడు మాత్రం వస్తాడనేమిటమ్మా నమ్మకం! ... వస్తే మాత్రం నువ్వు ఇప్పటిదాకా నీతిగా వున్నావా అని వాడు అడిగితే ఏం చెప్పాలి! ఎలా నమ్మించాలి! ఏ మగోడికైనా వస్తుంది అలాంటి అనుమానం...ఇప్పటికే చాలా వయసయి పోయింది. ఇంకా చూస్తే యిలాగే ముసలిదాన్నయి పోవడమే... అయినా వాడికిప్పుడు దగ్గర దగ్గర యాభై యేళ్ళుంటాయ్, వాడెందుకు పనికొస్తాడు చెప్పండిక"... రావమ్మ నవ్వుతోంది. జయంతి మనసు అప్రయత్నంగా ఏవేవో ఆలోచనల్లోకి జారిపోతోంది. ఏదో పరిష్కార మార్గం కోసం అన్వేషిస్తోంది. రావమ్మ ఏదో చెప్పేస్తోంది...

"ఏంటమ్మా ఆలోచన" రావమ్మ అడిగింది.

"అబ్బెబ్బె...ఏమీ లేదు" తడబడింది జయంతి.

"అసలు యిన్నాళ్ళ నుంచీ నేనే మయానో అన్న ధ్యాస కూడా లేనోడి గురించి నేనెందుకునా బ్రతుకు అన్యాయం చేసుకోవాలి! మీరే చెప్పండి ... నేనేమైనా తప్పు చేశానా?"

జయంతి వెంటనే ఏమీ చెప్పలేక పోయింది. ఆమె మళ్ళీ రెట్టించటంతో చెప్పక తప్పలేదు.

"లేదు రావమ్మా, నువ్వేం తప్పు చెయ్యలేదు."

రావమ్మ తృప్తిగా నవ్వింది. జయంతికి చప్పున ఒక విషయం స్ఫురించింది.

"రావమ్మా!నేనో సంగతి అడుగుతాను చెబుతావా ?"

"అడగండి."

"మరోలా అనుకోకు నీ కిష్టమైతేనే చెప్పు."

"అనుకోడానికేముంది అడగండి" ఆమె ఏం అడగబోతోందో అంచనా వేసుకోడానికి ప్రయత్నిస్తూ అంది రావమ్మ.

"నువ్వీ యింట్లో ఎంతకాలం నుంచీ వుంటున్నావ్?"

"దాదాపు పదేళ్ళనుంచీ"

"అంటే...రాజ్యలక్ష్మిగారికీ, కమలాకరంగారికీ పెళ్ళయిన దగ్గర్నుంచీ"

"అవును"

"రాజ్యలక్ష్మిగారు ఈ యింట్లోంచి బైటకి వెళ్ళిపోడానికి కారణం చెప్పగలవా?"

రావమ్మ ఎందుకో జయంతి కళ్ళ

లోకి లోతుగా చూసింది.

"ఎందుకు అడుగుతున్నారు !"

"ఏమీలేదు వూరికేనే!" తడబడింది.

"అమ్మగారు వెళ్ళిపోడానిక్కారణం... ఇంతకు ముందు వీధి గదిలో వుండేవారు. రాజారావుగారని...ఆయనే."

జయంతి గుండె ఝల్లు మంది. రాజారావు పేరు రావమ్మ నోట్లో విచిత్రంగా వినబడుతోంది.

"అవుననుకో ... నిజమే" తన కంగారు కప్పిపుచ్చుకొంటూ అంది

"నేనడిగేది అదికాదు. కమలాకరం గారు ఆవిడ్ని బాగా చూసేవారు కాదా?"

"ఎందుకు చూసేవారు కాదు. బాగానే చూసేవారు. కాని ఎందుకో యిద్దరికీ క్షణం పడేదికాదు. రెండు రోజులు బాగా వుంటే ... రెండు రోజులు ఎడముఖం పెడముఖం."

"ఏం...ఎందుకని"

"ఇద్దరి తప్పూ వుందనుకోను వాళ్ళకి కుదర్లేదు అంతే!"

"మరి... ఆవిడ అలా వెళ్ళిపోవడం తప్పుకాదా ?"

"కావాలని వెళ్ళింతర్వాత.. అందులో కష్టమొచ్చినా, సుఖంలాగే కనిపిస్తుంది."

రెండు నిమిషాలు ఏదో ఆలోచిస్తూ వుండి పోయిన తర్వాత జయంతి అడిగింది. రావమ్మా తనను ఎందుకో ఎగాదిగా పరిశీలించటం జయంతి గుర్తించింది.

"రావమ్మా.. మరి... ఇప్పుడు మీ ఆయన తిరిగొచ్చాడనుకో, అతనికి సమాధానం ఏం చెబుతావ్?"

"బయటకు పొమ్మంటాను... నీకూ నాకూ ఏరకమైన సంబంధం లేదంటాను" తడుముకోకుండా చెప్పింది.

జయంతికి రకరకాల జీవితపు విలువలు అర్థమైనట్లు అని పి ం చా యి. సమాజంలో వుండే రకరకాల వర్గాల్లో, ఒకే సమస్యలు రకరకాలుగా కనిపిస్తాయి అనుకుంది.

"నేనొకటి అడగాలనుకుంటున్నాను. తమరేమీ అనుకోరు గదా!" హఠాత్తుగా రావమ్మ వేసిన ప్రశ్నకు జయంతి మనసు రెపరెపలాడింది. ఆమెను తను అడిగింది కాబట్టి, తనను ఆమె అడిగే అధికారం ఆమెకు తను యధాలాపంగా యిచ్చినట్టే, మరి అడగమన్నట్టు తలూపింది.

"మీరేం అనుకోగూడదు మరి" రావమ్మ మరీ మరీ చెబుతోంటే ఆమె ఏమడగబోతోందో అని జయంతికి అనుమానంగా అనిపించింది. అ యి నా తప్పదు

"ఫరవాలేదు నేనేమీ అనుకోను"

"మీకు పెళ్ళయిందా ?"

వులిక్కిపడింది జయంతి. అప్రయత్నంగా ఆమె చెయ్యి తన మెడను తడుముకుంది. ఇక్కడికొచ్చిన మరునాడే తనకు పెళ్ళయిందన్న గుర్తులన్నీ తీసేసింది. ఆమె అలా అడుగుతోంటే ఏం చెప్పాలో అర్థంకాలేదు. తాతారావు తనను అడిగిన ప్రశ్నే ఈమె మరోలా అడుగుతోంది. సమాధానం కూడా అతనికిచ్చినట్లే యిచ్చింది "నువ్వేమనుకుంటున్నావ్ ?"

"అయిందనుకుంటున్నాను" జంకూ గొంకూలేకుండా చెబుతున్న రావమ్మ మాటలకు జయంతి గతుక్కుమంది. తన తడబాటు కనపడకుండా అంది

"ఎందుకనుకుంటున్నావ్!"




"ఎందుకంటే" అని జయంతి మెడ వంక చూసి మళ్ళీ "మంగళ సూత్రం, నల్లపూసలు లేకపోయినా పెళ్లయిన వాళ్ల మొహాలు వేరేగా వుంటాయి" అంది.

జయంతి అవుననీ కాదనీ అనిపించ కుండా చిన్నగా నవ్వి వూరుకొంది.

"మీరేం అనుకోపోతే యింకో విష యం మీకు చెబుతాను"

"చెప్పు"

"మీరెవరో నాకు తెలుసు"

అదిరిపడింది జయంతి. రావమ్మ తనను అనుమానంగా చూస్తూంటే భరించ లేక పోయింది.

"నేను...నేను ఎవర్ని !

"మీరు రాజారావుగారి భార్య అవునా?" నిశితంగా అడుగుతోంది.

"రావమ్మా" జయంతి గొంతు తడారిపోయినట్లయింది. నరాలు ఏదో తెలీని వుద్రిక్తతతో బిగుసుకున్నాయి.

"నీ...నీకెలా తెలుసు !"

"ఆ బాబుగారి గదిలో టేబిల్ మీద మీ పటం చాలాసార్లు చూశాను."

జయంతికి తను ఏం చెప్పి లాభం లేదని అర్థమైపోయింది. నెమ్మదిగా తల వంచుకొని నేల చూపులు చూస్తూ అవు నన్నట్టుగా తల వూపింది. తరువాత నాలుగయిదు నిమిషాలు యిద్దరూ నిశ్శ బ్దంగా వుండిపోయారు. చివరికి రావ యమ్మే అంది

"మీరు చేసింది చాలా ధైర్యమైన పనే కాని..."

జయంతి చప్పున తల పైకెత్తింది.

"రావమ్మా ! నువు కూడా" బాధగా అంది.

"మరోలా అనుకోకండి మిమ్మల్ని తప్పుగా మాట్లాడటంలేదు. ఇన్నాళ్ళు ఈ యింట్లో వున్నారు. మీ సంగతి నాకు తెలుసు"

ఆమె సంస్కారానికి జయంతి ఆశ్చర్యపోయింది.

"ఇంతవరకూ మీరు చేసింది బాగానే వుంది. కాని యింకా మీరెందుకు సంశయిస్తున్నారో అర్థం కావడంలేదు"

"సంశయమా!" అర్థంకానట్టు అడి గింది.

"అవును. కమలాకరంగారు మీరంటే యిష్టపడుతున్నారు. మీరూ ఆయనా పెళ్ళి చేసుకోవచ్చుగదా!" చాలా సాధార ణంగా అంది.

"రావమ్మా!" సిగ్గు, కోపం కల గలిపి జయంతి మొహంలో ఎర్రగా ప్రతిఫలించాయి.

"కోపగించుకోకండి. రాజ్యలక్ష్మిగారి వల్ల అయ్యగారు, రాజారావుగారి వల్ల మీరూ నష్టపోయారు. మీరిద్దరూ ఎందుకు పెళ్ళి చేసుకోకూడదు?"

"రావమ్మా" వారిస్తున్నట్టుగా అంది. అయినా రావమ్మ మానలేదు.

"యిన్నాళ్ళూ మీరేమన్నా అను కుంటారని చెప్పలేదు. ఇప్పుడు మీరేం అనుకున్నా బాధలేదు. ఎల్లుండి నేను పనిమానేసి వెళ్ళిపోతున్నాను."

"ఎక్కడికి"

"సంసారానికి. అందుకే చెప్పే రెండు ముక్కలూ ధైర్యంగా చెప్పేస్తున్నాను. వాళ్ళిద్దరూ వెళ్ళిపోయి సుఖంగా బ్రతుకు తున్నారు వాళ్ళకి సరిపోయింది. మీ యిద్దరికీ సరిపోయింది. మీ యిద్దరూ కూడా సుఖంగా బ్రతకండి. ఎవరో ఏదో అనుకుంటా రనుకోవడం వెర్రి తనం.

అంతా చేతులు దాటిపోయింతరువాత కావాలనుకున్నా రాదు. మీ బ్రతుకు మీది. మీ సుఖం మీది. అంతే.. ఇందులో ఏముంది.. ఆవిడక్కడ, మీరిక్కడ.."

జయంతి అవాక్కయిపోయింది.



## 20

"డాడీ పిలుస్తున్నారు మేడమ్.."

సాగర్ వచ్చి చెప్పాడు. జయంతి అలాగే అన్నట్టు తల వూపింది జడ వేసుకుంటూ..

సాగర్ స్కూలు బాక్సులో ఆ రోజు ఏవేం పుస్తకాలు కావాలో సర్దుకోడం ప్రారంభించాడు. జయంతి నెమ్మదిగా కమలాకరం గదిలోకి వెళ్ళింది. ఏదో ఆలోచిస్తూ కమలాకరం ఆఫీసుకెళ్ళ డానికి సిద్ధంగా వున్నాడు దుస్తులేసు కొని.

"రండి.. రండి.." ఆహ్వాన పూర్వ కంగా అన్నాడు. అతని మొహంలో రోజూ కనిపించే గాంభీర్యం రెట్టింపై కనిపిస్తోంది.

"కూచోండి" యెదురుగా వున్న కుర్చీ చూపించి తను లేచి నిలబడ్డాడు. జయంతి మౌనంగా కూర్చుంది.

కమలాకరం ఏదో చెప్పడానికి నలుగుడు పడుతున్నట్టు చేతులు వెనక్కి కట్టుకొని, అటూ యిటూ పచార్లు చెయ్యడం ప్రారంభించాడు. నిమిషం తర్వాత అన్నాడు

"ఈ వేళే డైరెక్టర్స్ మీటింగ్"

జయంతి గుండె ఝల్లుమంది

"మీరు.. మీరు.. ఏం నిర్ణయించు కొన్నారు ?" భయంగా అడిగింది.

కమలాకరం ఆమె వంక చూశాడు. తన వంక బెదురుగా చూస్తున్న ఆమె కళ్ళలోకి చూసి నవ్వాడు.

"నేనింకా ఏమీ నిర్ణయించుకోలేదు వాళ్ళు నన్ను ఏం అడుగుతారో తెలి యాలిగా !"

"తాతారావుగారికి క్షమాపణ చెప్పుకో మంటే !"

"నిస్సందేహంగా చెప్పను. అవసర మైతే ఉద్యోగానికి రాజీనామా చేస్తాను."

"వద్దు.. వద్దు.." కంగారుగా అంది.

"మరి.."

"మీ తరపున . కాదు.. కాదు.. మీ బదులు నేను క్షమాపణ చెప్పుకుంటాను ఆయనకు."

"మీరా !" ఆశ్చర్యంగా చూశాడు ఆమె మొహంలోకి. ఆమె కళ్ళు లీలగా తడిచేరి వున్నాయ్.

"అవును. నా గురించి మీరు నష్ట పోగూడదు. ఇప్పటికే మీరు నా వల్ల చాలా యిబ్బంది పడ్డారు. నేను..నేను.." ఆపైన దుఃఖంతో గొంతు పూడుకు పోయింది. ఆమె గట్టిగా ఏడ్చేసింది.

"జయంతీ.." సంభ్రమంగా, ఆశ్చ ర్యంగా అన్నాడు కమలాకరం.

"ప్లీజ్.. మీరలా ఏడవకండి.. నేను భరించలేను.." ఆమె దగ్గరగా వచ్చి నిలబడి అనునయంగా అంటున్న అతన్ని జయంతి కన్నీటి పొరవెనకనించి అస్ప ష్టంగా చూడగలిగింది. రెండు మూడు

నిమిషాలు మళ్ళీ అటూ యిటూ తిరిగాడు

"సరే అయితే! నేను చెప్పేది వినండి.." ఏదో నిర్ణయానికొచ్చినట్టు అన్నాడు కమలాకరం.

జయంతి తేరుకొని పమిటతో కళ్ళద్దుకొని సరిగా కూర్చుంది.

"బహుశా మరో గంటలో మీటింగ్ మొదలు కావచ్చు! వాళ్ళు అడిగితే.. తప్పని సరైతే.. మీరు చెప్పినట్టేచేద్దాం. మీరు ఫోన్ దగ్గర కూచోండి. అవసరమైతే ఫోన్ చేస్తాను.."

జయంతి తలూపింది. కమలాకరం ఆమె వంక దీర్ఘంగా చూశాడు.. అతని కళ్ళల్లో కదులుతున్న ఏదో ఆనందం.. జయంతికి సరిగా అర్థం కాలేదు..



## 21

"నేను వెళ్ళిపోతున్నానమ్మా! నాకు సెల విప్పించండి.." నవ్వుతూ అంటున్న రావమ్మ వైపు బెంగగా చూసింది జయంతి.

"వెళ్ళిపోతున్నావా!. అయ్యగారితో చెప్పావా ?"

"నిన్ననే చెప్పాను" రావమ్మ కళ్ళుఏదో సంతోషంతో, వుత్సాహంతో వెలిగిపోతున్నాయి.

జయంతికి చప్పున ఏదో గుర్తొచ్చింది

"ఒక్క నిమిషం ఆగు రావమ్మా" గబగబా లోపలికి నడిచింది. రెండు నిమిషాల్లో తిరిగొచ్చిరావమ్మ చేతిలో వంద రూపాయల కాగితం పెట్టింది.

"ఇదేమిటమ్మా ... నాకెందుకు" మొహమాటంగా అంది.

"ఫరవాలేదు వుంచు.. కొత్త సంసారం గదా ఏదో ఒకటి కొనుక్కో.."

"నా మాటకేంగాని మీరేం ఆలోచించుకొన్నారు ?"

"ఏమిటి ?" ఆమె అడిగిందేమిటో అర్థమైనా అర్థం కానట్టు అడిగింది.

"అదే...అయ్యగారూ, మీరూ" చిన్నగా నవ్వింది.

రావమ్మను నిన్నటి నుంచీ అడగాలనుకొంటున్న ఒక ప్రశ్న గుర్తొచ్చింది జయంతికి. "రావమ్మా నేనో ప్రశ్న అడుగుతాను సమాధానం చెప్పు. నువ్వుచెప్పినట్టే నేనుచేస్తాననుకో. అప్పుడు రాజ్యలక్ష్మిగారికీ, నాకూ తేడా ఏమిటి? ఏమిటి తేడా! ఏమీ లేదు. అంతే కదూ!"

ఊహించని యీ ప్రశ్నకు రావమ్మ కాస్సేపు సమాధానం తడుముకొంది. ఆమె యేం చెబుతుందోనని ఆసక్తిగా ఆమె వంకే చూస్తోంది జయంతి.

"తేడా లేకేం, వుంది."

"ఉంటే చెప్పు అదేమిటో"

"ఉన్న అందమైన గూడు వదిలేసుకొని, మరో గూట్లోకి పోయిన కాకి రాజ్యలక్ష్మి అమ్మగారు. వుండటానికి గూడు లేక, తల దాచుకోడానికి యీ గూట్లోకి చేరిన కోయిల మీరు" రావమ్మ కవితాధోరణి జయంతికి నవ్వు పుట్టించింది.

అత్యంత మితభాషిగా వుండే రావం యమ్మలో యీ మార్పు బహుశా వుప్పొంగుతున్న వుత్సాహం వల్ల వచ్చి వుండాలి. అపుకోలేని ఆనందం ఒకో మనిషిని మాటరాకుండా చేస్తే మరొకరికి మాటలు నేర్పుతుంది కాబోలు.

"మీరు మరోలా ఆలోచించకుండా నేను చెప్పినట్టు చెయ్యండి. మనిషి తాప త్రయ పడేది సుఖం కోసమే కదా!"

రావంయమ్మ ఏదేదో చెబుతోంది జయంతి సరిగా వినడంలేదు.

"మరి నే వస్తానమ్మా" గట్టిగా చెబుతున్న రావంయమ్మ గొంతు విని వులిక్కిపడి అలాగే అన్నట్టు తల ఊపింది.

రావంయమ్మ వెళ్ళిపోయింది.

జయంతి ఏదో ఆలోచిస్తూ హాల్లోకి నడిచింది.

గోడగడియారం పదకొండుగంటలు కొట్టింది.

మరో అరగంటలో ఫోన్ మోగింది.

జయంతి ఫోన్ తీసి రిసీవర్ చెవి కానించుకొంది.

"యస్ నేను, జయంతిని మాట్లాడు తున్నాను" అంది.

అవతల్నించి కమలాకరం గొంతు వినిపించింది

"మీటింగ్ యిప్పుడే పూర్తయింది" అతని గొంతులో ఏ భావమూ లేదు.

"మరి...మరి...ఏం నిర్ణయించారు" ఆతృతగా అడిగింది.

"మనం అనుకున్నట్టే తాతారావు గార్కి నేను అపాలజీ చెప్పాలన్నారు"

"మరి మీరేమన్నారు?"

"చెబుతున్నానుగా వినండి" అతని నవ్వు యీసారి స్పష్టంగావుంది. "అయితే కథ మరోలా వచ్చింది"

"అదేమిటి! ఏం జరిగింది?"

"అవును నేనూ గట్టిగా వాదించాను. తాతారావుగారు నా యింటికొచ్చి, నా మనిషిని తిట్టడం తప్పుకదా అని అడి గాను. అది తప్పుకానప్పుడు నేను ఆయన యింటికెళ్ళి తిట్టడం కూడా తప్పు కాకూడదు కదా! గంటసేపు నానారభసా జరిగింతర్వాత వాళ్ళు ఒక మినహా యింపుతో తాతారావుగారికి నేను క్షమా పణ చెప్పనవసరం లేకుండా తీర్మానిం చారు."

"ఏమిటది ఏమిటా మినహాయింపు"

"మీరెవరో స్పష్టంగా చెప్పమంటు న్నారు. దాన్ని బట్టి తాతారావుగారు చేసింది తప్పా, కాదా అని నిర్ణయిస్తారు"

"అదేమిటి! అదేం న్యాయం!"

"ఏం చేస్తాం! ఎంతైనా వాళ్ళూ వాళ్ళూ ఒక్కటే. అంగీకరించక తప్ప లేదు. మరోగంట టైమిచ్చారు"

"మరి ఏదో ఒకటి చెప్పలేక పోయారా?"

"ఏం చెప్పమంటారు మీరు నాకు అతిముఖ్యమైన మనిషని చెప్పగలిగితేనే నేను తాతారావుకి క్షమాపణ చెప్పుకో నవసరం లేదు. అదితెలియకే మీకు ఫోను చేశాను. మీరే చెప్పండి....మిమ్మల్ని యెవరని చెప్పమంటారు.చెప్పండి".

జయంతి గుండె ఝల్లుమంది. ఏం సమాధానం చెప్పాలి. అసలు కమలా కరం యెందుకడుగుతున్నాడు?

"మీరు...మీరు...ఏం చెబుదామను కుంటున్నారు?"

"మీరు చెప్పమన్నది"

"అంటే?"

"మీకు యెలా యిష్టమైతే అలా"

"నాకు ఎలా యిష్టమనుకుంటున్నారు మీరు?"

"అది మీరు చెబితేనే నాకు తెలుస్తుంది"

జయంతి నిమిషంపాటు ఆలోచనలో వుండిపోయింది.

"మీకెలా అయితే యిష్టం?" చివరికి అడిగింది.

"అది చెప్పేముందు యింకో వివరణ కూడా చెప్పాలి మీకు"

"చెప్పండి"

"ఇవాళ నేను చెప్పేదానికి, తరవాత ఋజువులు చూపాలి".

"ఊహూఁ..."

"ఇప్పుడు చెప్పమంటారా!"

"చెప్పండి"

"మీరు...మీరు....నా కాబోయే భార్యనీ, రేపే మనం పెళ్ళి చేసుకోబోతున్నామనీ చెప్పటం కంటే, యీ ప్రపంచంలో మరేదీ యిష్టంలేదు నాకు. అలా చెప్పమంటారా? మరో గంట టైముంది. బాగా ఆలోచించి ఫోన్ చెయ్యండి". అవతల రిసీవర్ పెట్టేసిన చప్పుడు... గోడ గడియారం ఖంగు ఖంగుమని గంటలు కొడుతోంది. జయంతి సర్లుగా అలాగే ఫోన్ పట్టుకొని చాలా సేపు నిలబడిపోయింది.

గడియారం చప్పుడు చేస్తోంది.

తనేం చెయ్యాలిప్పుడు. ప్రశ్న వెనక సమాధానం...దానివెనక ప్రశ్న. అతని కర్తవ్యం అతను నిర్వర్తించాడు. మిగిలింది తనదే..కమలాకరం మాటలూ, రావమ్మ మాటలూ వరుసగా యేవేవో గుర్తుకొస్తున్నాయి. ఏం చెయ్యాలి... ఏం చెయ్యాలి. అసహనంగా లేచి నిలబడింది. ఇల్లంతా తిరిగింది.

కాస్సేపు రెండు మూడు పత్రికలు అటూ యిటూ తిరగేసింది. కళ్ళు మూసుకొని, మనసును అదుపులో పెట్టుకుంటున్నట్టుగా కూర్చుని, లేచి నిలబడింది. తన సూట్‌కేస్ తెరిచింది. అడుగున దాచిన రాజారావు డైరీ, తనూ అతనూ కలిసి తీయించుకున్న ఫోటో బయటికి తీసింది. ఆ ఫోటో వంక చూస్తుంటే, యింతకుముందు తనలో రేగే భావనలు యిప్పుడు లేవు. బాధా లేదు, యే భావమూ లేదు. నిట్టూర్చి వంటగదిలోకి నడిచింది.

స్టవ్ అంటించి జాగ్రత్తగా ఫోటో, డైరీ మంటలో వేసింది. రెండూ అంటుకున్నాయి. ఒంటిగంటకు అయిదు నిమిషాలుంది.

నెమ్మదిగా రిసీవర్ పైకెత్తి, నంబర్ డయల్ చేసింది. అర నిమిషం తర్వాత అటునుంచి కమలాకరం గొంతు...

"యస్...కమలాకరం స్పీకింగ్".

"నేను జయంతిని మాట్లాడుతున్నాను".

"యస్...చెప్పండి" కమలాకరం గొంతులో ఆత్రుత.

"నా నిర్ణయం చెప్పేముందు ఒక విషయం చెప్పాలి." రెండు క్షణాలు నిశ్శబ్దంగా ఆగి, "నేను ఎప్పటికీ తల్లినయ్యే అవకాశం లేదు..." బిగబట్టిన వూపిరి, విడిచిన స్పష్టమయిన శబ్దం ఫోనులో వినిపించింది.

"సాగర్...సాగర్...మీ కొడుకే!" కమలాకరం స్వరంలో వుద్వేగం.

"అయితే.. అయితే...ఇందాక మీరు చెబుతానన్నట్టుగానే చెప్పండి" నెమ్మదిగా

వణుకుతున్న గొంతుకతో అంది.

* * *

ధీరసమీరే...యమునా తీరే
వసతి వనే...వనమాలీ'...

మృదు మధురంగా వినబడుతోంది టేప్ రికార్డర్‌లోంచి.

"సాగర్ నిద్రపోయేటప్పటికి ఆలస్యమైంది" మంచం మీద కమలాకరం పక్కన కూర్చుంటూ నెమ్మదిగా అంది. నీలంరంగు బెడ్‌రూమ్ లైటు వెలుగులో ఆమె అందం ద్విగుణీకృతమవుతోంది.

కమలాకరం ఆనందంగా నవ్వాడు. ఆమె చేతిని ఆప్యాయంగా తన చేతిలోకి తీసుకొని నెమ్మదిగా అన్నాడు—

"ఒక విషయంలో నన్ను క్షమించాలి"

"దేనికి?" ఆశ్చర్యంగా అడిగింది.

"నిజానికి డైరెక్టర్సు మీటింగ్‌లో తాతారావుగారి చేతే నాకు క్షమాపణ చెప్పించారు."

"మరి...!" ఆశ్చర్యంగా అంది జయంతి.

కమలాకరం చిన్న కుర్రాడిలా నవ్వాడు. జయంతి కూడా యేదో అర్థమైనట్టు చిలిపిగా నవ్వేసింది.

మృదువుగా కమలాకరం చేతులు ఆమెను చుట్టుకొని, దగ్గరకు లాక్కుంటున్నాయి.

'గోపీ పీన పయోధర మర్దనా...
చంచల కరయుగ సాలీ...
ధీరసమీరే...యమునా తీరే'...

టేప్ రికార్డర్‌మీద మధురంగా సాగుతోంది పాట.



# మాయ బాబా

బీహారులో దైవస్వరూపుడుగా వేలాది భక్తులచే పూజలందుకుంటున్న 'కన్వారియా బాబా" హత్యతో భక్తులు కళ్ళు తెరిచారు.

శ్రావణ మాసంలో ప్రతిదినం వేలాది మంది యాత్రికులు సుల్తాన్‌గంజ్‌లోని పవిత్ర గంగా జలాన్ని బిందెలతో తీసుకొని, వాటిని పొడుగాటి వాసాలకు కట్టి, అక్కడికి 120 కిలో మీటర్ల దూరంలో గల వైద్యనాథ్ ధామ్ కి మోసుకెళ్ళి పూజా కార్యక్రమాన్ని జరిపించటం ఆచారం.

సుల్తాన్‌గంజ్, వైద్యనాథ్ ధామ్‌ల మధ్యలోనే బల్బన్‌పూర్ దగ్గర ఓ పెద్ద ధర్మశాల ఉంది. యాత్రికులు రాత్రి పూట అక్కడ విశ్రాంతి తీసుకుని, తిరిగి తెల్లారే మిగతా ప్రయాణాన్ని సాగించేవారు.

ఆ ధర్మశాలలోనే "కన్వారియా బాబా" శివ వేషధారియై, ఒళ్ళంతా ప్లాస్టిక్ పాముల్ని చుట్టుకుని, అరమోడ్పు కన్నుల్తో వేలాది భక్తులకు దర్శనమిచ్చేవాడు. అతనిలోని తేజస్సును చూసి స్త్రీలు ఆకర్షితులై తమకష్టాలు నివేదించుకునే వారు. రహస్య మందిర వ్రతం పేరుతో స్త్రీలను నమ్మించి తన కామ దాహం తీర్చుకునేవాడు బాబా. అతనిపై పోలీసులకు ఎన్ని ఫిర్యాదులు వెళ్ళినా, బాబాకుగల రాజకీయ పలుకుబడివల్ల ఎవరూ ఏమీ చేయలేకపోయారు.

ఈ ఏడాది జూలై 26న కలకత్తా నుంచి ఓ యువకుడు తన సోదరితో వచ్చి ధర్మశాలలో విడిది చేశాడు. బాబా ఆమెపై కన్నువేసి, మాయ మాటలతో ఆమెను వశపర్చుకుని, ఆమె తిరిగి కలకత్తా వెళ్ళకుండా నిర్బంధించాడు. దానితో యాత్రికులకు బాబా బండారం బయటపడి కర్రలతో దాడిచేశారు. ప్రక్కనున్న అడవిలోకి పారిపోయే ప్రయత్నంలో బాబా మృత్యువును కావలించుకున్నాడు.



'వీరేంద్ర చౌదరి అనే అసలు పేరుగల ఈ బాబా 1934లో బీహార్‌లో జన్మించాడట. దొంగల ముఠాతో చేరి మార్వాడి వ్యాపారస్తుని వద్ద బంగారు ఆభరణాలు దొంగిలించి పరారయ్యే సమయంలో తన కాలి మడమల్ని కోల్పోయాడు.

బాబాగా అవతారమెత్తి పగలు సాధువుగా ఉంటూ, రాత్రుళ్ళు విలాస కార్యక్రమాల్ని సాగించేవాడు. స్త్రీలు తండోపతండాలుగా వచ్చే ఆ క్షేత్రంలో బాబాకి కామతృష్ణ నిర్విఘ్నంగా తీరుతుండేదిట.

# చైనా భోజనం

'చైనా వంటకాల్ని గురించి ప్రపంచ మంతా ప్రత్యేకంగా చెప్పుకొంటారు. దానికి తగ్గట్టు చైనా ప్రభుత్వం తమ ప్రజల ఆహారపు అలవాట్లలో పెద్ద మార్పును తీసుకు రావాలని ప్రచారం సాగిస్తుంది.

"ఆహార విధానంలో చైనా ముందంజ", "భోజనం తయారీలో విప్లవం" అనే శీర్షికలతో చైనా పత్రికలు సంపాదకీయాలు, వ్యాసాలు రాస్తున్నాయి.

ఆహార పదార్థాల తయారీలో కాలాన్ని వృధా చేయకుండా, పదార్థాలు వ్యర్థ పరచకుండా మితంగా వినియోగించుకునే మార్గాలను ఈ పత్రికలు ప్రచారం చేస్తున్నాయి.

వంట పనికే అధిక కాలాన్ని వృధా చేయక ఆ సమయాన్ని నిర్మాణాత్మక కార్యక్రమాలకి ఉపయోగించాలని ఆహారపు అలవాట్లలో పూర్తి మార్పు రావాలని, భారీ ఎత్తున చైనాలో ప్రచారం సాగుతోంది.

దానితో చైనాలో హోటళ్ళకు రద్దీ పెరిగింది. ఆ దేశంలో 50శాతం మంది ఉదయం ఫలహారానికి హోటళ్ళకెళ్ళటం అలవాటు చేసుకున్నారు.

షాంగై నగరంలో గల 12,000 హోటళ్ళలో ఒక్కదాన్నైనా అక్కడి ప్రతి వ్యక్తీ రోజూ దర్శించక మానడు. రద్దీ పెరగ్గానే హోటళ్ళ నిర్వహణలో



లోపాలు బయటపడి, చైనా ప్రభుత్వం తగిన చర్యలు తీసుకునే సన్నాహాలు చేస్తోంది. మొత్తానికి చైనా వంటకాల్లో పెద్ద విప్లవమే వచ్చింది.

# 11వ ఏటనే డాక్టరేట్

ఆఫ్ఘనిస్థాన్‌కి చెందిన సయ్యద్‌కరీం లెక్కలమేస్టారు. తన కొడుకు జలాల్ అయిదేళ్ళ వాడుగా ఉన్నప్పుడు 1నుండి 10వరకు అంకెలు కంఠతా పట్టమని చెప్పాడు. తండ్రి అలా చెప్పాడో లేదో, వెంటనే అవి వప్పజెప్పేసి, వాటి తరువాతి అంకెలు చెప్పమని మారాం చేశాడట. 4గంటల్లో జలాల్ కోటి వరకు అంకెల్ని లెక్కించ గలిగాడు. మరో రెండు రోజుల్లో కూడికలు, తీసివేతలు, హెచ్చవేతలు, భాగాహారాలు - లెక్కల్లోని అన్ని అంశాల్ని నేర్చేసుకున్నాడు.

కరీం తన కొడుకు తెలివితేటలకి ఆశ్చర్య పడ్డాడు. అతడు 6ఏళ్ళవాడుగా





ఉండగానే దేశంలోని ప్రముఖ గణిత శాస్త్ర నిపుణులు తయారుచేసిన 80 ప్రశ్నలకు సరైన సమాధానాలు చెప్పేశాడు.



వార్తా పత్రికల్లో ఈ వింతను చదివిన కాబూల్ యూనివర్సిటీ ప్రొఫెసర్లు ఆ కుర్రాణ్ని చదివించటానికి సిద్ధపడ్డారు. ఏడేళ్ళ వయసులోనే జలాల్ మెట్రిక్యులేషన్ పూర్తి చేశాడు.

పై చదువులకి అమెరికా తీసికెళ్ళగా న్యూయార్క్‌లోని మేధావులు ఆ కుర్రాడి మేధా సంపత్తికి ఆశ్చర్యపడ్డారు. అతనికి ఆల్‌జీబ్రాలోనూ, ఇంగ్లీషులోనూ తక్కువ పరిజ్ఞానం ఉండటం వల్ల వాటిలోనూ అతనికి తర్ఫీదు ఇచ్చారు. తర్వాత కాలేజీలో చేరాడు.

జలాల్ 12ఏళ్ళలో చదవాల్సిన పాఠశాల విద్యని 18నెలల్లో నేర్చుకున్నాడు. నాలుగేళ్ళ కళాశాల విద్యని ఒక్క ఏడాదిలో అయిందనిపించాడు. 11వ ఏటనే డాక్టరేట్ పట్టానూ పొందగలిగేడు.

## తాత ముత్తాత

తన మనవడి, మనవణ్ని ఎత్తుకుని ఆడించిన చండీఘుర్‌కు చెందిన 107 ఏళ్ళ హరి భగవాన్‌దాస్ కుటుంబంలో ఈనాడు అయిదు తరాల వారున్నారు.

మొదటితరం మనిషి కురువృద్ధుడైన దాస్‌గారే. రెండోతరం బుటారామ్ (70), హవేలీరామ్ (65) ఆయన పిల్లలు. మూడోతరం బుటారామ్ కుమారులైన మున్షీరామ్(50), బలదేవ్‌రాజ్ (48)లు. నాలుగో తరం మున్షీరామ్ కొడుకు రామన్ గులాతీ(25).

రామన్‌గులాతీకి 'పిప్లూ' అనే కొడుకు పుట్టగా తాను తాతా ముత్తాత అయినందుకు హరభగవాన్‌దాస్ ఆనందపడ్డాడు. దాస్‌గారి తండ్రి దేవీదయాల్



తన మునిమనుమడు రామన్‌గులాతీపుట్టిన మూడేళ్ళ తర్వాత 1956లో 108వ ఏట

చనిపోయాడట.

వారి కుటుంబం అయిదు తరాల శాఖలలోనూ మొత్తం 60 మంది జనాభా ఉన్నారు. దాస్‌గారి అమ్మమ్మ వైపు కుటుంబం కూడా ఒకే సమయంలో అయిదు తరాల్ని చూసిందట.

హరభగవాన్‌దాస్ 107 ఏళ్ళవాడై నప్పటికీ కళ్ళ జోడులేకుండా బాగా చూడగలడు. నిరక్షరాస్యుడై నప్పటికీ శిక్కు మత విషయాల్ని రోజూ వల్లె వేస్తూంటాడు. వారి కుటుంబంలో తల వెంట్రుకలకు నల్లరంగు వేసుకోవటం, కట్టుడు పళ్ళు పెట్టుకోవడం ఎవరికీ తెలీదు. గురుద్వార్‌కి వెళ్ళటమంత గొప్ప విషయం మరొకటి లేదని హరభగవాన్ దాస్ నమ్మకం.

## చోరాగ్రణి

'చార్లెస్ సోభ్రాజ్' అనే నరాంతకుడు విదేశ యాత్రికులతో స్నేహంచేసి, చనువుగా మెలగి, నమ్మకంగా వారి దగ్గరున్న డబ్బుని దోచుకునేవాడు. అయిదు భాషల్లో అనర్గళంగా మాట్లాడ గల అందమయిన ఆ కుర్రాడు లెక్క లేనన్ని హత్యలు, దోపిడీలు చేశాడట.

ఢిల్లీ చూసేందుకు వచ్చిన 'సాల్మన్' అనే ఓ ఫ్రెంచి యువకుడితో సోభ్రాజ్ స్నేహం కలుపుకొని, అతనికి ఒక అందాల భామను ఎరచూపి వశపర్చు కున్నాడు. అక్కడి మంచినీరు చాలా ప్రమాద భరితమయినదనీ, ఎలాంటి అపాయం కలుగకుండా ఉండేందుకు వేసుకోమని సాల్మన్‌కి కొన్ని మాత్ర లిచ్చాడు. విషపూరితమయిన ఆ మాత్రలు సేవించిన సాల్మన్ స్పృహ తప్పిపోగా, అతనివద్దగల డబ్బును దోచుకున్నాడు. రెండు రోజుల తర్వాత ఆ ఫ్రెంచి యువకుడు ఆసుపత్రిలో మరణించాడు. సోభ్రాజ్‌ను పోలీసులు పట్టుకున్నారు.



మొదట సోభ్రాజ్ 1971 అక్టోబరులో 20,000 డాలర్ల విలువచేసే నగల్ని దొంగిలించి ఢిల్లీ పోలీసులకు చిక్కాడు. తర్వాత జైల్ హాస్పిటల్ నుంచి తప్పించుకుని యూరప్ పారి పోయాడు.

తిరిగి 1976 జూలైలో భారతదేశం వచ్చి 20 మంది ఫ్రెంచి యాత్రికులతో స్నేహం కలుపుకొని, వారికి తాజ్ మహల్ మొదలైన ప్రదేశాలు చూపించి, ప్రమాదకరమయిన మంచినీటి నుంచి రక్షణగా వేసుకోమని వారికి కొన్ని మాత్రలిచ్చి స్పృహ తప్పించి దోచు కున్నాడు.

ఇప్పుడు సోభ్రాజ్ తీహార్ జైల్లో ఏకాంతవాసం చేస్తున్నాడు.





## తేలిక సైకిలు

అల్యూమినియమ్ స్టీలు కంటే మూడు రెట్లు బరువు తక్కువ. అంచేత సైకిల్ రేసుల్లో పాల్గొనే వారికోసం బహు తేలికగా ఉంది, దీర్ఘకాలంమన్నిక కోసం 'ఎన్సెపార్సిట్'కి చెందిన "హీంజ్ కెప్లర్" 'మిస్టర్ ఏవరేజ్' అనే సైకిల్‌ని రూపొందించాడు.

కంప్యూటర్ ఆధీనంలో నడిచే అల్యూమినియమ్ వెల్డింగ్ ప్లాంట్‌లో ఈ సైకిలు ఫ్రేము ఆటోమేటిక్ సిస్టమ్ ప్రకారం తయారవుతుంది.



అల్యూమినియమ్ సైకిళ్ళ ఉత్పత్తి భారీ ఎత్తున ప్రారంభమైన తర్వాత మూడు మడతలు వేసుకుని చంకలో పెట్టుకు వెళ్ళేందుకు వీలుగా కూడా ఈ సైకిళ్ళు తయారవుతాయి.

మొత్తం 13 కిలోలు బరువుమాత్రమే ఉండే ఈ సైకిలు సాధారణ సైకిళ్ళ బరువులో సగం ఉంటుంది. భవనాల పై అంతస్తుల్లో నివశించే వారు తమ సైకిళ్ళనుసునాయాసంగాఎత్తుకుపోవచ్చు.

## శత్రువా? మిత్రుడా?

పూర్వం విమాన యుద్ధంలో ఎదుటి విమానం మిత్రులదో, శత్రువులదో సరిగా తెలుసుకోకుండా ఒక్కోసారి పొరపాటున తమ జట్టు వారి విమానాలనే పేల్చివేయటం జరిగేది. ఇకముందు అలాంటి పొరపాట్లు జరగకుండా విమాన శాఖ సరికొత్త పద్ధతుల్ని ప్రవేశపెట్టింది.

యుద్ధ విమానాలలో అమర్చబడిన 'రాడార్' నూరు మైళ్ళ దూరంలోగల విమాన ఉనికిని తెలియజేస్తుంది. పది మైళ్ళ దూరంలో ఉన్నట్లయితే టెలివిజన్ స్క్రీన్‌మీదనే ఆ విమానాన్ని చూడవచ్చు.

"బ్రిటిష్ మార్కోనీ ఎవియోనిక్స్" తయారుచేసిన సున్నితమైన తక్కువ కాంతి గల టెలివిజన్ కెమేరా పనిచేసే విధానం ప్రత్యేక పద్ధతిలో ఉంటుంది.

మొదట పైలట్ 'రాడార్' ద్వారా విమాన ఉనికిని కనుగొంటాడు. అది మిత్ర విమానమో, శత్రు విమానమో నిర్ధారణ చేసుకునేందుకు టి.వి. టెలిస్కోప్ తెరపై చూస్తే, స్పష్టమైన ఆకారం కనిపించి, గుర్తించడానికి వీలుగా ఉంటుంది. పగటి వెలుగులోనే కాక, రాత్రి నక్షత్ర కాంతిలో కూడా విమానాలను గుర్తించేందుకు ఇందులో ఏర్పాట్లున్నాయి.

Edited, Printed and Published by Ramoji Rao Ch for Vasundhara Publications Printed at Colorama Offset Printers, Hyderabad.
Office Address : CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad500 004

# సౌమ్య

సకుటుంబ
మాస పత్రిక

## నవంబరు 1వ తేదీన వెలువడుతోంది.

విజయవాడనుండి వెలువడే విశిష్ట వైవిధ్యంగల తెలుగు మాసపత్రిక "సౌమ్య"లో మారుతున్న ప్రపంచానికి, నేటి సమాజానికి ప్రతిరూపంగా, కవి కలం కాలాన్ని బట్టి కథనం త్రొక్కుతుంది.

విభిన్న భావాలుకల నేటి తెలుగు పాఠకలోకానికి ఒక పూర్తి నవల, ఒక సంక్షిప్త నవల, రెండు సీరియల్ కథలు, మినీ కథలు, బాపుగారి కార్టూనులతో, ఆకర్షణీయమైన చిత్రాలతో, హృదయాలను కదిపి, కుదిపి, అలరించి, ఆనందింపజేసేందుకు సర్వాంగ సుందరంగా మీ కోసం వస్తోంది.

నవ కథానురక్తులు, రసజ్ఞులు అయిన తెలుగు పాఠకుల మనసులను ఆకట్టుకొనే ఈ మనోజ్ఞ మాస పత్రికను పిన్నలు, పెద్దలు, వృద్ధులు చదివి ఆనందిస్తారనీ, ఆదరిస్తారనీ ఆశిస్తున్నాం.

ఈ సునిశిత, సద్విమర్శనాత్మక మాసపత్రిక రంగుల ఆఫ్‌సెట్ ముద్రణతో ప్రతి నెలా 1వ తేదీకే మీ ముందుకొస్తుంది.

వెల
రు.3/-
మాత్రమే



Marketed By
**Margadarsi Marketing**
PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad-500 004

